# గ్రంథాలయ సూచీకరణ

## (AACR-2 ప్రయోగ దీపిక)

డాక్టర్ వెలగా వెంకటప్పయ్య

సంపాదకుడు

పాతూరి విజయకుమార్

ప్రతులకు

న్యూ స్టూడెంట్ బుక్ సెంటర్

అరండల్ పేట, గుంటూరు - 2

# ముందుమాట

తెలుగు పుస్తకాలు హెచ్చుగా ఉండే మన గ్రంథాలయాలను దృష్టిలో ఉంచుకొని ఈ గ్రంథాన్ని రూపొందించాను. అంతేగాక డిగ్రీ, సర్టిఫికేట్ స్థాయిలలో గ్రంథాలయ శాస్త్రం అభ్యసించే విద్యార్థులు ఈ గ్రంథాన్ని వినియోగించుకోవచ్చు.

ప్రధానంగా ఈ గ్రంథాన్ని ఆంగ్లో అమెరికన్ నియమాలు 2 : 1978, ఇ. జె. హంటర్, యస్. జె. ఫాక్స్ రూపొందించిన ఏ. ఏ. సి. ఆర్–2 లోని ఉదాహరణలను అనుసరించి తయారు చేశాను. అవి రెండు మౌలిక రచనలు గనుక నియమాల అవగాహనలో సందేహాలుంటే మూల గ్రంథాలను చూడడం మంచిది. సొంత నిర్ణయాలు మంచిది కాదు.

ఈ గ్రంథానికి సంపాదకత్వం వహించిన మిత్రులు, సహృదయులు పాతూరి విజయకుమార్‌గారు ఈ గ్రంథ రచనలో అనేక సూచనలు, సవరణలు ఎంతో శ్రమ తీసుకొనిచేసి ఈ గ్రంథానికి నిండుతనం చేకూర్చారు. అంతేగాక గ్రంథాలయ సూచీకరణము — అనే వారి గ్రంథం నుంచి ఈ పుస్తకంలోని ఐదవ అధ్యాయం '' సూచీకరణ ఉపసూత్రాలు '' పునర్ముద్రించుకోడానికి అనుమతించినందుకు ప్రత్యేక కృతజ్ఞతలు.

రాత ప్రతిని ఆసాంతం చదివి సరిచూచి పెట్టిన మిత్రులు కె. యస్. శర్మ, రాధామనోహరన్ '' గారికీ,

ఈ రచనను ఎప్పటికప్పుడు ముచ్చటగా సాపు రాస్తూ, ఎంతో ఉత్సాహాన్నిచ్చిన మిత్రుడు వి. బందా గారికీ–

క్లిష్టతరమైన ముద్రణను సుసాధ్యం చేసి సహకరించిన టి. నరసింహారావుకు —

ఈ పుస్తక ముద్రణ చేపట్టి, ఎన్నో ఒడుదుడుకులకు తట్టుకొని, దీన్ని అందంగా సకాలంలో ముద్రించిన డాన్‌బోస్కో ప్రెస్ సిబ్బందికి, దాని మేనేజరు బ్రదర్ గ్రెగరిగారికి కృతజ్ఞతలు తెలుపుకోవడం నా బాధ్యత. సోదర గ్రంథపాలకులు ఈ ప్రయత్నాన్ని హర్షిస్తారని నమ్ముతాను. సెలవు.

— రచయిత

# విషయ సూచిక

– 0 –

# మరో మాట

1 సోదర గ్రంథపాలకులకు ప్రత్యేకంగా మనవి చేసేదేమంటే — నియమాలు అనుసరించడంలో ప్రత్యేక శ్రద్ధ చూపమని మాత్రమే, నిర్దుష్టమైన. ప్రయోజన కరమైన సూచీపైనే గ్రంథాలయ వినియోగం ఆధారపడి ఉంటుంది. మంచి సూచీ లేని కొరత మరే వ్యక్తి , శక్తీ తీర్చలేదని మాత్రం గుర్తుచేస్తున్నాను.

2 ఈ గ్రంథ రచన సాధ్యమైనంత వరకు తాజా తెలుగు బాషలోనే సాగింది. నవీన శబ్ద ప్రయోగాల చేర్పు జరిగింది. ఐనా ''వాఙ్మయ ''అనేపదానికి బదులుగా కొన్ని పుటలలో ''వాజ్ఞయ,, అని అచ్చు పడడం క్షమించరాని తప్పే! అందుకు క్షంత వ్యులం. ఇలాగే మరికొన్ని తప్పులు ఉండవచ్చు. సహృదయంతో సరిదిద్దుకోగలరు.

3 డాక్టర్ రంగనాథన్ ఎప్పుడూ గ్రంథాలయ సూచీకార్డులను చేత్తోనే రాయాలని, పరిచయ సంకేతాలను పెన్సిలుతోనే వేయాలని చెప్పేవారు. ఈవిధానం చేర్పులకు మార్పులకు అనువుగా ఉంటుందని వారి అభిప్రాయం. వాస్తవానికి ఒక్కోసారి సూచీ పద్దును సూచికి నూరుపాళ్ళు న్యాయం చేస్తూ లెటర్ ప్రెస్‌లో ముద్రించడం అసాధ్యం. అందుకని ప్రతి ఉదాహరణ చేత్తోరాసి, బ్లాకు చేయించి ప్రచురించడం అత్యంత వ్యయప్రయాసలతో కూడుకొన్న పని. ఈ గ్రంథంలో ఉదాహరణల నిచ్చిన పద్దులు కొన్ని చోట్ల ముద్రణలో నియమాల కనుగుణంగా లేనిమాట వాస్తవమే. స్వల్ప మైన లోపాలుకొన్ని జరిగాయి. 150; 176; 199; 245వ పుటలలోని పద్దులకు సరైన పద్దులకు సమునా పద్దులలో ఇచ్చాము. ఈలోటు తెలుసు కొనేందుకు సరైన విరామచిహ్నాలు, గుర్తులు, స్పేసులు గల పద్దులు సమూనాగా కొన్ని ఇస్తున్నాము. చూడండి. ఈ నమూనా పద్దులను బట్టి ముద్రిత గ్రంథంలోని పద్దుల స్థిరస్వరూపాన్ని ఊహించుకోవాలి.

ఇది నా ప్రత్యేకమనవి——

ఇహ కొన్ని నమూనా పద్దులను తిలకించండి.

—రచయిత

పరిచయ
సంకేతం    శీర్షిక రచయిత నామం (జనన-మరణ తేదీలు)
గ్రంథనామం=సమాంతర నామం: గ్రంథ ఉప
నామం/ రచనకు బాధ్యులు; ఇతరులు. —
ముద్రణ వివరం. — ప్రచురణ స్థలం:
ప్రచురణ సంస్థ, ప్రచురణ తేదీ.
ప్రవేశసంఖ్య    పుటలు: చిత్రాలు; కొలతలు. — (గ్రంథమాల/
మాలకు బాధ్యులు; సంఖ్య)
ఇతర వివరాలు
అంతర్గత ○ తోడు పుస్తక ప్రమాణ సంఖ్య
ఇతర ○ సూచ్యాల వివరాలు

చూడండి పుట 65

923.2
గాంధీ-ఆ    గాంధీ, మోహన్‌దాస్ కరంచంద్ (1869-1948)
ఆత్మకథ/ మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ;
అనువాదం వేటూరి శివరామశాస్త్రి. — నవ
కూర్పు. — హైదరాబాదు; గాంధీ సాహిత్య
ప్రచురణాలయం; మచిలీపట్నం: త్రివేణి
పబ్లిషర్సు, 1968.
1030    xxi, 803పు.; 20సెం.మీ.
1 మహాత్మా గాంధీ - స్వీయ చరిత్ర I శివ
రామశాస్త్రి, ○ వేటూరి, అను. II గ్రం.నా.

చూడండి పుట 33,176

894.8272
వే.కూ-ప్ర కృష్ణరావు, జి.వి.
భిక్షాపాత్ర: నాటిక / జి.వి. కృష్ణరావు. —
48–71 పు.; 21 సెం.మీ.
ప్రసిద్ధ నాటికలు – లో / సంపాదకుడు
1664 కూర్మా వేణుగోపాలస్వామి. — తెనాలి:
కాత్యాయని ప్రచురణలు, 1961.



చూడండి పుట 91

894.8272
అ.గు–మె అప్పారావు, గురజాడ (1861-1915)
మెట్టు మొదటి కన్యాశుల్కం/గురజాడ
అప్పారావు; వ్యాఖ్యాత బంగోరె. — నెల్లూరు:
వ్యాఖ్యాత, 1969.
1003 xxxiv, 28, 174 పు.; 23 సెం.మీ.

I నాటకాలు I బంగోరె, వ్యా. II గ్రం.నా.



చూడండి పుట 150

089.4827
ప్రసా - ప్ర

ప్రసార తరంగిణి: రేడియో కార్యక్రమాలపై
వ్యాస సంకలనం / అయ్యగారి వీరభద్ర
రావు... [తదితరులు]; కూర్పు పన్నాల
సుబ్రహ్మణ్యభట్టు. — . పిఠాపురం:
సామాన్య ప్రచురణలు, 1986.
ప్రచార సాధనాల వినియోగంపై 17 మంది
ప్రముఖుల అనుభవ సారం. ఆలోచనకీ
పరిశోధనకీ ఆది గ్రంథం.

1048   176 పు.;



22 సెం.మీ.
(చూడు తదుపరి కార్డు)

---

2

089.4827
ప్రసా-ప్ర

ప్రసార తరంగిణి: రేడియో...
1 రేడియో కార్యక్రమాలు 1 వీరభద్రరావు,
అయ్యగారి II సుబ్రహ్మణ్యభట్టు, పన్నాల,
కూర్పు.



చూడండి పుట 199

336.2026
ఆంధ్ర-ఆం ఆంధ్రప్రదేశ్
[అమ్మకపు పన్ను చట్టము]
ఆంధ్రప్రదేశ్ అమ్మకపు పన్ను చట్టం/
[సంకలనం పుత్సల సత్యనారాయణ]. —
విజయవాడ: విశాలాంధ్ర, 1957.
1087 130పు.; 19 సెం.మీ.

1 ఆంధ్రప్రదేశ్ - పన్నులు I శీ.నా.



చూడండి పుట 245

పరిచయ సంకేతం పత్రిక పేరు/ ప్రచురణకు బాధ్యులు. —
కూర్పు వివరాలు. — సంపుటి, సంచికాది
వివరాలు. — ప్రచురణ స్థలం: ప్రచురణ
కర్త, తేదీ —
ప్రవేశ సంఖ్య భౌతిక వివరాలు
ఆవృత్తి వివరణ
అంతర్జాతీయ పత్రిక ప్రమాణ సంఖ్య

ఇతర  కార్డుల వివరాలు

చూడండి పుట 247

# సాంకేతిక పదవివరణ

అంతర్జాతీయ గ్రంథాలయ సంఘాల సమాఖ్య ( ఇంటర్నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ లైబ్రరీ అసోసియేషన్సు అండ్ ఇన్‌స్టిట్యూషన్స్ – 1929 IFLA ): గ్రంథాలయ రంగంలో అంతర్జాతీయ అవగాహన, సహకారం, పరిశోధనకు ఏర్పడిన సంస్థ. విశ్వజనీనంగా ప్రచురణల లభ్యం (U A P), విశ్వజనీన వాఙ్మయ నియంత్రణ (U B C) అంతర్జాతీయ ప్రమాణ వాఙ్మయ వర్ణన (I S S D) మొదలైన శాశ్వత ప్రయోజన పథకాలు చేపట్టి విశ్వ విఖ్యాతి చెందింది.

అంతర్జాతీయ ప్రమాణ ధారావాహిక సంఖ్య ( ఇంటర్నేషనల్ స్టాండర్డ్ సీరియల్ నంబర్ – I S S N ): అంతర్జాతీయంగా గ్రంథాలయ రంగంలో ధారావాహిక ప్రచురణలను, పత్రికలను గుర్తించడానికి ఏర్పడిన ఎనిమిదంకెల సంఖ్య. మొదటి ఏడంకెలు పత్రికను గుర్తించడానికి, ఎనిమిదో అంకె అదుపు చేయడానికి ఉపకరిస్తుంది. ఉదా : I S S N 0068 – 2578 బ్రిటిష్ స్టాండర్డ్సు ఇయర్ బుక్ 1982.

అంతర్జాతీయ ప్రమాణ పుస్తక సంఖ్య (ఇంటర్నేషనల్ స్టాండర్డ్ బుక్ నంబర్ I S B N ): అంతర్జాతీయంగా గ్రంథాలయ రంగంలో పుస్తకాలను గుర్తించటానికి పదంకెల సంఖ్య. ఇందు మొదటి భాగంలో దేశం గుర్తు, రెండో బాగంలో ప్రచురణకర్త గుర్తు, మూడో భాగంలో గ్రంథ నామ గుర్తు,నాలుగోభాగంలో అదుపుకు గుర్తు ఉంటాయి. ఉదా : I S B N 0 – 333 – 37261 – 1 మాక్మిలన్ డిక్షనరీ ఆఫ్ ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ 1985.

అంతర్జాతీయ ప్రమాణ వాఙ్మయ వర్ణన (ఇంటర్నేషనల్ బిబ్లియోగ్రాఫిక్ డిస్క్రిప్షన్ – I S B D ): అంతర్జాతీయ గ్రంథాలయ సంఘాల సమాఖ్య గ్రంథాలయ సూచీకరణ పద్ధతులలో విశ్వవ్యాప్తం, సమరూపత సాధించేందుకు నిర్ణయించిన వర్ణన. ఇప్పటి వరకు ఈ దిగువ ఉదహరించిన అంశాలపై వర్ణనలను నిర్ణయించడం జరిగింది.

| | | |
|---|---|---|
| ISBD (M) | మోనోగ్రాఫిక్ | 1978 |
| ISBD (S) | సీరియల్స్ | 1977 |
| ISBD (G) | జనరల్ | 1977 |
| ISBD (CM) | కార్టోగ్రాఫిక్ మెటీరియల్స్ | 1977 |
| ISBD (A) | యాంటిక్వేరియన్ | 1980 |

ఇంకా మరికొన్ని ప్రమాణాలు ప్రచురిత మయ్యాయి. ఈ వర్ణనలనే ఆంగ్లో అమెరికన్ సూచీ నియమాల తయారీలో స్వీకరించడం జరిగింది.

అల్లిక విధానం (నెట్వర్క్) : పరస్పర సంబంధాలుగల ఒక విధానం అందరి సహకారంతో ఒక కేంద్రంలో సూచీ వివరాలు కేంద్రీకరించి అందరూ వినియోగించు కుంటారు. ఉదా : రీసెర్చి లైబ్రరీస్ ఇన్ఫర్మేషన్ నెట్వర్క్ – RLIN). ఇలాటి వాటిలో లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ యాంత్రిక పఠన సూచీ – MARC జగత్ప్రసిద్ధమైనది.

ఆటోమేషన్: మానవవనరులు తక్కువగా, యంత్రవిజ్ఞానం ఎక్కువగా వినియోగించే సాంకేతిక విజ్ఞానం.

ఐక్యరాజ్య శాస్త్రీ సాంకేతిక సమాచార విధానం ( యునైటెడ్ నేషన్స్ ఇన్ఫర్మేషన్ సిస్టమ్ – UNISIST ): సమాచార విజ్ఞానంలో ప్రమాణాలు సిద్ధం చేయడం, సమాచార విధానాలు, నెట్వర్క్లు, సమాచార బదిలీకి కృషి, అభివృద్ధి పొందుతున్న దేశాలకు సాయం చేయడం దీని లక్ష్యం. అమెరికా, బ్రిటన్, కెనడా, ఇండియా మొ॥ దేశాలలో దీని శాఖలున్నాయి.

కామ్ (కంప్యూటర్ అవుట్పుట్ మైక్రోఫార్మ్ – COM) : కంప్యూటర్ ద్వారా సూక్ష్మరూపంలో ఫిల్మ్ / ఫిచ్ మీద కాగితం మీద కంటే తక్కువ ఖర్చుతో నూరు రెట్లు వేగంతో ముద్రించడం.

కేంద్రీ కృత సూచీకరణ (సెంట్రలైజ్డ్ కేటలాగింగ్) ఒక కేంద్ర సంస్థచే సూచీకరణ చేసి, మెషీన్‌తో చదివే రూపాలు లేదా కార్డులు ముద్రించి పంపిణీ చేసే కార్యక్రమం.

ఉదా:— లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్, బ్రిటిష్ జాతీయ గ్రంథసూచి పథకాలు.

గ్రంథ సూచీ / వాఙ్మయ సూచీ (బిబ్లియోగ్రఫి) : భౌగోళిక పరిధి, విషయం, భాషలతో నిమిత్తం లేకుండా ప్రచురితమైన పఠన సామగ్రి జాబితా.

గ్రంథాలయ సహకారం (లైబ్రరీ కోఆపరేషన్) : సూచీకరణ ఖర్చు, ఒక పరిధి లోని నెట్వర్క్ అన్ని గ్రంథాలయాలు సమానంగా పంచుకోనడం.

గ్రంథాలయ సూచీ (లైబ్రరీ కేటలాగ్) :ఒక గ్రంథాలయంలోగల పఠన పరికరాల జాబితా.

టెర్మినల్ : సమాచారం స్వీకరించి పంపే సాధనం.

ధారావాహిక ప్రచురణ (సీరియల్) : ఒక సంఖ్యతో/కాలక్రమ సంఖ్యతో నిర్దిష్ట కాలపరిమితి ఉండి / లేక వెలువరించే ప్రచురణలు. ఎ.ఎ.సి.ఆర్ —2లో పత్రికలు, దినపత్రికలు, వార్షిక నివేదికలు, అనుభవాలు, సభావృత్తాంతాలు, క్రమ సంఖ్యతో ప్రచురితమయ్యే చిన్నపుస్తకాలు (మోనగ్రాఫ్స్) కూడ ధారావాహికల క్రిందే వస్తాయి

నియమాలు (రూల్స్) : కల్పం / స్మృతి (కోడ్) అన్ని సమానార్థకాలలో ఉపయోగించడం జరిగింది. అయితే బ్రిటన్‌కు చెందిన కటర్ ''రూల్స్'' అన్నారు. జర్మన్ దేశానికి చెందిన ''ప్రష్యన్ ఇన్‌స్ట్రక్షన్స్'' అన్నారు. భారతదేశానికి చెందిన డా. రంగనాథన్ ''కోడ్'' అన్నారు. అన్నిటా రూల్స్ బాగా వ్యాప్తి చెందిన పదం.

పరిశోధనా గ్రంథాలయాల సమాచార వలయం (రీసెర్చ్ లైబ్రరీస్ ఇన్ఫర్మేషన్ నెట్వర్క్)

ప్యారిస్ సూత్రాలు (ప్యారిస్ ప్రిన్సిపల్స్): గ్రంథాలయ సూచీకరణలో గ్రంథకర్త గ్రంథనామపు పద్దులు తయారు చేయడానికి అంతర్జాతీయ గ్రంథాలయ సంఘాల సమాఖ్య 1961లో ప్యారిస్‌లో ఏర్పాటు చేసిన మహాసభ ఈ 12 సూత్రాలను ప్రతి పాదించి – ఆమోదించింది. అంతర్జాతీయంగా సూచీకరణ ప్రమాణానికి ఈ సూత్రాలు చాలా బాగా తోడ్పడ్డాయి.

మైక్రో రూపం: సూక్ష్మరూపం. ఇవి కార్డు, ఫిల్మ్, ఫిచ్ రూపంలో ఉంటాయి. 6X4 అంగుళాల మైక్రోఫిచ్‌పై 60 రూపాలు (సుమారుగా పుటలు) ఉంటాయి. వీటిని మైక్రో ఫిల్మ్ రీడరు ద్వారా చదవవచ్చు. ప్రింటర్ ద్వారా కాగితంపై మామూలు సైజులో ముద్రించవచ్చు. సులభంగా ఎక్కడికైనా తీసికెళ్ళచ్చు.

యాంత్రిక పఠన సూచీ (మెషీన్ రీడబుల్ కేటలాగింగ్ MARC) : గ్రంథాలయ సూచీ వివరాలను మాగ్నటిక్ టేపులపై రికార్డు చేసి కావలసివచ్చినపుడు ఉపయోగించుకోవడం, భాగస్వాములకు టేపుల ప్రతులు అందించటం. దీన్ని 1966లో లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ ప్రారంభించి, మార్పులు చేర్పులతో నేటికీ కొనసాగిస్తోంది. ఈ పథకంలో 50కి పైగా గ్రంథాలయాలు పాల్గొంటున్నాయి. ఇటీవల బ్రిటీషు జాతీయ గ్రంథ సూచి టేపుల మీద లభిస్తున్నది.

రచయిత (ఆథర్) : గ్రంథ ఆవిర్భావానికి కారణ భూతుడైన వ్యక్తి. వీరు, స్త్రీ పురుషులు కావచ్చు. ఇద్దరు అంత కంటే ఎక్కువ మంది కావచ్చు. ప్రభుత్వం, సంస్థ, సంఘం, సభ, సదస్సు, రచయిత పాత్ర వహించవచ్చు. ఎ.ఎ.సి.ఆర్– 2 ప్రకారం చిత్రకారులు, సూచీ కర్తలు, స్వరకర్తలు, దేశపటాలు తయారు చేసిన వారు,ఛాయాగ్రాహకులు, రికార్డు చేసినవారిని రచయితలుగా పరిగణించవచ్చు.

వాఙ్మయసూచి (బిబ్లియోగ్రఫీ) : ఇది గ్రంథసూచీకి దాదాపు పర్యాయ పదమే. అయితే ప్రతికా రచనలు, కరపత్రాలు మొదలైన వాటి సూచీలను వాఙ్మయ సూచి అనడం పరిపాటి.

విశ్వ జనీన వాఙ్మయ నియంత్రణ (యూనివర్సల్ బిబ్లియోగ్రాఫిక్ కంట్రోల్ U B C) : 1969లో కోపన్హేగన్‌లో జరిగిన సూచీకరణ నిపుణుల సభ అంతర్జాతీయ సమాచార మార్పిడి పై అంతర్జాతీయ ప్రమాణ వర్ణన వివరాలతో ప్రపంచ దేశాలకు సంబంధించిన ప్రచురణల ప్రాథమిక సమాచారం అందరూ మార్పిడి చేసుకోవడం,నియంత్రణ చేయడం, వాస్తవానికి ఈ పథకం విశ్వజనీన వాఙ్మయ లబ్ధి పథకానికి అనుసంధానంగా ఉంటుంది.

విశ్వజనీన వాఙ్మయ లభ్ధి (యూనివర్సల్ అవైలబిలిటీ ఆఫ్ పబ్లికేషన్స్ U.A.P): అంతర్జాతీయ గ్రంథాలయ సంఘాల సమాఖ్య, యునెస్కో సహకారంతో ఈ పథకం చేపట్టింది. చదువరికి అవసరమైన అనగా ముఖ్యంగా ఆర్ధిక, సామాజిక, విద్య, స్వయం అభివృద్ధి కోసం చేసే కృషిలో పఠన సామగ్రి ఏ రూపంలో ఉన్నా ఎప్పుడైనా లభించేట్లు చేయడం.

సమీకృత సూచి: (యూనియన్ కేటలాగ్) ఒక పరిధిలో గల కొన్ని గ్రంథాలయాలలో ఉన్న పఠన పరికరాల జాబితా.

సూచీకర్త (కేటలాగర్) : గ్రంథాలయ సూచీ తయారు చేసేవాడు.

సూచీ నిర్మాత : గ్రంథాలయ సూచీ నియమాలు / స్మృతులు కల్పం తయారు చేసేవాడు.

సొరుగు పట్టిక (షెల్ఫ్‌లిస్ట్) ఒక గ్రంథాలయంలో పుస్తకాలు అమర్చిన క్రమంలో ఏర్పాటుచేసిన కార్డుల వరసతో పుస్తకాల నిలువ సరిచూడడానికి బాగా ఉపకరిస్తుంది.

— 0 —

# 2 సూచీకరణ ప్రయోజనం

నహి జ్ఞానేన సదృశమ్
పవిత్ర మిహ విద్యతే

అని భగవద్గీత చెబుతోంది. అంటే ఈ ప్రపంచంలో జ్ఞానంతో సమానమైనదిగా పవిత్రమైంది మరొకటి లేదనిభావం. కనుక భౌతిక ఆనందాలు, ఆధ్యాత్మిక చింత నలు అలౌకిక ఆలోచనలు—అన్నిటినీ మించి జ్ఞాన సముపార్జనకు సముచిత స్థానం ఉన్నట్లు భారతీయ సంస్కృతి చాటి చెబుతోంది.

జ్ఞాన సముపార్జనకు ఒకప్పుడు ఆశ్రమాలు, మఠాలు, మందిరాలు నిలయా లైతే – నేడు విద్యాలయాలు, గ్రంథాలయాలు విజ్ఞాన ప్రచారానికి కల్పతరువులు. ఈ సంస్థల ప్రగతిపైన భవితవ్య పురోగతి ఆధారపడి ఉంది. ముఖ్యంగా ఈ సంస్థలు నిర్వహించే గ్రంథాలయాలు, అందుగల విషయాలను వేగంగా, సమగ్రంగా, స్పష్టంగా చదువరులకు తెలిపే గ్రంథాలయ సూచీ నిర్మాణంపై గూడ భావితరాల ప్రగతి ఆధారపడి ఉంటుంది. ఇది అనుభవం మీద రుజువైన విషయం.

గ్రంథాలయ సూచీ

వివరాలు తెలిపేదాన్ని సూచీ అంటారు. ఒక గ్రంథాలయంలోగల పుస్తకాల వివరాలు తెలిపేదాన్ని గ్రంథాలయ సూచీ (లైబ్రరీ కేటలాగ్) అంటారు. ఈ సూచీని తయారు చేసే విధానాన్ని సూచీకరణ (కేటలాగింగ్) అంటారు. గ్రంథాలయ శాస్త్రంలో సూచీ కరణకు ఎంతటి ప్రాధాన్యం ఉందో, గ్రంథాలయ నిర్వహణలో కూడ గ్రంథాలయ సూచీకి అంతటి ప్రాధాన్యం, ప్రయోజనం ఉంది. మరో మాటలో చెప్పాలంటే ఒక గ్రంథా లయానికి వర్గీకరణ ప్రాణ మైతే సూచీకరణ, హృదయం సమానమైనది. కనుక ఈ రెండూ విధిగా ఉన్నప్పుడే గ్రంథాలయం సజీవంగా ఉంటుంది. ప్రయోజనకరంగా ఉంటుంది.

## సమగ్ర సూచీ

ఉపయోగం కోసం పుస్తకాలు (బుక్స్ ఆర్ ఫర్ యూస్) అన్నారు గ్రంథాలయ శాస్త్ర తపస్వి డాక్టర్ రంగనాథన్ తాను రూపొందించిన గ్రంథాలయ శాస్త్ర పంచ సూత్రాలలో తొలి సూత్రంగా. కాబట్టి పుస్తకాల వినియోగం బాగా ఉండాలంటే ఏ విషయంపై ఎన్ని పుస్తకాలున్నాయో, ఏ పుస్తకాలలో ఏ విషయాలున్నాయో తెలిపే దర్పణం కావాలి. దాన్నే గ్రంథాలయ సూచీ అంటారు. ఒక గ్రంథాలయానికి తీర్చిదిద్దబడిన భవనం ఉండవచ్చు. అపూర్వమైన గ్రంథ సంచయం ఉండవచ్చు. చిత్తశుద్ధితో, దీక్షతో పని జేసే సిబ్బంది ఉండవచ్చు. అయితే వీటన్నిటికీ తోడు సర్వ సమగ్రమైన సూచీ ఉన్నప్పుడే హంగులన్నీ రక్తి కడతాయి. ఫలితానికి వస్తాయి. వాస్తవానికి కొన్ని నిర్దిష్ట నియమాలను అనుసరించి తయారు చేసిన సూచీ గ్రంథాలయ ప్రతిష్టను ఇనుమడింప జేస్తుంది. పుస్తకాల వినియోగాన్ని పెంచుతుంది. ముఖ్యంగా స్వేచ్ఛోపలబ్ధి (ఓపెన్ యాక్సెస్) సౌకర్యంలేని గ్రంథాలయాలలో సూచీ పుస్తకాల అమరిక (అరేంజిమెంట్)ను చెప్పక చెబుతుంది.

## నవీన సూచీ

ఇటీవలి కాలంలో విజ్ఞాన మానవీయ, సమాజశాస్త్రాలలో ఊహకందనంతటి అభివృద్ధి కనిపిస్తోంది. ఒక దాని ప్రగతికి మరొకటి దోహదం ఇస్తోంది. ఒక దాని ప్రభావం మరొకదాని ప్రభావానికి నిరవధికంగా చేయూత నిస్తోంది. ప్రగతి పథంలో గత శతాబ్దం కంటే ఈ శతాబ్దంలో, నిరుటికంటే ఈ ఏడూ పరిశోధనలలో, ప్రయోగాలలో, పరిశ్రమలలో, వృత్తులలో, ప్రవత్తులలో, ప్రజావసరాలలో మార్పులు వస్తున్నాయి. ఈ మార్పుల కనుగుణంగా గ్రంథాలయాలలో పుస్తక సంచయం పెరుగు తున్నది. ఆ విధంగా పెంపొందిన గ్రంథజాలం ప్రజావసరాలను ఆదుకోవడానికి నవీన విధానంలో శాస్త్రీయంగా తయారు చేసిన గ్రంథాలయ సూచీ విధిగా ఉండాలి. సూచీకి ప్రత్యామ్నాయం మరొకటి లేదు. దాని ప్రత్యేకత దానిదే.

## సూచీ విధులు

గ్రంథాలయ సూచీ విధులను, ప్రయోజనాలను గురించి సూచీకరణ నియమాలకు శ్రీకారం చుట్టిన ఛార్ల్స్ ఏమీ కటర్ నాటినుంచి, 1961లో పారిస్‌లో సూచీ కరణ నియమాలపై జరిగిన అంతర్జాతీయ సదస్సు వరకు, ఎందరో అనుభవజ్ఞులు

అనేక విషయాలుచెప్పారు. అవి ఈ విధంగా ఉంటాయి. నియమాను సారంగా తయారు చేసిన గ్రంథాలయ సూచీ వలన ఒక గ్రంథాలయంలో —

1 ఒక గ్రంథకర్త రచనలు ఎన్ని కలవో తెలియాలి.

2 ఒక గ్రంథం ఉందో లేదో తెలియాలి.

3 ఏ విషయంపై ఎన్ని పుస్తకాలున్నాయో తెలియాలి.

4 ఒకానొక సంపాదకుడు, చిత్రకారుడు, వ్యాఖ్యాత, టీకాకర్త, అనువాదకుడు సంకలన కర్త, పరిష్కర్త తాలూకు రచనలు ఎన్ని గలవో తెలియాలి!

అంతేగాక –

5 ఒక గ్రంథం తాలూకు భౌతిక వివరాలు అనగా—ప్రచురణకర్త, ప్రచురణ తేదీ, పుటలు, పటాలు, సైజు, ముద్రణసంఖ్య, ప్రతులసంఖ్య, ఇత్యాది వివరాలు తెలియాలి.

అంతర్జాతీయ సభ సిఫారసులు

1961 లో ప్యారిస్‌లో జరిగిన అంతర్జాతీయ సూచీకరణ సూత్రాల మహాసభ సూచీ విధులను గురించి ఈ తీరుగా సిఫారసు చేసింది. సూచీ ఒక గ్రంథాలయంలో గల పుస్తకాలకు సంబంధించి—

1 గ్రంథకర్త, గ్రంథనామం, లేదా—

2 గ్రంథకర్త పేరు తెలియక గ్రంథనామం మాత్రం ఉన్నా లేదా

3 గ్రంథకర్త, గ్రంథనామం సరిగా గుర్తులేకపోతే, ఏదైనా ప్రత్యామ్నాయ గ్రంథనామం గుర్తున్నా—

పుస్తకాన్ని గుర్తించడానికి సమర్ధవంతమైన సాధనం కావాలి. అంతేగాక ఒక గ్రంథ కర్త రచనలు ఆలోచనలకు సంబంధించిన ఫలానా ముద్రణలు ఉన్నవా లేదా తెలుసుకో డానికి సూచీ ఉపయోగించాలి ఈవిధులను నిర్వర్తించడానికి పైన ఉదహరించిన ప్రతి అంశానికి ఒకకార్డు ఉండాలి. దీంతోబాటు ఒక గ్రంథకర్తకు వేర్వేరు పేర్లున్నా, గ్రంథ నామం నుంచిగాక మరొకచోట నుంచి గ్రంథకర్త పేరు సంపాదించినా, ఆ రచనరూపాం

దించడానికి అనేకమంది రచయితలు సహకరించినా, గ్రంథకర్తృత్వం వేర్వేరు రచయి తలకు ఆపాదించినా, ఈ పుస్తకం అనేక గ్రంథనామాలతో ఇంతకు పూర్వం తెలిసి ఉన్నా — అన్నిటికీ వేర్వేరు కార్డులు చేసినప్పుడే సూచీకి న్యాయం కలుగుతుంది. ప్యారిస్ సూత్రాల ప్రకారం సూచీలో మూడు రకాల పద్దులుండాలి.

1 ప్రధాన పద్దులు (మెయిన్ ఎంట్రీస్)
2 ఉపపద్దులు (యాడెడ్ ఎంట్రీస్)
3 మార్గసూచికలు (రెఫరెన్సెస్)

ప్రతి పుస్తకానికి ప్రధాన పద్దు విధిగా ఉండాలి. అవసరాన్ని బట్టి ఉపపద్దులు అన్నీ కొన్ని ఉంటాయి. మార్గ సూచికలు ఆప్పుడప్పుడు అవసరమౌతూంటాయి.

## ప్రతిరూపాలు

ఇంతవరకు మనం గ్రంథాలయ సూచీని గురించి కొన్ని విషయాలు తెలుసుకున్నాం. తయారీలో, ప్రయోజనంలో, వాడుకలో దీనిని పోలినవి మరికొన్ని ఉన్నాయి. వాటిలో సమీకృతసూచీ, సొరుగు పట్టిక, ప్రవేశ పట్టిక గ్రంథసూచీ, ప్రచురణ కర్తల సూచీ, పుస్తక విక్రేతల సూచీ, ముఖ్యమైనవి.

1 ఒక గ్రంథాలయంలోగల పుస్తకాల వివరాలు తెలిపే దాన్ని గ్రంథాలయ సూచీ (లైబ్రరీ కేటలాగ్) అంటారు.

2 ఒక నిర్ణీత పరిధిలోగల గ్రంథాలయాల తాలూకు పుస్తకాల వివరాలు తెలియజేసేదాన్ని సమీకృతసూచీ (యూనియన్ కేటలాగ్) అంటారు.

3 ఒక గ్రంథాలయంలో పుస్తకాలు అమర్చిన క్రమాన్ని తెలియజేసే దాన్ని సొరుగు పట్టిక (షెల్ఫ్ లిస్ట్) అంటారు.

4 ఒక గ్రంథాలయంలో పుస్తకాలు సంపాదించిన క్రమంలో భౌతిక వివరాలు నమోదు చేసిన దాన్ని ప్రవేశ పట్టిక (యాక్సెషన్ రిజిష్టర్) అంటారు.

5 ఒక ప్రత్యేక విషయం మీద, ఒక నిర్ణీత కాలానికి లోబడి తయారు చేసిన పుస్తకాల పట్టికను గ్రంథ సూచీ (బిబ్లియోగ్రఫీ) అంటారు.

6 ఒకే ప్రచురణ కర్త లేదా అనేకమంది ప్రచురణ కర్తలు కలిసి ప్రచురించిన గ్రంథాల వివరాలు తెలియజేసే దాన్ని ప్రచురణ కర్తల సూచీ (పబ్లిషర్స్ కేటలాగ్) అంటారు.

7 ఒక పుస్తక విక్రేత వద్ద లభించే గ్రంథాల వివరాలు తెలియజేసే దాన్ని పుస్తక విక్రేతల సూచీ (బుక్ సెల్లర్స్ కేటలాగ్) అంటారు.

పైన వివరించిన ఏడు రకాల సూచీలలో మొదటి ఐదు రకాలలో పరిచయ సంకేతాలుంటాయి. ప్రామాణీకరించబడిన కొన్ని నియమాలను అనుసరించి తయారు చేస్తారు. 1, 3, 4 రకాల సూచీలు ఒక గ్రంథాలయానికి పరిమితమైతే 2, 5 రకాల సూచీలు పలు గ్రంథాలయాలకు, వ్యక్తులకు చెందినవై ఉంటాయి. గ్రంథ సూచీలోగల గ్రంథాలు ఎక్కడైనా లభించ వచ్చు. కొన్ని ప్రముఖ ప్రచురణ కర్తల సూచీలలో పరిచయ సంఖ్యలు ఉండటం చూస్తాం.

### గ్రంథాలయ సూచి : గ్రంథసూచి

ఇక్కడ ఒక విషయం గమనికలో ఉంచుకోవాలి. కొన్ని సందర్భాలలో గ్రంథాలయ సూచీని గ్రంథసూచీగా ఉపయోగించ వచ్చు. కాని గ్రంథసూచీ ఎప్పటికి గ్రంథాలయ సూచీ ప్రయోజనాన్ని సాధించలేదు. వాటిఅంతరం అంత నిశితమైనది. అనగా గ్రంథాలయ సూచీ అందరికీ పనికివస్తే – గ్రంథసూచీ ఒక విషయం మీద ప్రత్యేకంగా కృషి చేసే వారికి మాత్రమే ఉపయోగిస్తుంది. అయితే విజ్ఞాన ప్రగతికి పైన వివరించిన ఏడురకాలు అవసరమే. వాటిలో ఒకటి ఐదు పంఖ్యలు కలవి విశేష ప్రాధాన్యం గలవి. మొదటి దాని విషయం మరల ఇప్పుడు వివరించాల్సిన పనిలేదు. గ్రంథాలయ సూచీ గ్రంథాలయ నిర్వహణకు ఒక ఊపిరి, ఒక ఆయువు.

### గ్రంథాలయ సూచి, గ్రంథసూచి

ఈ రెంటికి పోలికలు, భేదాలు స్పష్టంగా ఉన్నాయి. ముందు పోలికల విషయం చూద్దాం.

1 ఇవి రెండు గ్రంథాల జాబితాలే.

2 క్రమబద్ధంగా రూపొందించబడినవే.

3 చదువరి అవసరాన్ని బట్టి విషయం, వ్యక్తి మొదలగు అంశాలపై చేయబడేవే.

భేదాలు

| వరుస సంఖ్య | గ్రంథాలయ సూచి | గ్రంథ సూచి |
|---|---|---|
| 1 | లైబ్రరీ కేటలాగ్ | బిబ్లియోగ్రఫీ |
| 2 | ఒక గ్రంథాలయానికే పరిమితమైనది. | పరిమితికి సంబంధించిన ఆంక్ష లేనిది. |
| 3 | సూచీ లోని గ్రంథాలు ఒక గ్రంథాలయంలో ఉంటాయి. | ఏ గ్రంథాలయంలో లభిస్తుందో తెలియదు. |
| 4 | తరచుగా కార్డుల రూపంలో ఉంటుంది. | తరచుగా గ్రంథ రూపంలో ఉంటుంది. |
| 5 | పరిమాణం హెచ్చు, బయటికి తీసుకుపోవడం కష్టం | పరిమాణం చాల తక్కువ సులభంగా ఎచటకైనా తీసికెళ్ళచ్చు |
| 6 | అన్ని తరగతుల చదువరులకు ఉపయోగం | ప్రధానంగా పరిశోధకులు, పండితులకు ఉపయోగం |
| 7 | తయారీ గ్రంథ సూచీతో పోల్చితే సులభం. | తయారీ కష్టం విషయ పరిచయం అవసరం |

## గ్రంథాలయ సూచి : ప్రవేశ పట్టిక

ఇటీవలి కాలం వరకు ముఖ్యంగా చిన్నస్థాయి గ్రంథాలయాలలో ప్రవేశ పట్టిక (యాక్సెషన్ రిజిష్టరు) గ్రంథాలయ సూచీగా ఉపయోగపడేది. ప్రవేశ పట్టిక గ్రంథాలయంలో పుస్తకాలు చేర్చిన క్రమంలో ఉంటుంది. ఇది పుస్తకాల నిల్వను మాత్రం తెలుపుతుంది. పుస్తకాలు పరిచూడడానికి ఉపయోగిస్తుంది.

గ్రంథాలయ సూచీ గ్రంథాలలోని విషయాన్ని స్థూలంగా చెబుతుంది. గ్రంథస్థానం తెలుపుతుంది. ఒక గ్రంథాలయంలో ఈ రెండు విధిగా ఉండాల్సిందే. ఒకదాని పాత్ర మరొకటి నిర్వహించలేదు. గ్రంథాలయంలో సూచీ యాంత్రీకరణ జరిగినా ప్రవేశపట్టిక ఏ రూపంలో ఉన్నా—రెంటి అవసరం తప్పదు.

— 0 —

# 3 సూచీ బాహ్యరూపాలు

గ్రంథాలయ సూచీ ప్రధానంగా రెండు రూపాల (ఫారమ్స్)లో ఉంటుంది. వీటిని బాహ్యరూపాలు, అంతర రూపాలు అంటారు.

బాహ్య రూపాలు 1 రాత రూపం
2 ముద్రిత రూపం
3 కార్డు రూపం
4 కంప్యూటర్ సూచి
5 మైక్రో రూప సూచి

అంతర రూపాలు 1 గ్రంథకర్త సూచీ
2 గ్రంథనామ ,,
3 విషయ ,,
4 వర్గీకృత ,,
5 నిఘంటు ,,

ఇంకా మరికొన్ని రూపాలు గూడ లేకపోలేదు. వాటి వివరాల జోలికి పోనవసరం లేదు. ముందుగా పైన వివరించిన రూపాల గురించి కొన్ని విషయాలు తెలుసు కుందాం.

## బాహ్యరూపాలు

రాత రూపం

ఒక గ్రంథాలయంలోని పుస్తకాల వివరాలు రాత రూపంలో పట్టికపై తయారుచేసినదాన్ని రాత సూచీ అంటారు. ఈ సూచీలో గ్రంథాలయంలోని పుస్తకాల సంఖ్యను బట్టి ప్రతి విషయానికి కొన్ని పుటలు కేటాయించి ఉంటాయి. నిలువలో ఉన్న పుస్తకాల వివరాలు ఆయాపుటలలో విషయాలవారిగా రాశాక ఎప్పటి కప్పుడు క్రొత్తగా వచ్చే పుస్తకాల వివరాలు ఆ దిగువ రాయాల్సి ఉంటుంది.

రాత సూచికి ఎక్కువ ప్రతులు తయారు చేయడం కష్టం. ఒకేసారి ఒకరిద్దరు కంటె ఎక్కువ మంది ఉపయోగించ లేరు. ఇది వాడుకలో తరచు చిరిగి పోతుంది. కాబట్టి ప్రతి నాలుగైదు సంవత్సరాలకైనా తిరిగి రాసుకోవలసి ఉంటుంది. పైగా ఈ సూచీ ద్వారా ఒక రచయిత తాలూకు రచనలు ఆ గ్రంథాలయంలో ఎన్ని ఉన్నవో వెంటనే చెప్పడం కష్టం. అలాగే ఫలానా గ్రంథం ఉందో లేదో తక్షణం తెలుపడం సాధ్యంగాదు. పుస్తకాల భౌతిక వివరాలు తెలుసుకోవడానికి అసలు వీలు పడదు. కనుక ఈ తరగతి సూచీ చిన్న స్థాయిలోగల గ్రామీణ గ్రంథాలయాలకు అభివృద్ధి దశలో ఉన్న శాఖా గ్రంథాలయాలకు పరిమితమై పోయింది.

## ముద్రిత రూపం

రాతరూపానికి ముద్రిత రూపానికి దానిని తయారు చేయడంలో ఏమీ తేడాలేదు. ముద్రణ తేడా మాత్రమే. ముద్రిత సూచీకి ఎన్ని ప్రతులు కావాలంటే అన్ని వందలు వేలు ప్రచురింపవచ్చు. ఎక్కువ ప్రతులుండడం చేత దీన్ని ఎక్కడికైనా తీసుకొని వెళ్ళి సంప్రదించవచ్చు. ఇంటికి తీసుకు వెళ్ళి విశ్రాంతిగా కూర్చొని పుస్తకాల వివరాలు తెలుసు కోవచ్చు. లేదా క్యాంపుకు పట్టుకెళ్ళి కాలక్షేపం చెయ్యొచ్చు. అయినా రాతసూచీలోని లోపాలు దింట్లో లేకపోలేదు.

ముఖ్యంగా ఎప్పటి కప్పుడు క్రొత్తగా చేర్చిన పుస్తకాలను ఈ సూచీలో చేర్చడం కష్టం. సూచీ ముద్రించడం అంటే ఎంతో వ్యయప్రయాసలతో కూడుకున్నపని. కాలహరణం అయ్యే వ్యవహారం. అయితే ఈనాడు అభివృద్ధిలోకి వచ్చిన ఆఫ్‌సెట్ పద్ధతిలో సూచీ ముద్రిస్తే మరికొంత చవగ్గా, త్వరగా సూచీ సిద్ధం కావచ్చు. దాన్ని మరింత తాజాగా ఉంచవచ్చు. ముద్రిత సూచీపని కష్టసాధ్యమైన పని అయినప్పటికీ లండన్‌లోని బ్రిటీషు మ్యూజియమ్, వాషింగ్‌టన్‌లోని లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ వారు అచట గల లక్షల సంఖ్యలోని గ్రంథాలకు వందల సంపుటాలలో సూచీలను తయారు చేశారు. కలకత్తా జాతీయ గ్రంథాలయంవారు అశుతోష్ ముఖర్జీ సంకలనాలకు ముద్రిత సూచీ తయారు చేశారు. ఆ మాటకొస్తే తంజావూరు, మద్రాసు, రాజమండ్రి, కాకినాడలో గల కొన్ని గ్రంథాలయాలలోని రాతప్రతులకు ముద్రిత సూచీలు సిద్ధం చేయగా ఎంతో ప్రయోజనకరంగా ఉంటున్నాయి.

మొత్తంమీద ఈ విధమైన సూచీ ప్రాచీన–అత్యంత నవీన విధానాలకు మధ్యస్థంగా ఉంటూ ఉన్నత పాఠశాలల, కళాశాలల గ్రంథాలయాలకు ఎంతో ప్రయోజనకరంగా ఉంటున్నది.

## ముద్రితసూచి కొత్త రూపం

ముద్రణ రంగంలో వచ్చిన అత్యంతాధునిక యాంత్రిక విధానమైన ఫొటో కంపోజింగ్ ద్వారా కంప్యూటర్‌లోని సూచీ సమాచారాన్ని ముద్రించి సూచీని గ్రంథ రూపంలో ఉంచవచ్చు. అభివృద్ధి చెందిన అనేక దేశాలు ఈ పద్ధతి అనుసరిస్తు న్నాయి. ముఖ్యంగా శాఖా గ్రంథాలయాలున్నపుడు ఈ పద్ధతి మరింత ప్రయోజన కరంగా ఉంటుంది. ఖర్చు కలసి వస్తుంది. అయితే ముద్రిత సూచీలో ఎప్పటి కప్పుడు వచ్చే కొత్త పుస్తకాల వివరాలు చేర్చడం ఎలా వీలుకాదో– ఈ ఫొటో కంపోజింగ్ ముద్రిత సూచీలో కూడా ఆ లోపం ఉంటూనే వుంది.

## కార్డు రూపం

ఈ విధమైన సూచీ నిర్మాణానికి ఇప్పటికీ రెండు మూడు కొలతలు గల కార్డులు ఉపయోగ పడుతున్నాయి. అయితే అత్యధిక భాగం 12 . 5 X 5 సెం మీ కొలత గల కార్డులనే ఉపయోగిస్తూ దీన్ని ఒక ప్రామాణికమైన కొలతగా నిర యించారు. కార్డు మందం 0.025 సెం మీ ఉంటుంది. ఒక సొరుగు (ట్రే) లో సుమారు 1500 కార్డులు సర్దవచ్చు.



సొరుగు

కొత్తగా వచ్చిన పుస్తకాలకు సంబంధించిన కార్డులు వెంటనే చేర్చి దీన్ని తాజాగా ఉంచడంపైనే దీని శక్తి ఆధారపడి ఉంటుంది. దీని ప్రత్యేకత కూడా ఇదే.

ఒకటి మాత్రం నిజం. ఈ సూచీని తయారు చేయడం, దాన్ని నిర్వహించడం ఖర్చుతో కూడుకున్న పని. అందుకు సిద్ధమైతే దీన్ని మించింది మరొకటి లేదు. ఇది గ్రంథాలయంలో ఎక్కువ స్థలం ఆక్రమిస్తుందంటారు. సూచీ పూర్తి ప్రయోజనాలు పొందాలనుకుంటే ఈ రూపాన్ని ఆశ్రయించక తప్పదు మరి. అందుచేతనేమో నేడు ప్రపంచ వ్యాప్తంగా అన్ని గ్రంథాలయాలలో కార్డు విధానాన్నే అనుసరిస్తున్నాయి.

ఈ విధంగా వివిధ రూపాలలో సూచీ బాహ్య రూపం ఉండగా విజ్ఞాన ప్రపంచంలో వచ్చిన మార్పుల వలన ఇటీవల కాలంలో ముఖ్యంగా కంప్యూటర్ ఆన్‌లైన్‌సూచి, మైక్రో రూప సూచి మొదలైనవి వాడుకలోకి వచ్చాయి.

కంప్యూటర్ సూచి

యాంత్రిక ప్రపంచంలో తొలి వెలుగు కంప్యూటర్ సూచి. ఇందు సూచీ వివరాలను మరల చదవడానికి వీలైన పద్ధతిలో కంప్యూటర్‌లోకి ఎక్కిస్తారు. ఈ సమాచారం ఒకసారి కంప్యూటర్‌లో భద్రపరిచాక ఎప్పుడు కావాలన్నా చూడవచ్చు. పద్దుల ప్రతి కావాలన్నా ముద్రించుకోవచ్చు. దీన్ని ఆన్‌లైన్ కేటలాగ్ అంటారు. అయితే సూచీని సంప్రదించడానికి టెలివిజన్ తెరను పోలిన తెరపై మాత్రమే చూడ్డానికి వీలవుతుంది.

యంత్రాల సాయంతో సంప్రదించడానికి వీలైన సూచీ సమాచారాన్ని మాగ్నటిక్ టేపులపై కూడా భద్ర పర్చవచ్చు. ఇలా భద్రపరచి సంచయనం (క్యూమ్యులేట్) చేసిన రికార్డుల సంకలనాన్ని ''డేటాబేస్'' అంటారు. వాషింగ్‌టన్‌లోని లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ సూచీ వివరాలను డేటాబేస్‌లలో భద్రపరుస్తున్నారు. ఇలా ఒక డేటాబేస్ నుంచి మరో డేటాబేస్‌కు సంబంధం కలిపే విధానాన్ని 'నెట్‌వర్క్' అంటారు. RLIN, BALLOTS, WLX ఇలాంటివే.

ముఖ్యంగా ఇటీవలి కాలంలో యంత్రాలపై కంటే మానవ వనరులపై ఖర్చు విదేశాలలో హెచ్చయి నందున—కార్డు సూచీలను క్రమంగా రద్దు చేసి వాటి స్థానంలో కంప్యూటర్ సూచీలను ప్రవేశపెట్టే ఆలోచనలో ఉన్నారు. 1981 నుంచీ లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ సాధారణ సూచీ విధానానికి స్వస్తి చెప్పి కంప్యూటర్ సూచీ ప్రారంభించింది. మరికొన్ని పెద్ద గ్రంథాలయాలు, పరిశోధనా గ్రంథాలయాలు ఈ విధానాన్ని అనుసరించాయి.

## మైక్రో రూప సూచి

దీన్ని సూక్ష్మ రూప సూచి (మైక్రోఫార్మ్ కేటలాగ్) అనచ్చు. గ్రంథాలయాలలో నిత్యం పుస్తకాల నిల్వలు పెరిగి పోతూ, స్థలం చాలీచాలని తరుణంలో మైక్రో రూప సూచీలకు ప్రాధాన్యం పెరిగింది. ఇది మైక్రోఫిల్మ్, మైక్రో కార్డు, మైక్రోఫిచ్—అనే మూడు రూపాలలో ఉంటుంది. 12.5X 5 సెం.మీ. సూచీ కార్డును ఒక చదరపు సెంటీ మీటరు కంటే తక్కువ సైజులోకి కుదించ వచ్చు. రీడరు సాయంతో సైజు పెంచి చూడవచ్చు. అదే రూపం ప్రతులు తీయచ్చు. లేదా మామూలు సైజులో కాగితంపై ప్రింటర్ సాయంతో ముద్రించ వచ్చు. మామూలు కార్డు సూచీ కంటె ఖర్చు తక్కువ. మైక్రో రూప సూచీకి కార్డు సూచీ కంటే, నూరో వంతు స్థలం సరిపోతుంది.

మైక్రో రూప సూచీలనే యంత్రాలతో చదివే రికార్డుగా భద్ర పరచవచ్చు. ఈ పద్ధతిని "కంప్యూటర్ అవుట్‌పుట్ మైక్రోఫార్మ్" (COM) అంటున్నారు. ఈ సూచీ ఉపయోగించడం సులభం. దీన్ని ఎక్కడి కైనా తీసుకెళ్ళచ్చు. అరువుగా ఇవ్వచ్చు. అమెరికా దేశంలో జార్జియా టెక్నికల్ లైబ్రరీ వంటి అనేక గ్రంథాలయాలు తమ సూచీలను మైక్రో రూపంలోకి మార్చేశాయి. ఈ విధానంలో ఒక పెద్ద గ్రంథాలయం తాలూకు సూచీని బ్రీఫ్‌కేస్‌లో పెట్టుకెళ్లచ్చు. బ్రీఫ్‌కేస్ లోకి సరిపోయే రీడర్లు రానే వచ్చాయి. కనుక ఇటీవలి కాలంలో ఈ పద్ధతి అన్ని గ్రంథాలయాలలో ప్రవేశ పెట్టడానికి తీవ్రంగా ఆలోచిస్తున్నారు. కార్డు సూచీ, కంప్యూటర్ సూచీ తయారీ, నిర్వహణ, ముద్రణ వ్యయాలు పెరుగుతున్న దృష్ట్యా మైక్రో రూపాలపై ఆదరణ పెరగడం సహజం.

— 0 —

# 4 సూచీ అంతర రూపాలు

ఇంతకు ముందు అధ్యాయంలో సూచన ప్రాయంగా మనవి చేసినట్లుగా సూచీ అంతర రూపాలు గ్రంథకర్త సూచి, గ్రంథనామ సూచి, విషయ సూచి, వర్గీకృత సూచి, నిఘంటు సూచి—అని ఐదు రకాలుగా ఉంటుంది.

గ్రంథాలయ సూచి అంతర రూపాలు (ఇంటర్నల్ ఫారమ్స్) గత రెండు మూడు శతాబ్దాల కాలంలో అనేక మార్పులకు లోనయ్యాయి. విజ్ఞాన లోకంలో జెట్ వేగంతో ఏర్పడుతున్న మార్పులే దీనికి మూల కారణం. ఒకప్పుడు పుస్తకాలను భద్ర పరచే కేంద్రంగా మాత్రం గ్రంథాలయం పనిజేస్తూ ఉండేది. కనుక సూచీ కూడ ఆనాడు పుస్తకాల లెక్కలను తేల్చుకోడానికి మాత్రం పనికి వచ్చే విధంగా తయారు చేసేవారు. మరో మాటలో చెప్పాలంటే ఆనాడు గ్రంథ ప్రవేశ పట్టిక (యాక్సెషన్ రిజిష్టర్) కు, గ్రంథ సూచీకి అట్టే తేడా లేదు. విషయ పరంగా అధ్యయన ప్రారంభమయ్యాక ఉవ్వెత్తుగా గ్రంథ ప్రచురణ జరుగుతున్నపుడు సూచీ అంతర రూపాల నిర్మాణంలో అనేక మార్పులు వచ్చాయి. భవిష్యత్తులో మరి కొన్ని మార్పులు రానున్నాయి.

## గ్రంథకర్తసూచీ

గ్రంథ రచనకు కారణ భూతుడైన గ్రంథకర్తల పేర పద్దులను తయారుచేసి వాటిని అకారాది క్రమంలో అమర్చినపుడది గ్రంథకర్త సూచీ (ఆథర్ కేటలాగ్) అవుతుంది. అనువాదకుడు, సంపాదకుడు, సంకలనకర్త, వ్యాఖ్యాత, చిత్రకారుడు మొదలైన వారందరు గ్రంథ కర్తలుగానే ఈ సూచీలో గ్రహించాలి. ఈ సూచీ వలన ఒక గ్రంథకర్త, అనువాదకుడు, సంపాదకుడు మొదలైన వారి రచనలు ఆ గ్రంథాలయంలో ఎన్నిగలవో తెలుస్తుంది. కాని ఒక పుస్తకం ఉందో లేదో, ఒక విషయంపై ఎన్ని పుస్తకాలు గలవో తెలుసుకోవడం కష్టం. ఈ లోపాల వలన ఈ విధమైన సూచీ అట్టే ప్రచారంలోకి రాలేదు

### గ్రంథనామ సూచీ

గ్రంథాల పేర్లతో పద్దులుచేసి వాటిని అకారాది క్రమంలో అమర్చినపుడది గ్రంథనామ సూచి (టైటిల్ కేటలాగ్) అవుతుంది. ముఖ్యంగా ఈ సూచీలో గ్రంథం తాలూకు ప్రచార నామంతోనే శీర్షిక చేస్తారు. ఈ సూచీ వలన ఒక గ్రంథం ఆ గ్రంథాలయంలో ఉందో లేదో స్పష్టంగా తెలుస్తుంది.

అంతేగాని ఒక రచయిత తాలూకు, లేక ఒక విషయంపై ఆ గ్రంథాలయంలో ఎన్ని పుస్తకాలు కలవో తెలుసుకోవడం కష్టం. కేవలం కల్పనా సాహిత్యం చదువుకొనే వారికిది ఉపయోగిస్తుందే కాని మిగతా వారికంత ప్రయోజనకరంగా ఉండదు. అందు చేత ఈ విధమైన సూచీ తగిన వాడుకలోకి రాలేదు.

### విషయ సూచీ

ఒక గ్రంథాలయంలోని పుస్తకాలకు విషయాల వారీగా పద్దులను తయారుచేసి, వాటిని అకారాది క్రమంలో అమర్చినపుడది విషయ సూచీ (సబ్జక్ట్ కేటలాగ్) అవుతుంది. దీని వలన ఒక విషయంపై ఎన్ని పుస్తకాలున్నాయియో తెలుస్తుంది. కాని ఒక గ్రంథ కర్త రచనలు ఎన్ని ఉన్నాయియో, ఫలానా గ్రంథం ఉందో లేదో తెలియదు. విషయ ప్రధానంగా అధ్యయనం జరుగుతున్న ఈ రోజులలో ఈ విధమైన సూచీ బాగానే ఉంటుందిగాని పై రెండు లోపాల వలన దీనికి ఎక్కువ ఆదరణ లభించలేదు.

దీనిని బట్టి తెలిసిన విషయమేమంటే కేవలం ఒక గ్రంథకర్త, గ్రంథనామం, విషయం తెలిసినా సరిపోదు. ఏ ఒక్కటీ చదువరి అవసరాలను తీర్చ లేదు. కనుక పై మూడు అంశాలలోను ఒక్కటి తెలిసినా, మిగతావి గ్రహించడానికి అవకాశ మున్నపుడే సూచీ ప్రయోజనం తెలుస్తుంది. అదే ఆదర్శ వంతమైన సూచీ అవుతుంది. ఈ అవస రాలను తీర్చ గలిగినవి నవీనమైన ఈ విధానంలో వర్గీకృత సూచీ, నిఘంటు సూచీ అనే రెండు విధానాలు అమలులోకి వచ్చాయి.

### వర్గీకృత సూచీ

ఒక గ్రంథాలయంలోగల పుస్తకాలకు ఎన్నుకున్న వర్గీకరణ విధానం బట్టి విషయ పద్దులను తయారుచేసి వాటిని వర్గీకరణ క్రమంలో అమర్చినపుడది వర్గీకృత సూచీ (క్లాసిఫైడ్ కేటలాగ్) అవుతుంది. అంటే ఒక పుస్తకాలయంలో దశాంశ వర్గీకరణ

పథకం వాడుకలో ఉంటే ప్రధాన పద్దులన్నీ 000 నుంచి 999 వరకు వర్గీకృత క్రమంలో ఉంటాయి. వర్గీకరణ పథక నిర్మాణ బలాబలాలపై వర్గీకృత సూచీ పటిష్టత ఆధారపడి ఉంటుంది. దీని వలన ముఖ్య ప్రయోజనం ఏమంటే పరస్పర సంబంధం, సామీప్యం గల విషయాలన్నీ ఒక క్రమంలో ఉంటాయి.

ఆ తర్వాత గ్రంథకర్త, గ్రంథనామం, విషయం తదితర అంశాలన్నిటికీ ఉప పద్దులు చేశాక అకారాది క్రమంలో అమర్చి ఉంటాయి. ఈ అనుబంధ పద్దుల వలన చదువరికి, సిబ్బందికి కావలసిన సమాచారం వెంటనే తెలుస్తుంది. ఈ విధమైన సూచీ పరిశోధనా సంస్థలకు, వ్యాపార సంస్థలకు, విశ్వవిద్యాలయాలకు అనుబంధంగా గల ప్రత్యేక గ్రంథాలయాలకు ఎంతో ఉపయోగంగా ఉంటుంది. అయితే దీని తయారీలో, వాడుకలో తొలిదశలో కొంత ఇబ్బంది లేకపోలేదు. కాని దీనితో పరిచయం ఏర్పరచుకున్నాక, దాని వలన ప్రయోజనం పొందాక అంతటి మహత్తర సూచీ మరొకటి లేదని అనుభవరీత్యా తెలుస్తుంది.

నిఘంటు సూచీ

ఒక గ్రంథాలయంలో పుస్తకాల తాలూకు పద్దులు అనగా గ్రంథకర్త, అనువాదకుడు సంకలన కర్త, గ్రంథనామం, విషయం, గ్రంథమాల మొదలైన పద్దులన్నిటినీ అకారాది క్రమంలో అమర్చినపుడది నిఘంటు సూచీ (డిక్షనరీ కేటలాగ్) అవుతుంది. ఈ సూచీలో విషయ పద్దులన్నీ "నిర్దిష్ట విషయ" ప్రాతిపదికపై చేస్తారు. ఆ శీర్షికల ఎన్నిక ఎంత నిర్దుష్టంగా స్పష్టంగా విశాల ప్రాదికపై తయారు చేసి ఉంటే ఆ సూచీ అంత ప్రయోజనకరంగా ఉంటుంది. వర్గీకృత సూచీతో పోల్చినట్లయితే ఈ సూచీని తయారు చేయడం చాలా సులభం. వాస్తవానికి నిఘంటువును సంప్రదించినంత సులభంగా దీన్ని ఉపయోగించు కోవచ్చు. ప్రధాన పద్దులు ఉప పద్దులు—అన్నీ అకారాది క్రమంలో అమర్చి ఉంటాయి. ఉదాహరణకు గాంధీజీ ఆత్మకథ అనే పుస్తకానికి ఈ దిగువ రీతిలో పద్దులు చేయవలసి ఉంటుంది.

ప్రధానపద్దు - గ్రంథకర్త

923.2
గాంధీ—ఆ గాంధీ, మోహన్‌దాస్ కరంచంద్ (1869–1948)
ఆత్మకథ/మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ; అనువాదం
వేలూరి శివరామశాస్త్రి. — 5 వ కూర్పు. — హైదరా
బాదు : గాంధీ సాహిత్య ప్రచురణాలయం; మచిలీపట్నం :
త్రివేణి పబ్లిషర్సు, 1968.

1030 xxi, 803పు ; 29 సెం.మీ. — (గాంధీజీ గ్రంథమాల ;4)
1 మహాత్మాగాంధీ – స్వీయచరిత్ర I శివరామశాస్త్రి,
వేలూరి, అను. II గ్రం.నా. III గ్రంథమాల

ఉప పద్దులు—1 విషయం
923.2 మహాత్మాగాంధీ—స్వీయచరిత్ర
గాంధీ—ఆ గాంధీ మోహన్‌దాస్ కరంచంద్ (1869–1948)
(ప్రధాన పద్దు వలె)

ఉప పద్దులు—2 అనువాదకుడు
923.2 శివరామశాస్త్రి, వేలూరి, అను.
గాంధీ—ఆ గాంధీ, మోహన్‌దాస్ కరంచంద్ (1869–1948)
(ప్రధాన పద్దు వలె)

ఉప పద్దులు—3 గ్రంథ నామం
923.2 ఆత్మకథ
గాంధీ—ఆ గాంధీ, మోహన్‌దాస్ కరంచంద్ (1869–1948)
(ప్రధాన పద్దు వలె)

ఉప పద్దులు—4 గ్రంథమాల
923.2 గాంధీజీ గ్రంథమాల ; 4
గాంధీ—ఆ గాంధీ, మోహన్‌దాస్ కరంచంద్ (1869–1948)
(ప్రధాన పద్దు వలె)

ఉప పద్దులు– 5వ మార్గ సూచిక

కరంచంద్ గాంధీ, మోహన్‌దాస్

చూడండి

గాంధీ, మోహన్‌దాస్ కరంచంద్ (1869–1948)

ఉప పద్దులు– గ్రంథమాల (ALA నియమాలు 1949 ప్రకారం)

గాంధీజీ గ్రంథమాల

923.2 1 సత్యశోధన, 1964
గాంధీ. స

923.2 2 స్వీయ చరిత్ర, 1960
గాంధీ. స్వీ

923.2 4 ఆత్మకథ, 1968
గాంధీ. ఆ: 1

923.2 4 ఆత్మకథ, 1968
గాంధీ.ఆ:2

గమనిక : గాంధీజీ గ్రంథమాలలో సదరు గ్రంథాలయంలో మూడోది లేదని నాలుగోది రెండు ప్రతులున్నాయని తెలుసుకోవాలి.

ఈ విధంగా తయారు చేసిన పద్దులన్నీ సూచీ పేటికలో అకారాది క్రమంలో అమర్చుతారు. అందువలన గ్రంథకర్త, గ్రంథనామం, విషయం, అనువాదకుడు, గ్రంథమాల వీటిలో ఏ ఒక్కటి తెలిసినా మిగతా వాటిని తెలుసుకోవచ్చు. పుస్తకాన్ని సంపాదించవచ్చు.

మనరాష్ట్రంలో అన్ని గ్రంథాలయాలలోనూ నిఘంటు సూచీ వాడుకలో ఉంది. ఇటీవల ప్రపంచ వ్యాప్తంగా అమలులో ఉన్న ఆంగ్లో–అమెరికన్ సూచీకరణ నియమాలు – 2:1978 కూడ నిఘంటు సూచీ పద్దులను తయారు చేయడానికి ఉద్దేశించినదే. ఐనప్పటికీ ప్రచారంలో నిఘంటు సూచీ, వర్గీకృత సూచీలలో తేడాలను గురించి తెలుసుకోవడం అవసరం.

| వ.సం. | నిఘంటు సూచీ | వర్గీకృతసూచీ |
|---|---|---|
| 1 | అక్షర క్రమంలో కార్డుల అమరిక ఉంటుంది. గ్రంథకర్త, గ్రంథనామం, విషయం, మొ. అక్షర క్రమంలో ఉంటాయి. | వర్గ సంకేత క్రమంలో కార్డుల అమరిక ఉంటుంది. |
| 2 | విషయాలు, సూచీ అంతా వ్యాపించి ఉంటాయి. | విషయాలన్నీ సంబంధ క్రమంలో ఉంటాయి. |
| 3 | నిర్మాణం. ఉపయోగం, వర్గీకరణ విధానంపై ఆధారపడదు | నిర్మాణం, ఉపయోగం వర్గీకరణ విధానంపై ఆధారపడి ఉంటుంది. |
| 4 | ఇది నిఘంటు రూపంలో ఉంటుంది. గనుక ఉపయోగించడం సులభం. | వర్గీకరణ విధానంతో పరిచయ ముంటే తప్ప ఉపయోగించటం సాధ్యంకాదు. |
| 5 | విషయ శీర్షికలు పటిష్టంగా ఉంటేనే ఉపయోగ కరంగా ఉంటుంది. | వర్గీకరణ విధానం సరిగా ఉంటేనే ఉపయోగ కరంగా ఉంటుంది. |
| 6 | అవసరాన్ని బట్టి చూడండి, ఇంకా చూడండి' వంటి మార్గ దర్శకాలు సమకూర్చడం వలన సూచీ పెరిగే అవకాశం ఉంది. ఒక విషయం కోసం అనేక శీర్షికలు చూడవలసిన అవకాశం ఉంటుంది. | విషయాను క్రమణిక సరిగా ఉంటే — చదువరికి ఏ కొరత ఉండదు. |
| 7 | ఒక విషయంలో ఎన్ని పుస్తకాలు న్నాయో, ఉన్నపుస్తకాలు సరిపో తాయోలేదో తెలుసుకోవడం చాలకష్టం. | విషయాలన్నీ ఒక క్రమంలో ఉంటాయి గనుక ఈ పని చాలా సులభం. |

| | | |
|---|---|---|
| 8 | పుస్తకాల ఎంపికకు అంతగా ఉపయోగపడదు. | బాగా ఉపయోగపడుతుంది. |
| 9 | ఒక విషయాన్ని ముద్రించడం చాల కష్టం. | ఏ విషయంపై గల కార్డులనైనా వేరు చేసి ముద్రించడం సులభం. |

తేడాలు ఎలా ఉన్నా — ఒక గ్రంథాలయంలో ఎలాటి సూచీని తయారు చేయాలి — అనే విషయ పరిశీలనకు ముందుగా —

1 గ్రంథాలయ స్థాయి
2 ఆర్థిక వనరులు
3 పనికి లభించే సిబ్బంది
4 నవీనాప గ్రంథాలయాల్లో గల సూచీలు
5 చదువరుల అవసరాలు—

ఎలా ఉన్నాయో తెలుసుకొన్న పిదపే సూచీ రూపం నిర్ణయం చేయాలి.

— 0 —

# 5 సూచీకరణ ఉపసూత్రాలు

సూచీకరణ ఉపసూత్రాలు (Canons of cataloguing)

గ్రంథాలయ నిర్వహణలోను, గ్రంథాలయ సేవలోను సూచీ ప్రాముఖ్యం చాలా హెచ్చు. స్వేచ్ఛా పఠనం ఆచరణలో లేని గ్రంథాలయంలో గ్రంథాలయ సూచీ ప్రాముఖ్యం మరీ హెచ్చు. ఈ సూచీద్వారానే గ్రంథాలయంలోని పుస్తకాలు ఉపయోగంలోనికి వస్తాయి. చదువరులు వివిధ దృక్పథాలతో, విభిన్న విషయాలను తెలుసుకోనవలెననే ఆసక్తితో అనేక సమస్యలకు సమాధానాల కొరకు సూచీని సంప్రదించినప్పుడు, వారికి కావలసిన విషయం గ్రంథాలయంలో ఏ పుస్తకంలో ఏ రూపంలో ఉన్నా దాన్ని వారి దృష్టికి తెచ్చి, వారిని సంతృప్తిపరచవలసిన బాధ్యత గ్రంథసూచీపై ఉంది. దీనికొరకు గ్రంథాలయంలోని పుస్తకగత విజ్ఞానానికి సంబంధించిన సమాచారాన్ని సూచీపద్దులలో నమోదు చేయునప్పుడు, చదువరికి తగిన పుస్తకాన్ని తగిన సమయంలో నిచ్చుటకు వీలుగా నుండునట్లు జాగ్రత్త వహించాలి. పూర్వం కట్టుదిట్టమైన సూచీకరణ వ్యవస్థ లేకపోవుటవలన సూచీకరణ శిల్పంలో ఒడుదుడుకులు, సందిగ్ధత, అవ్యవస్థ, వేర్పాటు ధోరణులు వ్యాపించాయి.

19వ, శతాబ్దపు మధ్యకాలం నుండి సూచీకరణ వ్యవస్థను కట్టుదిట్టంచేసి, సక్రమమైన మార్గంలో పెట్టడానికి ప్రయత్నాలు జరిగాయి. ఇట్టి కృషిచేసినవారిలో ముఖ్యంగా పేర్కొనదగిన వ్యక్తి సి. ఎ. కట్టర్. ఇతడు సూచీకరణను సక్రమమైన మార్గంలో ఉంచడానికి ప్రయత్నించినాడు. కాని పూర్తిగా సఫలిత చెందలేదు. భారతదేశానికి చెందిన డాక్టర్ రంగనాధన్ ఈ కార్యక్రమాన్ని చేపట్టి, సూచీకరణను వ్యవస్థీకరించి శాస్త్రబద్ధం చేసినాడు. ఈయన తన జీవితమంతా గ్రంథాలయ సేవకు, గ్రంథాలయ శాస్త్రాభివృద్ధికి అంకితంచేసి, అద్వితీయమైన తన ప్రతిభావ్యుత్పత్తులతో గ్రంథాలయ శాస్త్రంలోని అన్ని శాఖలను ప్రభావితంచేసిన ఉద్దండ పండితుడు. 'గ్రంథాలయ శాస్త్ర ద్రష్ట' అను పేరీయన కన్నివిధాల తగింది.

సూచీకరణంలో వీరు ప్రతిపాదించిన ఉపసూత్రాలను గూర్చి ఈ అధ్యాయంలో క్లుప్తంగా తెలుసుకుందాం.

ఈ ఉపసూత్రాలు సూచీకరణ నిబంధనలను తయారు చేయడానికి ప్రాతిపదికగా ఉపయోగపడతాయి. ఈ నిబంధనలలోని సూత్రాలకు సందర్భోచితంగా అర్థంచెప్పుకోడానికి, వ్యాఖ్యానించడానికి సూచీకారుల కివి తోడ్పడతాయి. ఇంతేగాక వీటి ఆచరణ ద్వారా సూచీకరణను శాస్త్రబద్ధంచేసి దానికి పొందిక (Consistency)ను ప్రామాణికతను చేకూర్చగలరు.

## నిర్ధారణాధార ఉపసూత్రం
## (Cannon of Ascertainability)

ఈ ఉపసూత్రం ప్రకారం, నిర్ధారణ చేయడానికి వీలులేని విషయాన్ని దేనినైనను, సూచీపద్దులో చేర్చరాదు. ముఖపత్రంపైనున్న సమాచారాన్ని, అది విస్తరించి ఇతర పుటలమీదకు పొర్లినప్పుడు, ఆ సమాచారాన్ని మాత్రమే ఆధారంగా తీసికొని సూచీపద్దులను, అందులో చేర్చదగిన వివిధ అంశాలను నిర్ణయించాలి.

పూర్వమున్న సూచీ నిబంధనల ననుసరించుట వలన నేర్పడుచున్న అసంగత్వాన్ని, వివాదాన్ని ఈ ఉపసూత్ర ప్రతిపాదన ద్వారా తొలగించి, పద్దుల తయారీని శాస్త్రబద్ధం, సరళం చేసినాడు డా॥ రంగనాథన్. పాత నియమావళుల ప్రకారం పద్దుల తయారీకి కావలసిన సమాచారం కొరకు ముఖపత్రాన్ని, అది విస్తరించిన పుటలనే గాక, కొన్ని సందర్భాలలో పుస్తకాన్ని కూడ దాటి, ఇతర ఆధారాలనుగూడ సూచీకారుడు పరిశోధకునివలె అన్వేషించవలసి ఉండేది. ఇది సూచీకారున కన్నిసమయాలలోను సాధ్యపడదు, అతని కంత తీరిక ఉండదు. ఈ కారణంచేతనే ఈ సమస్యకు పరిష్కారంగా డా॥ రంగనాథన్ ఈ ఉపసూత్రాన్ని ప్రతిపాదించి. వివరించినాడు.

దురదృష్టవశాత్తూ ప్రస్తుతం తయారౌతున్న పుస్తకాల ముఖపత్రాలు, అవి విస్తరించుకొన్న పుటలు పద్దుల తయారీ కవసరమగు సమాచారాన్ని సూచీకారున కివ్వలేకున్నవి. అందువలన ముఖపత్రాల ముద్రణకు అంతర్జాతీయంగా ఒక ప్రమాణాన్ని సృష్టించి, సూచీకారునకు కావలసిన సమాచారమంతా దీనిద్వారా లభ్యమయేట్లు చేయవలెనని డా॥ రంగనాథన్ సూచించినాడు. అప్పటివరకు పై ఉపసూత్రాన్ని పాటించవలెనని చెప్పినాడు.

## ప్రబలతా ఉపసూత్రం (Cannon of Prepotence)

సూచీలోని పద్దులమధ్య ఒక పద్దుస్థానాన్ని నిర్ణయించుటకు కావలసిన శక్తిని లేక ప్రబలతను వీలయినంత వరకు ఆపద్దుల శీర్షికలందే కేంద్రీకరించాలి. ఈకేంద్రీ కరణ కూడ శీర్షికలోని తొలిపదాలు లేక అంకెలమీాదనే చేయాలి. ఇతర పద్దుల మధ్య ఒకపద్దు స్దానాన్ని నిర్ణయించు శక్తినిలేక ప్రబలతను ఒక్కశీర్షిక(Headline) యందే పూర్తిగా ఇముడ్చుటకు సాధ్యంకాని అనివార్య పరిస్థితులందు మాత్రమే, ఇతర భాగాలకు ఈ శక్తిని లేక ప్రబలతను వీలైనంత తక్కువ వ్యాప్తిచెందునట్లుచూడాలి.

గ్రంథాలయసూచి సమర్థవంతంగా పనిచేయవలెనన్న దాని పద్దుల అమరిక సక్రమంగా ఉండాలి. డా॥ రంగనాథన్ వివరించినపై ఉపసూత్రం ప్రకారం సూచీపద్దుల అమరిక, ముఖ్యంగా వర్గీకృతసూచీలో పద్దు ప్రధాన భాగమందు ( Leading Section) తెలుపబడిన పరిచయ సంఖ్యపై పూర్తి ఆధారపడును. అనగా ఉపయోగించిన వర్గీకరణ పథకం ప్రతి పుస్తకానికి ఒక ప్రత్యేకమైన పరిచయసంఖ్య ఇవ్వగలిగి ఉండాలి. ఇది ప్రస్తుతం కోలన్ వర్గీకరణ పథకానికే సాధ్యం, కాబట్టి కోలన్ వర్గీకరణ పథకాన్ని అనుసరించి, పరిచయసంఖ్య ఇవ్వబడిన వర్గీకృతసూచీయందు పద్దుల అమరిక చాల సులభంగాను, త్వరగాను జరుగుతాయి. దీనికి కారణం పద్దులఅమరికకు ప్రధానభాగం లోని ఒక్క పరిచయ సంఖ్యను మాత్రమే గణనకు తీసికొంటారు. పద్దు లోని ఇతర భాగాలకు అమరికపై ఏ మాత్రమూ ప్రభావం ఉండదు. ఈ విధంగా చూచినపుడు వర్గీకృతసూచీ నిఘంటుసూచీకంటె, హెచ్చు ప్రయోజనకారిగాను, లాభధాయకంగాను కన్పిస్తుంది. నిఘంటుసూచీలో పద్దుస్థానాన్ని నిర్ణయించేశక్తి ఒక్కశీర్షికయందేగాక పద్దు ఇతర భాగాల మీాద కూడ ఆధారపడి ఉంటుంది.

## ప్రత్యేకీకరణ లేక వ్యక్తి సాధక ఉప సూత్రం

## (Cannon of Individualisation)

సూచీ పద్దుశీర్షికలో ఉపయోగించిన నామం ఒక మానవుని పేరు కావచ్చు, స్థలం సమష్టి సంస్థ, మాల, పుస్తకం, విషయం లేక భాషపేరుకావచ్చు. ఈనామం ఒక వ్యక్తిని (entity) మాత్రమే సూచించేట్లుగా, దానికి ఉచితమైన, కావలసినన్ని వ్యక్తి సాధక అంశాల (Individullsing) ను చేర్చి రాయాలి.

సూచీకరణలో భిన్నార్థపదం (Homonym) ల వలన చాల అస్పష్టత, తారుమారు పరిస్థితు లేర్పడతాయి. శీర్షిక అనేక పుస్తకాలను సూచించుచున్నపుడు, గ్రంథాలయ సూచీ ఉపయోగం చాల తగ్గిపోయి అది నిష్ఫల మౌతుంది. ఇది గ్రంథాలయ సూచి లలో తరచుగా సంభవిస్తుంది. అందుచేత ఈ చిక్కు సమస్యకు సమాధానంగా, డాక్టర్ రంగనాథన్ ఈఉపసూత్రాన్ని ప్రతిపాదించి సూచిపద్దులో ఉపయోగించిన ప్రతిశీర్షిక, ఏదో ఒక్కపుస్తకాన్ని మాత్రమే సూచించునట్లేర్పాటు చేశాడు.

మనదేశంలో పూర్వుల, దేవుళ్ళ, దేవతల, భక్తుల, మహాత్ముల్ని పేర్లు పిల్లలకు పెట్టు కొనుట పరిపాటి. అందువలన మనదేశ వాఙ్మయంలో భిన్నార్థపదం (Homonym) బెడద చాల ఎక్కువగాఉండి ఏ గ్రంథం ఎవరు రాశారో స్పష్టంగా తెలుసుకొనుట కష్ట ముగాఉంది. ఈసమస్యకు సమాధానంగా, ఈఉపసూత్ర ప్రతిపాదన జరిగింది.

అంతేకాక ప్రతి పుస్తక ముఖ పత్రంవెనుకవైపున 'రచయిత' పద్దు పూర్తి వివరణము, ఒక అంతర్జాతీయ ప్రమాణ ప్రకారం ముద్రించే సంప్రదాయాన్ని ప్రవేశ పెట్టిన ఎడల, ఈ ఉపసూత్రాన్ని అనుసరించుటకు చాలా దోహదకారిగా ఉండునని డాక్టరు రంగనాథన్ సూచించాడు.

## అన్వేషిత శీర్షిక ఉపసూత్రం

## (Cannon of Sought-Heading)

చదువరులు, గ్రంథాలయ సిబ్బందికూడా వారికి కావలసిన పుస్తకాలకొరకు, సూచీ పద్దులలో ఏ రకపు శీర్షికల క్రింద, ఏ ఫక్కిలో రాసిన శీర్షికల క్రింద లేదా ఏ ఉప పద్దుల క్రింద అన్వేషిస్తారో, అదేరకపు శీర్షికలను, అదే పక్కిలో, అదే ఉప పద్దులను తయారు చేయాలి.

సూచీకరణంలో ఈ ఉపసూత్రం చాలా ముఖ్యమైనది. సూచీ కల్పాల రూప కల్పనలో ఈ ఉపసూత్రం తోడ్పడుటేగాక, సూచీ పద్దుల రూపాలనుకూడా ఇది చాలావరకు ప్రభావితం చేయగలదు.

ముఖపత్రంలోని, సమాచారం అది విస్తరించిన పక్క పుటలలోని సమాచారం మాత్రమే ఒకపద్దుకు శీర్షికగా ఉండడానికి అర్హత కలదని నిర్ధారణాధార ఉప

సూత్రం సూచించు చుండగా; అన్వేషిత శీర్షిక ఉప సూత్రం, ఒక పుస్తకానికి 'తగిన శీర్షికను' నిర్ణయించును. ఈ ఉప సూత్రంలో ముఖపత్రం పైన లేదా అది విస్తరించిన ఇతర పుటలలోను గల సమాచారాన్ని అవసరమైనంతవరకు సంగ్రహించి, మిగిలిన దానిని పరిహరించుట జరుగును. కాని చదువరులు, గ్రంథాలయసిబ్బంది ఏయే రకపు శీర్షికలక్రింద పుస్తకాలకొరకు వెదుకుతారో నిర్ణయించుట చాలా కష్టం. ఇది చాలా అనుభవం మీాదగాని తెలిసేవిషయం కాదు. గ్రంథాలయపు రకం (Type), చదువరుల అభిరుచులు, వారి చదువుల స్థాయినిబట్టి సూచీ పద్దుల శీర్షికలు ఏ రీతిలో తయారు చేయవలెనో నిర్ణయించవలసి ఉంటుంది. ఆచూకీసేవ ద్వారా చదువరుల ఆవసరాలు, ఆసక్తులు, పుస్తకాల కొరకు వారన్వేషించే పద్ధతులు తెలుసుకొని వారికనువైన రీతిలో పద్దుల శీర్షికలను తయారు చేయవచ్చును. సామాన్యంగా రచయిత శీర్షికలు, విషయ శీర్షికలు చదువరుల అభిమానాన్ని బాగా చూరగొనుటేగాక, ఇవి ఇతర శీర్షికల కంటె బాగా ప్రచారంలోకి వచ్చినవి.

## సందర్భోచిత ఉపసూత్రం (Cannon of Context)

సూచీకల్పంలోని సూత్రాల నేర్పరచునప్పుడు, ఈ దిగువ సూచించిన అంశాలను దృష్టిలోనుంచుకోవలెను.

1 అప్పటి కాలంలో ఉత్పత్తియగుచున్న పుస్తకాల సూచీకరణ లక్షణం లేక స్వభావం (Cataloguing feature).

2 ఆ కాలంలో వ్యాపించి ఉన్న గ్రంథాలయాల నిర్వహణ, వాటి సేవాస్వభావం.

3 అప్పుడు వెలువడుచున్న వాఙ్మయ సూచికలు. ముఖ్యంగా వాఙ్మయసూచికా పత్రికలనుబట్టి, కాలాన్నిబట్టి, మారుచున్న సందర్భాన్నిబట్టి సూత్రాలను మార్చుకొనుటకు వీలు కల్పించవలెను. ఇదే సందర్భోచిత ఉప సూత్రం.

సూచీకరణ ఉప సూత్రాలు ఎల్లప్పుడును ఒకే విధంగా, స్థిరంగా ఉండడం సంభవించదు. కాలాన్నిబట్టి, మారుతున్న అవసరాలనుబట్టి ఇవి మారాలి. లేని యెడల

అవి నిర్లక్ష్యం చేయబడి వాడుక నుండి మరుగునపడి పూర్తిగా పనికిరానివై పోవచ్చును. అందుకే డాక్టర్ రంగనాథన్ ఈ ఉపసూత్రం ద్వారా సూచీకరణ నిబంధనలను తాజాగా ఉంచడానికి వానిని కాలానుగుణ్యంగా మార్చు కోడానికి వీలు కల్పించినాడు.

ఉదాహరణకు ముద్రితపుస్తకాలు లేని రాతప్రతుల కాలంలో, సూచీకరణ పద్దులు చాలవివరాలతో నిండిఉండేవి. ప్రస్తుతం వాఙ్మయసూచికలు, ప్రచురణకర్తల సూచీలు (కేటలాగులు) ఉండుటవలన గ్రంథాలయాలలో స్వేచ్ఛోపలబ్ధి ప్రవేశ పెట్టిన తరువాత, సూచీ పద్దు తయారీలో అనవసరమైన వివరాలను (ఉ:— సైజు, పుటాది, ప్రచురణాది వివరణలు) పరిహరించి సూచీకరణను సులభతరం చేయవలయునని డా॥రంగనాథన్ సూచించాడు. ఇది కాలాన్నిబట్టి జరిగిన మార్పు. ఇట్టి మార్పుకు అనుగుణంగా సూచీకరణ వ్యవస్థను' సూచీకరణ నిబంధనలను తాజాగా ఉంచడానికి వీలు కల్పించునదే సందర్భోచిత ఉపసూత్రం.

## స్థిరతా ఉపసూత్రం (Cannon of permanence)

సూచీ కల్ప నిబంధనలప్రకారం, దాని లోని సూత్రాలను లేక నిబంధనలను సందర్భోచిత ఉపసూత్రాలనుసరించి మార్చితేతప్ప, సూచీపద్దులోని ఏ అంశాన్నైనా— ముఖ్యంగా శీర్షికను మార్చరాదు. ఇదే స్థిరతా ఉపసూత్రం.

పద్దులోని అంశాలను, ముఖ్యంగా శీర్షక మార్పును ఈ ఉపసూత్రం నిషేధిస్తున్నది. ఒకవ్యక్తి లేక సంస్థపేరు మారినపుడు వారి పాత పేర్లక్రింద ప్రచురించిన పుస్తకాల పద్దులు శీర్షికలను మార్చ వలసిన పనిలేదని ఈ ఉపసూత్రం సూచిస్తున్నది.

నిర్ధారణాధార, స్థిరతా ఉపసూత్రాలు రెండూ కలసి సమశ్ృతిలో ఒక దానికొకటి అనుగుణంగా పనిచేస్తాయి.

## వ్యావహారిక పద లేక చలామణి ఉపసూత్రం

## (Cannon of Currency)

ఈ ఉపసూత్రం ప్రకారం వర్గీకృతసూచీ వర్గానుక్రమణిక పద్దు (Class Index Entry) లోని విషయాన్ని సూచించే పదములు, నిఘంటు సూచీ విషయ పద్దును

సూచించే పదాలు సాధారణ ప్రజలలో బాగా ప్రచారంలోను వాడుకలోను ఉండాలి. ఒకవిషయంపేరు కాలంతో పాటు మారతాయి. కాబట్టి ఎప్పటికప్పుడు చలామణిలో ఉన్న కొత్తపేర్లను వాడిన గాని, చదవరులకు ఉపయోగముండదు. ఈ విధంగా ఒక విషయపు పాతపేరు వాడుక నుండి మరుగైపోయి, క్రొత్తపేరు ప్రచారానికి వచ్చి అది కొంతకాలం నిలబడగల్గినప్పుడు విషయపద్దుల శీర్షికలను మార్చవలెనని ఈ ఉప సూత్రం సూచిస్తుంది. అయితే, ఈ విధంగా మాటిమాటికి సూచీ పద్దుల అంశాలలో మార్పులు చేయడం శ్రమతో కూడిన పనిగాక, స్థిరతా ఉపసూత్రాన్ని ఉల్లంఘించినట్లవుతుంది. కాబట్టి డా॥ రంగనాథన్ ఈ చిక్కును విడదీయడానికి పరిష్కారంగా ఒకమార్గాన్ని సూచించాడు. చలామణి ఉప సూత్రం ప్రాబల్యాన్ని విషయ పద్దుల శీర్షికలకు మాత్రమే పరిమితం చేసి, తక్కిన పద్దులకు అనగా ఒక వ్యక్తిపేరు, సంస్థపేరు, ప్రదేశంపేరు శీర్షికగా గల పద్దులకు స్థిరతా ఉపసూత్రాన్ని అనుబుపరచి, దాని అధీనంలోనికి తీసికొని రావలెనన్నాడు. ఈ ఉపసూత్రంలో వాడిన 'చలామణి' అనేమాటను అన్వయించుకొనుటలో కొంత చిక్కేర్పడు తున్నది. 'చలామణి' యనగా ఎవరిలో చలామణి? మామూలు చదువరు లలోనా? లేక నిపుణులలోనా? అనే ప్రశ్న ఉదయిస్తుంది. నిపుణులు (Specialists) వాడే పరి భాష సాధారణ పాఠకులకు తెలియడం కష్టం. కాని నిపుణులకు పారిభాషిక పదాలు సాధారణ చదువరులలో ప్రచారంలోనున్న మామూలు పదాలుకూడ తెలుస్తాయి. అందుచేత డాక్టర్ రంగనాథన్ ఈ ఉపసూత్రంద్వారా మామూలు చదువరులకు, నిపుణులకుకూడ సమానంగా అర్థమయ్యే వాడుక పదాలనే స్వీకరించవలెనని నిర్దేశిం చాడు. ఈ విధంగా నిర్దేశించుటద్వారా గ్రంథాలయ శాస్త్ర ప్రాథమిక సూత్రాలలో 'ప్రతి చదువరికీ తనపుస్తకం' అనే రెండవసూత్రాన్ని గౌరవించినట్లు కూడా అవుతుంది.

## అనుగుణ్య ఉప సూత్రం [Cannon of Consistence]

సూచీ కల్పం [Catalogue Code] సూత్రాలలో ఒక పుస్తకపు ఉపపద్దులన్నీ దాని ప్రధానపద్దుకు అనుగుణంగా ఉండేటేర్పాట్లు చేయాలి. పుస్తకపు పద్దులన్నీ ఏకరీతిలో ఒకదానికొకటి అనుగుణంగాను, అవిరుద్ధంగాను ఉండాలి. ఈ అను గుణ్యత [Consistency] పద్దుల ముఖ్యాంశం (శీర్షిక వగైరా)లను ఎన్నుకొనుట లోను, వాటిని రాయడం రీతిలోను స్పష్టంగా కన్పించవలెను.

ఈ ఉపసూత్రం పుస్తకాల ప్రధాన పద్దులన్నీ ఒకే జాతికి [Species] చెంది ఉండ వలెనని నొక్కి చెప్పుచున్నది. ఉదాహరణకు, నిఘంటు సూచీపద్దులలో ఎప్పుడూ 'రచయిత' పద్దే ప్రధాన పద్దుగా నుండవలెనుగాని విషయపద్దులు ప్రధాన పద్దుగా నుండరాదని డా॥ రంగనాథన్ ఈ ఉప సూత్రం ద్వారా నిర్దేశించాడు.

ఒక జాతి [Species] పద్దులకు బదులుగా మరొక జాతి పద్దులను వాడరాదని కూడ ఈ ఉపసూత్రం ఆదేశిస్తున్నది. సూచీకరణలో ఒకే పద్దుకు శీర్షికగా రెండుజాతుల పద్దులను కలిపి రాయడం అనుమతించరాదు. అనగా రచయితను ప్రధాన శీర్షికగా, విషయ నామాన్ని ఉపశీర్షికగా కలిపి, ఒకే పద్దు శీర్షికను రాయకూడదని డా॥రంగనాథన్ ఈ ఉపసూత్రంద్వారా హెచ్చరిస్తున్నాడు.

— o —

# 6 గ్రంథాలయ సూచీ స్మృతులు

చిరకాలంగా కొన్ని దేశాలలో సూచీలు వ్యాప్తిలో ఉన్నాయి. క్రీ.పూ. 668-626లో గల అసుర్బనిపాల్ గ్రంథాలయంలోనూ, క్రీ.పూ. 250 నాటి అలెగ్జాండ్రియా గ్రంథాలయంలోనూ మట్టి బిళ్లల రూపంలో సూచీలున్నాయి. మధ్య యుగంలోని గ్రంథాలయాలలోనూ సూచీలున్నాయి. అయితే ఇవి నేటి సూచీల అర్థానికి పూర్తిగా అన్వయించవు. ప్రధానంగా ఇవి మట్టి బిళ్లల రాత ప్రతుల జాబితాలు మాత్రమే.

ఆధునిక యుగంలో కొన్ని నియమాలను ఏర్పరచుకొని ఒక సూచీ తయారు చేసే ప్రయత్నం తొలిసారిగా ఇంగ్లండ్‌లో ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ గ్రంథాలయంలో పని చేస్తున్న సర్ థామ్సన్ బ్రాడ్లీ చేశాడు. తాను రూపొందించిన నిబంధనల ఆధారంతో ఆ గ్రంథాలయానికి సూచీ తయారు చేశాడు. తదుపరి ఫ్రాన్సు దేశానికి చెందిన ఫ్రెడరిక్ రోస్టార్డ్ కొన్ని సూచీ నియమాలు చేసి 1698లో ప్రచురించాడు. విషయాల వారిగా పుస్తకాల అమరికకు ఈ నియమాలు బాగా ఉపకరిస్తాయి. పిదప ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ, అమెరికా, రష్యా మొదలైన దేశాలలో మరికొన్ని సూచీ నియమాలు వెలువడ్డాయి. ప్రధానంగా ఇవి కొన్ని గ్రంథాలయాలలో మాత్రమే అమలుకు పరిమితమైనవి. శాస్త్ర బద్ధమైన రీతిలో అనేక గ్రంథాలయాలకు పనికి వచ్చే రీతిలో సూచీ నియమాలు తయారు చేసే గౌరవం సర్ ఏంటనీ పానిట్సీకే దక్కింది.

## బ్రిటీషు మ్యూజియమ్ సూచీ స్మృతి - 1839

ఈ స్మృతిని బ్రిటిష్ మ్యూజియమ్ (నేడు బ్రిటిషు గ్రంథాలయం) గ్రంథపాలకుడైన సర్ ఏంటొనీ పానిట్సీ (1797 – 1879) నూతన పద్ధతిలో 1839లో తయారు చేశాడు. దీన్లో 91 నియమాలున్నాయి. గ్రంథాలయ సూచీ కరణలో శాస్త్రీయ పద్ధతిలో తయారు చేసిన తొలి నియమావళి ఇదే. పానిట్సీ ఈ నియమాలను తయారు చేశాక బ్రిటీషు మ్యూజియమ్ గ్రంథాలయంలో వాటిని అమలు

చేశాడు. ఇది 1841లో తొలిసారి ప్రచురితమైంది. ఈ నియమావళి అనేక సంస్కరణలు పొందుతూ చివరిసారిగా 1936లో అచ్చయింది. ఈ నియమాలలో ఈ దిగువ ఉదహరించిన ప్రత్యేకతలున్నాయి.

1 ఈ నియమాలలో రచయితల పత్రాలు తయారు చేయడానికి వీలుంది. ప్రభుత్వ ప్రచురణలకు అవకాశం ఏర్పాటు చేశారు.

2 ఈ స్మృతి వల్ల చదువరి కోరిన పుస్తకం గ్రంథాలయంలో ఉందో లేదో చెప్పవచ్చు.

3 అలాగే ఒక రచయిత, అనువాదకుడు, సంపాదకుడు మొ॥ వారి పుస్తకాలు ఒక గ్రంథాలయంలో ఏమి ఉన్నాయో చెప్పవచ్చు.

4 ఈ స్మృతిని అనుసరించే ఆంగ్లో—అమెరికన్ నియమాలలో చాల భాగం తమ రూపు దిద్దు కున్నాయి. దీనిని బట్టి ఈ నియమాల విలువ ఊహించవచ్చు.

5 తొలుత ఈ సూచీ బ్రిటీషు మ్యూజియమ్ — అనే ఒక్క గ్రంథాలయంలో అమలు చేయడానికే తయారు చేశారు. ఈ నియమాల సౌలభ్యాన్ని గ్రహించి తదుపరి అనేకులు అనుసరించారు.

6 ప్రభుత్వం, సంస్థల ప్రచురణల విలువను తొలిసారిగా ఈ సూచీలో గుర్తించారు. తొలుత వీటిని ఆయా ప్రభుత్వాలు, సంస్థల పేరుతోనే శీర్షిక చేయడం జరిగింది.

7 స్మృతి నిర్మాణపు విలువలో దీనికెంతో ప్రాధాన్యం ఉంది

నిఘంటు సూచీ నియమాలు 1876

చార్లెస్ ఏమికటర్ (1837–1903) 1868లో బోస్టన్ అధినీయం గ్రంథాలయానికి గ్రంథపాలకుడుగా చేరేనాటికే కొన్నినియమాలు అమల్లో ఉన్నాయి. అవన్నీ క్రమబద్ధంగా, హేతుపూర్వంగా లేవని భావించి 1876లో నిఘంటు సూచీనియమాలను తయారు చేశాడు. ఈ నియమాల ఆధారంతో అధినీయ గ్రంథాలయానికి నిఘంటు

సూచీతయారు చేశాడు. పుస్తకరూపంలో గూడ అచ్చేయించాడు. వీనికి అమెరికా గ్రంథాలయ క్షేత్రంలో పెద్ద పేరు వచ్చింది.

కటర్ నిఘంటు సూచీ నియమాల రెండో ముద్రణ 1889లో, మూడోది 1891లో వెలువడ్డాయి. నాలుగోముద్రణ కటర్ మరణానంతరం 1904లో వెలువడింది. ఇందులో మొత్తం 369 నియమాలున్నాయి. ఇవి గ్రంథకర్త, గ్రంథనామం, విషయాలకు సంబంధించినవి. ఇందులో పద్దుల అమరికకు సంబంధించిన నియమాలు కూడ పొందు పరచబడ్డాయి. తొలుత ఈ నియమాలు ముద్రిత గ్రంథ సూచీలు తయారు చేయడానికి ఉపయోగ పడేవి. తదుపరి నాలుగో ముద్రణ నుంచి కార్డు రూపంలో గల సూచీలు తయారు చేయడానికి ఉపయోగించేట్లు మలిచారు. నిఘంటు సూచీ నియమాలను ఆధారం చేసుకునే ఆనాడు లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్, యం. ఇ. సయర్సు విషయ శీర్షికల పట్టీ తయారు చేశారు. ఈనియమాలలో ఈ దిగువ ఉదహరించిన ప్రత్యేకతలున్నాయి.

1 ఈ నియమాలలో ప్రధానంగా చదువరి అవసరం, గీటురాయిగా తీసుకోవడం జరిగింది. అందుచేత నియమాలు జటిలంగా లేవు. అవసరాన్ని బట్టి మార్చుకోడానికి వసతి కల్పించారు. ఈనియమాలలో ప్రచారం గల గ్రంథకర్త పేరుతోనే శీర్షికగా తీసుకోడానికి ఏర్పాటు జరిగింది. అలాగే విషయాల పద్దులు కూడా. పేర్లలో మార్పు, మారుపేర్ల విషయంలో ప్రత్యామ్నాయ మార్గాలు చూపడం జరిగింది.

2 దాదాపు ఈ సూచీనియమాలు చలామణిలోకి వచ్చాకే విషయ పద్దుల క్రమం ప్రారంభమైంది.

3 ప్రభుత్వ, సంస్థల, సంఘాల ప్రచురణ విషయంలో స్పష్టమైన నియమాలు రూపొందాయి.

4 అయినప్పటికీ ఈనియమాలు పెద్దగా ప్రచారాన్ని పొందలేక పోయాయి.

## ఆంగ్లో అమెరికన్ సూచీస్మృతి 1908

ప్రపంచ ప్రసిద్ధ గ్రంథాలయశాస్త్రవేత్త మెల్విల్ డ్యూయీ (1851–1922) 1876లో లైబ్రరీ బ్యూరో స్థాపించాడు. ఈసంస్థ తరపున గ్రంథాలయోద్యమ

కార్యక్రమాలను నిర్వహించాడు. అమెరికన్ గ్రంథాలయ సంఘం. బ్రిటిషు గ్రంథాలయ సంఘం సంయుక్తంగా ఒకసూచీ నియమావళి తయారు చేస్తే ఇంగ్లీషు భాష మాట్లాడే రెండు దేశాల గ్రంథాలయాలకు పరిపోతుందనే సూచన చేశాడు. తుదకు ఈ రెండు సంఘాలు నియమించిన ఉపసంఘ గ్రంథకర్త, గ్రంథనామంపై పద్దులకుం నియమాలు (కేటలాగింగ్ రూల్స్ ఫర్ ఆథర్ అండ్ టైటిల్ ఎంట్రీస్) తయారు చేయగా, వాటిని 1908లో ప్రచురించారు.

ఈ సూచీలో నియమాలు మరింత విస్తృతంగా ఉన్నందున చిన్న స్థాయి గ్రంథాలయాలకు వీటిని అనుసరించడం కొంత కష్టమైంది. పైగా అతిముఖ్యమైన విషయ పద్దులు తయారు చేయడానికి ఇందులో నియమాలు, అమరికసూత్రాలు లేక పోవడం పెద్ద లోపమే. అంతేగాక మారుతున్న అవసరాలకనుగుణంగా పరిష్కరణ జరగలేదు. ఇందు వలన ఈ నియమాలు అమలు చేస్తున్న గ్రంథాలయాలకు కొంత అసౌకర్యం కలిగింది.

ఈ లోపాన్ని సరిదిద్దడానికి అమెరికన్ గ్రంథాలయ సంఘం పూనుకొని 1941లో ప్రాథమిక ప్రతిని వెలువరించింది. దీన్ని మరల పరిష్కరించి ఎ. ఎల్. ఎ. క్యాటలాగింగ్ రూల్స్ ఫర్ ఆథర్ అండ్ టైటిల్ ఎంట్రీస్ పేర 1949లో ప్రచురించింది. అయితే ఈ నియమాలను తు. చ. తప్పక అమలు చేయడం క్లిష్టంగా ఉంటుంది. నియమాలలో చాల భాగం హేతుబద్ధంగా లేవు. ఈ సూచీ వలన ఒక గ్రంథకర్త రచనలు, అతనిపై విమర్శలు, వ్యాఖ్యానాలు, అనువాదాలు ఒకేదరికి రావడానికి అవకాశం ఉంది. ఈ సూచీలో ఇదో మంచి లక్షణం. ఇందులో తరచుగా వచ్చే పునరుక్తులు. ప్రభుత్వం, సంస్థల పద్దులలో అసందిగ్ధత చోటు చేసుకొని ఉండనే ఉన్నాయి.

### వర్గీకృత సూచీ స్మృతి 1934

ఈ స్మృతి నిర్మాత డాక్టర్ ఎస్. ఆర్. రంగనాథన్ (1892–1972) తొలిసారిగా ఇది 1934లో తయారై మద్రాసు విశ్వ విద్యాలయ గ్రంథాలయంలో అమలు జరిగింది. దీని అయిదోసంస్కరణ డా. రంగనాథన్ చేతిమీదుగా 1964లో జరిగింది. తదుపరి దీని విషయం పట్టించుకున్నవారు లేరు. డా. రంగనాథన్ ప్రతిపాదించిన

సూచీకరణ సిద్ధాంతాలను అనుసరించే ఈస్మృతి తయారైంది. కనుక ఈ నియమాలు చిరకాలం నిలవడానికి అవకాశంఉంది. ఈ సూచీలో ఈ దిగువ ఉదహరించిన ప్రత్యేకత లున్నాయి.

1 వర్గీకృత సూచీ తయారు చేయడానికి గాను ఆంగ్ల భాషలో తయారైన తొలి సమగ్రస్మృతి ఇది.

2 ఇందు సూచీ నిర్మాణానికి సంబంధించిన అన్ని నియమాలు, అమరిక నియమాలు స్పష్టంగా ఉన్నాయి. బహుసంపుట గ్రంథాలకు, సమీకృత సూచీ, జాతీయ గ్రంథ సూచీ, సారాంశాలు తయారుచేయడానికి నియమాలున్నాయి. కొన్ని విధాయక సూత్రాల (నార్మేటివ్ ప్రిన్సపల్స్) ఆధారంతో తయారైన నియమాలు ఈసూచీకి గొప్ప శక్తి నిస్తున్నాయి.

3 సూచీ నిర్మాణం విషయ పద్ధల ప్రాధాన్యతతో ఉన్నందున విషయపరమైన అధ్యయనానికి ఈ సూచీ బాగా ఉపకరిస్తుంది.

4 ఈ సూచీలో వర్గీకరణ, సూచీకరణలకు గల పరస్పర సహకారం (సింబయోసిస్) సమన్వయం సాధికారంగా, సోదాహరణంగా చూపడం జరిగింది.

5 ఈ సూచీలో గ్రంథాలయంలో గ్రంథాలయ భాషకు మొదటి స్థానం, అభిమాన భాషకు రెండోస్థానం ఇచ్చినందున విశ్వ జనీనత సాధించగలిగింది. నేడు ప్రపంచ వ్యాప్తంగా గల గ్రంథాలయశాస్త్ర అధ్యయనలో చాలవరకు ఈ సూచి స్మృతిని గురించి బోధించడం జరుగుతూంది. అయితే బహుతక్కువ గ్రంథాలయాలలో మాత్రమేఅమలుజరగడం దురదృష్టం. అయితే జాతీయ గ్రంథ సూచీ (నేషనల్ బిబ్లియోగ్రఫి) పద్ధల విషయ శీర్షికల తయారీకి ఈ సూచీలో వివరించిన గొలుసు అమరిక విధానం అనుసరించడం గమనార్హం.

## సూచీకరణ రంగంలో పెద్దమార్పు

అంతర్జాతీయ గ్రంథాలయసంఘాల సమాఖ్య గ్రంథాలయ సూచీకరణలో అంతర్జాతీయ స్థాయిలో ప్రమాణాలు సాధించే నిమిత్తం 1961లో పారిస్‌లో సూచీకరణ సూత్రాలపై అంతర్జాతీయ మహాసభను నిర్వహించింది. ఈ సూత్రాలు శీర్షికల

ఎంపిక, రూపం, పద్దుల పదాల కూర్పుకు సంబంధించినవై ఉంటాయి. ముఖ్యంగా సూచీవిధులు, సూచీ నిర్మాణం, వివిధ రకాల పద్దుల నిర్మాణంలో ఎన్నో ప్రమాణాలు నిర్దేశించబడినాయి. అందువలన 1961 పిదప వచ్చిన ప్రతి సూచీనియమాలలోనూ ఈ సూత్రాలు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నిక్షిప్తమై ఉన్నాయి. ముఖ్యంగా ముందు చెప్పబోవు ఎ. ఎ. సి. ఆర్—1 కు ఈ సూత్రాలు ప్రాతిపదిక అయ్యాయి. కనుక "పారిస్ ప్రిన్సిపల్స్" పేరుతోగల పది సూత్రాలకు గ్రంథాలయ సూచీకరణ రంగంలో ఎంతో ప్రాధాన్యం ఉంది.

## ఆంగ్లో-అమెరికన్ సూచీకరణ నియమాలు - 1:1967

సూచీలో సమానత్వం సాధించే నిమిత్తం లైబ్రరి ఆఫ్ కాంగ్రెస్, అమెరికన్ గ్రంథాలయ సంఘం, బ్రిటిష్ గ్రంథాలయ సంఘం కెనడా గ్రంథాలయ సంఘం కలసి సంయుక్తంగా మూల గ్రంథం తయారు చేసారు. దీనికి కొద్ది పాటి చేర్పులు మార్పులతో అమెరికన్ గ్రంథాలయసంఘంవారు అమెరికన్ పాఠాన్ని (వర్షన్), బ్రిటిష్ గ్రంథాలయ సంఘం బ్రిటిష్ పాఠాన్ని ప్రత్యేకంగా 1967 లో ప్రచురించారు.

ఇందు మొదటి భాగంలో పద్దులు తయారు చేసే విధానం, శీర్షికలుగా వ్యక్తులు, శీర్షికలుగా సంస్థలు, ఏకరూప శీర్షికలు, మార్గదర్శనాలు, రెండో భాగంలో చిన్న పుస్తకాలు, ధారావాహికలు, ప్రాచీన గ్రంథాలు, ఫోటోగ్రాఫిక్ పునర్ముద్రణలకు సూచీ తయారు చేసే విధానాలు, మూడో భాగంలో రాత ప్రతులు, దేశపటాలు, చలనచిత్రాలు, సంగీతం, గ్రామఫోన్ రికార్డులు మొ॥ వాటికి సూచీ తయారు చేసే నియమాలున్నాయి. ఈనియమాలలో ఈదిగువ ఉదాహరించిన ప్రత్యేకతలున్నాయి.

1 గ్రంథకర్త ఉంటే అతనిపేరనె శీర్షికచేయాలి. లేకుంటే రచనకు కారణభూతుడైనసంపాదకుడు/సంకలనకర్త పేర శీర్షికచేయాలి. గ్రంథకర్త పేరు అసందిగ్ధంగా ఉంటే లేదా తెలియక పోతే గ్రంథనామం పేర శీర్షిక చేయాలి.

2 శీర్షికలన్నీ సూటిగా, సరళంగా సుబోధాత్మకంగా ఉంటాయి.

3 నియమాలన్నీ ఇంతకుముందుకంటే మరింత హేతుబద్ధంగా ఉన్నాయి.

4. 1961లో పారిస్ మహాసభ ఆమోదించిన సూచీకరణసూత్రాల ప్రాతిపదికపై ఈనియమాలు రూపొందాయి. గనుక వీటివెనుక ఒక సమగ్రమైన ఆలోచన, అన్వేషణఉన్నాయి.

5. ఈ నియమాలలోని లోపాలు, (అమెరికన్, బ్రిటిష్) రెండుపాఠాలను సరిదిద్దడానికి సంఘం ఉంది.

హేతుబద్ధనిర్ణయాలు, సమగ్రఆలోచన—ఈనియమాల వెనుక ఉన్నందునసూచీకారుడు తన విచక్షణా జ్ఞానాన్ని ఉపయోగించుకునేస్వేచ్ఛ బాగా ప్రచారంలోకి వచ్చింది. అయితే ఈసూచీని "ఆటోమేషన్"కు వర్తించడానికి అనువుగాలేదు. కంప్యూటర్లవాడకానికి బాటలుగాలేదు. అందుచేత ఊహించనలవిగాని వేగంతో పెరుగుతిన్న శాస్త్రవిజ్ఞానాన్ని కనువుగా లేదా అందరికి చేరేందుకువీలుగా 1967 నియమాలనుపూర్తిగా పరిష్కరించాల్సినఅవసరంఏర్పడింది. తత్ఫలితమే ఆంగ్లో అమెరికన్ నియమాలు—2. 1978

మనంఎంతో విపులంగా చర్చించబోతున్న దీన్నిగురించి తదుపరి అధ్యాయంలో వివరంగా తెలుసుకుందాం.

— 0 —

# 7 ఎ. ఎ. సి. ఆర్ – 2 ప్రత్యేకత

గ్రంథాలయ రంగంలో సూచీ నియమాలు (కేటలాగింగ్ రూల్స్) లేదా స్మృతులు లేదా కల్పాల తయారీకి సుదీర్ఘమైన చరిత్ర ఉంది. సంప్రదాయ రీతిలో తరతరాల నుంచీ గ్రంథాలయ సూచీల నిర్మాణం జరుగుతూ ఉన్నా, శాస్త్ర బద్ధమైన రీతిలో సూచీ నిర్మాణానికి గత శతాబ్ది తుదిపాదంలో అంకురార్పణ జరిగింది. అందుకు అమెరికా దేశానికి చెందిన చార్ల్స్ ఎమికటర్ (1837 – 1914) శ్రీకారం చుట్టారు. నిఘంటు సూచీకి నియమాలు తయారు చేశారు. చేర్పులు, మార్పులు నూతన పథకాలతో పలువురు గ్రంథాలయ విజ్ఞానవేత్తలు ఈ మార్గాన్ని అనుసరించారు. ఈ రంగంలో గత నూరేళ్ల కాలంలో ఈ దిగువ ఉదహరించిన గ్రంథాలయ నియమాలు వ్యాప్తిలోకి వచ్చాయి.

1 1876 రూల్స్ ఫర్ డిక్షనరీ కేటలాగ్ (నిఘంటు సూచి నియమాలు) చార్ల్స్ ఎమికటర్

2 1908 ఆంగ్లో అమెరికన్ కేటలాగ్ కోడ్ (ఆంగ్లో – అమెరికన్ సూచీ స్మృతి)

3 1927 బ్రిటిష్ మ్యూజియమ్ రూల్స్ ఫర్ కంపైలింగ్ కేటలాగ్స్ ఇన్ ది డిపార్ట్మెంట్ ఆఫ్ ప్రింటెడ్ బుక్స్ (బ్రిటిష్ మ్యూజియమ్ నియమాలు)

4 1934 క్లాసిఫైడ్ కేటలాగ్ కోడ్ (వర్గీకృత సూచీ స్మృతి). డాక్టర్ ఎస్. ఆర్. రంగనాథన్. ఐదవ పరిష్కరణ 1964

5 1949 అమెరికన్ లైబ్రరీ అసోసియేషన్ క్యాటలాగింగ్ రూల్స్ ఫర్ ఆథర్ అండ్ టైటిల్ ఎంట్రీస్ (అమెరికన్ గ్రంథాలయ సంఘ సూచీ నియమాలు)

6 1967 ఆంగ్లో అమెరికన్ క్యాటలాగింగ్ రూల్స్ (ఆంగ్లో అమెరికన్ సూచీ నియమాలు) పరిష్కరణ 1971

## 7 1978 ఆంగ్లో అమెరికన్ క్యాటలాగింగ్ రూల్స్– 2 (ఆంగ్లో అమెరికన్ సూచీ నియమాలు)

ఇటీవలి వరకు ఆంధ్రప్రదేశ్‌లోని గ్రంథాలయాలలో ఆంగ్లో అమెరికన్ నియమాలనే అతి స్వల్పమైన మార్పులు చేసి వినియోగిస్తున్నారు. మారుతున్న కాలానికి అనుగుణంగా 1978లో వెలువడిన ఆంగ్లో అమెరికన్ నియమాలు – 2 (ఎ. ఎ. సి. ఆర్ – 2) ఇటీవల గ్రంథాలయ శిక్షణలో, గ్రంథాలయాలలో వాడుకలోకి వచ్చింది.

### నూతన నియమాల ఆవిర్భావం

పాశ్చాత్య గ్రంథాలయ రంగంలో విప్లవాత్మకమైన మార్పులు వస్తున్నాయి. కంప్యూటర్ల వాడకం, ఆటోమేషన్ ప్రభావం బాగా హెచ్చింది. తత్ఫలితంగా గ్రంథాలయ సూచీ కరణలో, గ్రంథ సూచీల తయారీలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకు రావలసిన అవసరం ఏర్పడింది. 1974లో చికాగోలో అమెరికన్ గ్రంథాలయ సంఘ కార్యాలయంలో అమెరికా, బ్రిటన్, కెనడా దేశాలకు చెందిన నిపుణులతో కలసి ఏర్పాటైన జాయింట్ స్టీరింగ్ కమిటీ ఆంగ్లో అమెరికన్ నియమాలు—1 (1967)ను పూర్తిగా సంస్కరించడానికి నిర్ణయం తీసుకుంది. ఈ సంఘ ఆశయాలు ఇలాఉన్నాయి.

1 ఆంగ్లో అమెరికన్ సూచీ నియమాలలో ఉత్తర అమెరికా బ్రిటీషు పాఠ్యాంశాల (టెక్స్ట్స్)ను కలిపేయడం,

2 ఇంతకు ముందు అంగీకరించిన సవరణలను చేర్చడం,

3 ఈ నియమాలు పాటించే దేశాలనుంచి వచ్చే సూచనలను పాటించడం,

4 కంప్యూటర్, ఆటోమేషన్ మొదలైన నవీన యంత్రాలు దృష్టిలో ఉంచుకోవడం,

5 ప్రపంచ వ్యాప్తంగా అమలు చేసే తీరులో సూచీ నియమాలు తయారు చేయడం.

ఈ దర్శక సూత్రాలను దృష్టిలో ఉంచుకొని జాయింట్ స్టీరింగ్‌కమిటీ తయారు చేసిన నియమాలను అమెరికన్ గ్రంథాలయ సంఘం – ఆంగ్లో అమెరికన్ సూచీ కరణ నియమాల పేరుతో 1978లో వెలువడింది. ఈ నూతన నియమాలలో ఈ దిగువ ఉదహరించిన ప్రత్యేకతలు ఉన్నాయి.

1 గ్రంథాలయ సూచీకరణలో ఇటీవల వచ్చిన మార్పులు అనగా మెషీన్ రీడ బుల్ కేటలాగింగ్ (ఎం. ఎ. ఆర్. సి.) ప్రాజెక్టు, 2 షేర్డు కేట లాగింగ్ ప్రాజెక్టు, 3 కేటలాగింగ్ ఇన్ పబ్లికేషన్ ప్రోగ్రాం, 4 ఇతర యాంత్రిక, 5 ఆటోమేషన్ పథకాలకు అనుగుణంగా ఈ నియమాలను రూపొందించారు

2 పరిశోధనా కేంద్రాలు, పెద్ద గ్రంథాలయాలు దృష్టిలో ఉంచుకొని నియ మాలను రూపొందించారు. అంతర్జాతీయ గ్రంథాలయాల సమాఖ్య (ఐ. ఎఫ్ ఎల్. ఎ) రూపొందించిన ఇంటర్ నేషనల్ స్టాండర్డు ఫర్ బిబ్లియోగ్రాఫిక్ డిస్క్రిప్షన్ (ఐ. ఎస్. బి. డి – 29)కి అనుగుణంగా ఈ నియమాలుంచడం ఒక విశేషం. అంతర్జాతీయ సూచీకరణ విధానాన్ని ఏకీకృతం చేయడానికి ఈ నియమాలు ఉపకరిస్తాయి.

3 ప్రధాన పద్దులతో బాటు అన్ని పద్దులకు సమాన ప్రాతినిధ్యం ఇవ్వడం జరిగింది. ప్రతి పద్దులో వివరణ పూర్తిగా ఉండడం ఒక విశేషం. కనుక ప్రతి పద్దూ ప్రధాన పద్దే అనిపిస్తుంది.

నియమాల కూర్పు

ఈ నూతన పథకాన్ని అనుసరించి నియమాలు రెండు భాగాలుగా ఉన్నాయి. మొదటి భాగం : వర్ణనకు సంబంధించిన నియమాలు. ఇందు గ్రంథాలయంలో లంభించే అన్నిరకాల పఠన సామగ్రి – అనగా ముద్రిత గ్రంథాలు, పత్రికలు, రాతప్రతులు మొ॥ అన్నిటికీ సంబంధించిన వివరాలను ఎనిమిది అంశాలుగా విభ జించారు.

1 గ్రంథనామం, రచనకు బాధ్యులైన వ్యక్తి/సంస్థ
2 సంస్కరణ, ముద్రణ

3 పఠన సామగ్రి స్వభావం
4 ప్రచురణ కర్త/పంపిణీ దారులు
5 భౌతిక వివరాలు
6 గ్రంథ మాల వివరాలు
7 వివరణ (నోట్సు)
8 అంతర్జాతీయ ప్రమాణ గ్రంథ సంఖ్య

ప్రతి అంశం వేరుగా గుర్తించడానికి వీలైన''.:– ''మొదలైన విరామ చిహ్నాలు, ఖాళీస్థలం, వాలుగీత''/ ''(శ్లాస్) మొదలైనగుర్తులు ఒక పద్ధతి ప్రకారం ఉన్నాయి.

## మూడుస్థాయిల్లో ప్రమాణీకరణ

ఈ నూతన నియమాలలో మూడు స్థాయిలలో ప్రమాణీకరణ చేయ సంకల్పించడం ఒక విశిష్ట లక్షణం. ఇందు తొలిస్థాయి వివరాలు పఠన సామగ్రి గురించి తెలుసుకో డానికి, గుర్తించడానికి వీలవుతుంది. కొద్దిస్థాయి గ్రంథాలయాలకు ఈ విధానం సిఫారసు చేయడమైనది. ఇందు ఈ దిగువ ఉదహరించిన వివరాలుంటాయి.

1 గ్రంథనామం, రచనకు బాధ్యుడైన వ్యక్తి/సంస్థ
2 సంస్కరణ/ ముద్రణ వివరాలు
3 ప్రచురణాది వివరాలు
4 ప్రత్యేక అంశాల వివరణ
5 అంతర్జాతీయ పుస్తక ప్రమాణ సంఖ్య

రెండవస్థాయి వివరాలు, గ్రంథసూచీ వివరాలు ఎక్కువగా అవసరమైన పెద్దస్థాయి గ్రంథాలయాలకు అవసరమౌతాయి. ఆంధ్రప్రదేశ్ లో కళాశాలల గ్రంథాలయాలు, జిల్లా కేంద్ర గ్రంథాలయాలు, ప్రాంతీయ గ్రంథాలయాలు, ప్రథమ శ్రేణి శాఖా గ్రంథా లయాలలో, పుస్తకాల సంఖ్య క్రమంగా 20 నుంచి 50 వేలు, కొన్నిటికి అంతకు మించి చేరుకుంటున్న సందర్భాలలో సూచీకరణ చేసే నిమిత్తం రెండోస్థాయి

వివరాలు సూచీలో చేర్చవలసిన అవసరం ఉంది. ఇందు ఈ దిగువ ఉదహరించిన వివరాలుంటాయి

1 గ్రంథనామం, ఉపనామం, తుల్యమైన గ్రంథ నామం, గ్రంథ నామానికి సంబంధించిన ఇతర సమాచారం, గ్రంథరచనకు బాధ్యులైన వ్యక్తి/సంస్థ/సంఘం

2 సంస్కరణ/ముద్రణ

3 ప్రచురణ స్వభావం, నిర్దిష్ట సమాచారం

4 ప్రచురణ స్థలం, ప్రచురణకర్త, తేదీ మొ.

5 భౌతిక వివరాలు, పుటలు, పటాలు, కొలతలు

6 ధారావాహిక ప్రచురణసంఖ్య

7 అంతర్జాతీయ ధారావాహిక ప్రచురణసంఖ్య (ఐ.ఎస్.ఎస్ నంబరు)

8 తప్పక ఉదహరించాల్సిన ప్రత్యేక వివరాలు

9 అంతర్జాతీయ పుస్తక ప్రమాణ సంఖ్య

తొలి రెండు స్థాయిలలో గ్రంథాలయాల సూచీకరణ నియమాలలో గ్రంథనామాలకి ప్రాధాన్యం ఇవ్వడం గమనించ దగింది. రచయితకు రెండోస్థానం మాత్రం ఇచ్చారు. రచయిత పేర్ల శీర్షికల ఎంపికలో ప్రపంచ వ్యాప్తంగా—అమల్లో ఉన్న నియమాలను వ్యాఖ్యానించడంలో నిపుణులమధ్య భిన్నాభిప్రాయాలున్నాయి. ఈ చిక్కుల నుండి బయటపడడానికి సులభమార్గం గ్రంథనామం పేర శీర్షిక చేయడం. ప్రతిపద్దులో ప్రధానపద్దు/తొలిపద్దుతో సమానంగా వివరాలుండడం పరిష్కారమార్గంగా తోచింది.

ఇహ చివరగా మూడవస్థాయి వివరాలు—అంటే ఆంగ్లో అమెరికన్ నియమాలు—2 లోని ప్రతి అంశం తు.చ తప్పక అనుసరించ వలసినవి. అతి సూక్ష్మమైన గ్రంథ సూచీ సమాచారం అవసరమైన అత్యున్నతస్థాయి ప్రత్యేక గ్రంథాలయాలకు అవసర మౌతుంది. ఈ గ్రంథంలో ఆ వివరాలు ఇవ్వడం సాధ్యం కాదు. పైగా ప్రస్తుతానికి అంత నిశిత పరిశీలన అవసరమూ లేదు.

సూచీ కర్తలకు స్వేచ్ఛ

ఈ నియమాలు అనుసరణలో సూచీకర్తలకు బాగా స్వేచ్ఛ ఇవ్వడం జరిగింది. అనేక చోట్ల ప్రత్యామ్నాయనియమాలు ఐచ్ఛిక నియమాలు ఇవ్వడం జరిగింది. ఇలాంటి మార్పులు చేసినప్పుడు విధాన నిర్ణయం విధిగా తీసుకోవాల్సిందే. తీసుకున్న నిర్ణయం మధ్యలో మార్చకుండా పాటించ వలసిందే. లోపాలు మరల రాకుండా చేసిన మార్పులకు ప్రతి గ్రంథాలయంలో ''మార్పుల రికార్డు'' విధిగా నిర్వహిస్తే సమంగా సూచీ పనిసాగడానికి వీలుంది.

ఉన్నంతలో ఈ నియమాలు ప్రయోజనకరంగా ఉన్నాయి. గ్రంథాలయం ఆధునిక వంతం అవుతున్న కొలదీ, ఆటోమేషన్ వైపుజరుగుతున్న కొలదీ ఈ నియమాలు మరింత ప్రయోజనవంతంగా కనుపించాలి. ఈ నియమాల ఆవిర్భావాన్ని ప్రపంచ గ్రంథాలయ నిపుణులంతా హర్షించారు. మనమూ ముందుచూపుతో పయనిస్తే ఈ నియమాల వాడకం తప్పనిసరౌతుంది.

—0—

# 8 ఎ. ఎ. సి. ఆర్ 2 — సి. సి. సి.
# తులనాత్మక పరిశీలన

సూచీకరణ రంగంలో నియమాల తయారీపై వచ్చిన స్మృతులు, కల్పాలకు సుదీర్ఘమైన చరిత్ర ఉంది. అమెరికన్, బ్రిటిష్ గ్రంథాలయ సంఘాలు వేరువేరుగా సూచీ నియమాలను ప్రచురిస్తూ వచ్చాయి. మారుతున్న అవసరాలదృష్ట్యా వీటిని పరిష్కరించాల్సిన అవసరంఏర్పడింది. ఈరెండు దేశాలలో భాషా, సంస్కృతుల మధ్య సన్నిహిత సంబంధాలుండడం చేత రెండుదేశాలకు పనికివచ్చే ఉమ్మడి సూచీ కల్పాన్ని 1908లో తయారు చేశారు. 1920 నాటికి ఈకల్పంపైబాగా విమర్శలు లేచాయి. ఇందు నిమిత్తం 1930 ప్రాంతాల రెండు సంఘాలు ఏర్పడ్డాయి. బ్రిటన్‌లో అలము కొన్న యుద్ధమేఘాలు ఈ పనిని సాగకుండా చేశాయి. ఎట్టకేలకు అమెరికన్ గ్రంథాలయ సంఘం 1941 నాటికి ముసాయిదా తయారుచేసింది. 1949 లో నియమాలు విడుదలైనాయి. పారిస్ సూత్రాల నిర్ణయానుసారంగా వీటిని మరల పరిష్కరించవలసిన అవసరం ఏర్పడింది. ఆంగ్లో—అమెరికన్ నియమాలు తొలి పరిష్కరణ 1967 లో, మలిపరిష్కరణ 1978 లో వెలువడ్డాయి.

## వర్గీకృతసూచీ కల్పం

గ్రంథాలయ రంగంలో అనితర సాధ్యమైన కృషిచేసిన డాక్టర్ రంగనాథన్ 1934 లో ఈకల్పం తొలిసారి వెలువరించారు. 1945 లో దీని రెండోముద్రణ వెలువడినపుడు డాక్టర్ రంగనాథన్ సూచీకరణ సిద్ధాంతపరమైన విధాయకసూత్రాలు (నార్మేటివ్ ప్రిన్సిపల్స్) ఇందు చేర్చారు. వీటిని ఐదవ అధ్యాయంలో పరిశీలించాము. ఉపసూత్రాల (కానన్స్) ఆధారంతోదీన్ని వృద్ధి చేశారు. ముఖ్యంగా ఈ వర్గీకృత సూచీ వర్గీకరణకు సూచీకరణకు గల సంబంధాన్నిపటిష్టంచేసి ప్రదర్శించినఘనతను సాధించింది. కొన్ని విధాయక సూత్రాలపై రూపొందించిన మొట్టమొదటి వర్గీకృత సూచీ కల్పం ఇదే అంతేగాక సమగ్రమైన రీతిలో ఏర్పడిన తొలివర్గీకృతసూచీ కల్పంకూడ ఇదే. కనుక గ్రంథాలయక్షేత్రంలోవ్యాప్తిలోగల ఈరెండు సూచీల మధ్యఉన్న తేడాలనుపరిశీలిద్దాం

| | విషయం | ఎ.ఎ.సి.ఆర్–2 | సి.సి.సి. |
|---|---|---|---|
| 1 | నిర్మాతలు | అమెరికా, బ్రిటన్, కెనడా గ్రంథాలయ సంఘాలు | డా॥ ఎస్.ఆర్ రంగనాథన్ |
| 2 | తాజాముద్రణ | 1978 | 1964 |
| 3 | సంస్కరణ సంఖ్య | 2 | 5 |
| 4 | నియమాల పేరు | ఆంగ్లో–అమెరికన్ క్యాటలాగింగ్ రూల్స్ | క్లాసిఫైడ్ కేటలాగ్ కోడ్ |
| 5 | తెలుగు పేరు | ఆంగ్లో–అమెరికన్ సూచీనియమాలు | వర్గీకృతసూచీ స్మృతి/కల్పం |

**-2-**

| | | | |
|---|---|---|---|
| 1 | ఆధారం | పారిస్‌సూత్రాలు 1961 | విధాయక సూత్రాలు 1938 |
| 2 | రచయిత | రచయిత, చిత్రకారుడు, గ్రంథసూచీకర్త | రచనకు బాధ్యుడైన వ్యక్తి, సంస్థ |
| 3 | గ్రంథనామం | గ్రంథనామం, ఉపనామం తత్సంబంధవర్ణన | గ్రంథనామం, ఉపనామం |
| 4 | పరిష్కరణ (ఎడిషన్) | 2వ, పరి., 1987 | పరి. 2 |
| 5 | ప్రచురణ సం. | ఉంది | లేదు |
| 6 | సైజు, పుటలు | ఉంటాయి | లేవు |
| 7 | విరామ చిహ్నాలు | ఎక్కువ | దాదాపు తక్కువ |

— 3 —

| | | | |
|---|---|---|---|
| 1 | రచయిత పేరు | వెంకట రమణయ్య, అయ్యంకి<br>కృష్ణారావు, జి.వి. | వెంకటరమణయ్య (అయ్యంకి)<br>(కృష్ణారావు జి.వి.) |

గమనిక :

ఈ దిగువ అంశాలకు– పేరున– అని చేర్చి చదువు కోవాలి. ఉ : రచయిత పేరున, గ్రంథనామం పేరున

| | | | |
|---|---|---|---|
| 2 | ఒకే రచయిత | రచయిత | రచయిత |
| 3 | ఇద్దరు/ముగ్గురు రచయితలు | తొలి రచయిత | తొలి రచయిత/ తదితరులు |
| 4 | నలుగురు రచయితలు, అంతకంటే హెచ్చు | గ్రంథనామం | మొదటి రచయిత, తదితరులు |
| 5 | పరిష్కరణ | మూల రచయిత | మూల రచయిత |
| 6 | వ్యాఖ్యాత | మూల రచయిత | మూల రచయిత |
| 7 | వ్యాఖ్యానం ప్రధానంగా ఉంటే | వ్యాఖ్యాత | వ్యాఖ్యాత |
| 8 | సంపాదకత్వం | మూల రచయిత | మూల రచయిత |
| 9 | సంకలనాలు | గ్రంథనామం | సంకలన కర్త |
| 10 | అనువాదాలు | మూల రచయిత | మూల రచయిత |
| 11 | కలం పేర్ల రచనలు | ప్రచారంలో ఉన్న పేరు | ముఖ పత్రం మీదున్నది |
| 12 | వివాహిత రచయిత్రులు | వివాహనామం | |

## - 4 -

| | | | |
|---|---|---|---|
| 1 | ప్రభుత్వ రాజ్యాధినేత | ప్రభుత్వం పదవినామం (పాలనా కాలము : వ్యక్తి సంక్షిప్తనామం) | ప్రభుత్వం,పదవి నామం (వ్యక్తి నామం) |
| 2 | ప్రభుత్వ రచనలు | ప్రభుత్వం శాఖ | ప్రభుత్వం, శాఖ |
| 3 | శాసన సభలు | ప్రభుత్వం—శాసనసభ | ప్రభుత్వం, శాసనసభ |
| 4 | కోర్టు తీర్పులు | కోర్టు రిపోర్టరు | కోర్టు |
| 5 | స్థానిక సంస్థలు | సంస్థ | సంస్థ |
| 6 | విశ్వవిద్యాలయం | విశ్వవిద్యాలయం ఉ: సార్వత్రికవిశ్వ విద్యాలయం | విశ్వవిద్యాలయం (సార్వత్రిక) |
| 7 | సభలు | సభ ఉదా: సైన్స్ కాంగ్రెస్, (1986) | సభ సైన్స్ కాంగ్రెస్, (1986) |
| 8 | సదస్సులు | సదస్సు ఉదా: పౌరగ్రంథాలయ సదస్సు (1985: తిరుపతి) | సదస్సు పౌరగ్రంథాలయ సదస్సు తిరుపతి (1986) |
| 9 | రాజ్యాంగం | దేశం [రాజ్యాంగం] | ప్రభుత్వం |
| 10 | చట్టాలు | దేశం [చట్టాలు, మొ॥] | ప్రభుత్వం |
| 11 | సమరూప గ్రంథము | [ప్రచారనామం] ఉ: వేదాలు. అథర్వణవేదం | |

## — 5 —

| | | | |
|---|---|---|---|
| 1 | సాధారణ పత్రికలు | పత్రిక ఉదా: గ్రంధాలయ జ్యోతి. సంపు. 1 సంచి 1 (జులై 1979) | పత్రిక, ప్రచురించే సంస్థ |

| | | | |
|---|---|---|---|
| 2 | ప్రత్యేక సంచికలు | సంచిక<br>తెలుగువాణి 1975 | సంచిక, స్పాన్సారింగ్ సంస్థ |
| 3 | దర్శిని | దర్శిని<br>ఆంధ్రప్రదేశ్<br>వార్షిక దర్శిని, 1983 | దర్శిని, స్పాన్సారింగ్<br>సంస్థ |

కేవలం సూచీకరణలోతులనాత్మక పరిశీలన యందాసక్తిగల వారికి పై సమాచారం అందించడం జరిగింది. విద్యార్థులు మాత్రం పై సమాచారాన్ని వాక్య రూపంలో పొందు పరచుకోవచ్చును.

ఎ.ఎ.సి.ఆర్– 2 ప్రధానంగా వర్ణనాత్మకంగా, అంతర్జాతీయ ప్రమాణాలు, సమ రూపసాధన దృష్టిలో ఉంచుకొని తయారు చేయడం జరిగింది. పైగా ఈనాడు గ్రంథాలయ రంగంలో ప్రవేశిస్తున్న యాంత్రిక సరంజామాకు అనుగుణంగా ఉంది. నేటి గ్రంథాలయాలలో పఠన సామాగ్రికి అనుబంధంగా గల మైక్రోఫిల్ములు, మైక్రో ఫిచ్‌లు, మైక్రో కార్డులు, గ్రామఫోన్ రికార్డులు, వీడియో ఆడియో క్యాసెట్లు, పంచ్ కార్డులు, సంగీత స్వరూపాలకు, గడియారాలు, గ్లోబులు, బ్లూప్రింట్లు, ఫోటో స్టాట్ కాపీలు మొదలైన ఎన్నో నవీన పరికరాలకు, అవసరాలకు, ఆధునిక, అత్యంతా ధునిక ధోరణులకు ఎ.ఎ.సి.ఆర్–2 అవకాశం కల్పించింది. ప్రపంచవ్యాప్తంగా గ్రంథాలయరంగం ఈ నవీన సూచీకి నీరాజనం పలుకుతూంది. గ్రంథాలయాలలో గ్రంథాలయ విద్యాలయాలలో, సభలలో, సదస్సులలో, నలుగురి నోళ్లలో, మనస్సులలో నిత్యం మెదలుతూ ఉంది.

సి.సి.సి. చక్కని ప్రాతిపదికపై కొన్ని విధాయక సూత్రాల బలంతో నిర్మించిన దివ్య సౌధం. అయితే దీనికి ఆలనా పాలనా లేక శిధిల మౌతున్నది. విజ్ఞాన రంగంలో గత రెండు దశాబ్దాల కాలంలో ఊహించనంత మార్పు వచ్చినా ఈ కల్పం/స్మృతి విషయం పట్టించుకున్నవారు లేరు. విద్యాబోధనలో మాత్రం నిలచి ఉంటూ— ప్రయోగ రీత్యా బాగా కనుమరుగైంది. సుమారు అన్నిస్థాయిలలో ఐదువేల గ్రంథాలయాలున్న ఆంధ్రప్రదేశ్‌లో ఐదు గ్రంథాలయాలలోనైనా వర్గీకృత సూచీ అనుసరిస్తున్నారనేది అనుమానం. వర్గీకర్తకు, చదువరికీ కావలసింది సూచీకల్పం నిర్మాణంలో గొప్పదనం కాదు. ప్రయోగంలో, వాడుకలో ప్రయోజకత్వం, సరళత్వం, సహజత్వం, నేడు లభిస్తున్న సూచీ నియమాలలో ఎ.ఎ.సి.ఆర్–2కే ఆ గొప్పదనం ఉంది. ఆ పరిమళం ఉంది. అది విశ్వవిదితం.

# 9 పద్దుల నిర్మాణ విధానం

ప్రపంచంలోని అనేక దేశాలలో ఎ.ఎ.సి.ఆర్– 2 నియమాలు అమలులో ఉన్నాయి. మనదేశంలో, మనరాష్ట్రంలోని గ్రంథాలయాలలో కూడ ఈ నియమాలే అమలులో ఉన్నాయి.

ఇంతకు ముందున్న గ్రంథ సూచీలలో ప్రధాన పద్దుకు అధిక ప్రాధాన్యం, మిగతా పద్దులకు తక్కువ ప్రాధాన్యం ఉంటుంది. నేడు మనం చర్చిస్తున్న నియమాలలో ప్రధాన పద్దు ప్రాధాన్యం తగ్గించి వేశారు. ప్రధాన పద్దు శీర్షిక నిర్ణయంతో తికమకలుపడి కాలహరణం చెయ్యకుండా ఎలా ప్రారంభించినా మిగతా ప్రత్యామ్నాయ శీర్షికల నిర్ణయం ద్వారా ఆ లోపాన్ని తగ్గించ వచ్చుననే చార్ల్స్ ఎమికటర్ సూచన నేడు ఎ. ఎ. సి. ఆర్–2 లో నూటికి నూరు పాళ్ళు కార్య రూపం ధరించింది. ప్రధాన పద్దుతో మిగతా ఉప పద్దులకు సమాన ప్రతిపత్తి కల్పించారు. ఏమైనప్పటికీ నిఘంటు సూచీలో తొలిపద్దు, ప్రధాన పద్దు పేరుతో చేసి, తదుపరి ఉపపద్దులు చేయడం పరిపాటి. ప్రధాన పద్దు, ఉపపద్దులు చేయడంలో ఎంతో ఓర్పు, నేర్పు, శ్రద్ధ చూపినపుడు సూచీ ప్రయోజన కరంగా తయారౌతుంది. సూచీ నిర్మాణంలో కొన్ని సంగతులు గమనించాలి.

## పద్దులు హద్దులు

ప్రధాన పద్దులో గాని, ఉపపద్దులలోగాని ఒక నియతిని అనుసరించి హద్దులు (ఇండెన్షన్స్) ఉంటాయి. సూచీకరణలో ఈ హద్దులను విధిగా పాటించాలి.

1 2

3

పైన చూపిన కార్డులో ప్రదాన పద్దును తొలిహద్దు నుంచి ప్రారంభించి, రెండవ హద్దు మీదుగా కొనసాగించాలి. ఆ తర్వాత శీర్షికలో కొరవ ఉంటే మూడవ హద్దు నుంచే ప్రారంభించాలి. రెండవ హద్దు నుండి కొనసాగించరాదు ఉపపద్దులను రెండవ హద్దునుంచి ప్రారంభించాలి. శీర్షికలో కొరవఉంటే మూడవ హద్దునుండి కొనసాగించ వచ్చును. మిగతా విషయాలు ఆతర్వాత నమోదు చేయ వలెను. ఇంకా వివరంగా కావాలంటే—వివిధ హద్దుల ప్రారంభం ఈ తీరుగా ఉంటుంది.

తొలి హద్దు

గ్రంథకర్త / గ్రంథనామం / సంస్థ (శీర్షికగా ఉన్నపుడు)

రెండోవ హద్దు

1 గ్రంథనామం
2 పుటాది వివరణ
3 నోట్సు
4 అంతర్జాతీయ పుస్తక సంఖ్య

మూడో హద్దు

1 మార్గ సూచిక—చూడండి—ఇంకా చూడండి. మూడో హద్దునుంచి ప్రారం భించాలి.

పద్దుల వివరాలు

నిఘంటు సూచీలో పద్దులు ప్రధాన పద్దు, ఉప పద్దులని రెండు తీరులుగా ఉంటాయి. ప్రధాన పద్దు సాధ్యమైనంతవరకు గంథకర్త పేరనే చేస్తారు. కొన్నిసంద ర్భాలలో ప్రభుత్వాలు, సంస్థలు, సంఘాలు, గ్రంథనామాల పేర గూడ చేస్తారు. ఉప పద్దులు విషయం సహ గ్రంథకర్త, గుప్తనామం, గ్రంథనామం, అనువాదకుడు, సంపాదకుడు, వ్యాఖ్యాత, సంగ్రహకర్త పరిష్కర్త మొదలైన వారి పేర అవసరాన్ని బట్టి చేస్తారు. వీటికి తోడుగా గ్రంథకర్త, గ్రంథనామం, విషయం మున్నగు అంశాల మీద విశ్లేషనాత్మక పద్దులు (ఎనలిటికల్ ఎన్ట్రీస్) మరికొన్ని ఆచూకీ పద్దులు (రెఫరెన్సు ఎంట్రీస్) వీలునుబట్టి ఎంట్రీస్ చేస్తారు.

అయితే ఈ పద్దులన్నిటికీ మాతృ స్థానం అలంకరించిన ప్రధాన పద్దు స్వరూపం, దానిని సిద్ధంచేయడంలో తీసుకోవలసిన మెలకువలనుగురించి ముందుగా తెలుసుకోవాలి.

## ప్రధాన పద్దు

నిఘంటు సూచీ నిర్మాణంలో ప్రధాన పద్దు (మెయిన్ ఎన్ట్రీ) పాత్ర అత్యంత కీలక మైనది. దీని నిర్మాణాత్మక పటిష్టతపైనే మిగతా పద్దుల తయారీ ఆధారపడిఉంది. కనుక ప్రధాన పద్దును రూపొందించే విషయంలో ఓర్పు, బుద్ధి కుశలత చూపవలసి ఉంది. ఆంగ్లో అమెరికన్ సూచీ నియమాలను అనుసరించి, నిఘంటు సూచీ ప్రక్రియలో ప్రధాన పద్దులో ఈ దిగువ విభాగాలుంటాయి. నమూనా ప్రధాన పద్దు దిగువ చూపబడింది. దీనిలోని విభాగాలు ఈ తీరుగా ఉంటాయి.

---

పరిచయ సంకేతం — శీర్షిక రచయిత నామం (జనన-మరణ తేదీలు)
గ్రంథనామం = సమాంతర నామం : గ్రంథోప
నామం / రచనకు బాధ్యులు; ఇతరులు. —
ముద్రణ వివరం. — ప్రచురణ స్థలం:
ప్రచురణ సంస్థ, ప్రచురణ తేదీ.

ప్రవేశసంఖ్య — పుటలు: చిత్రాలు; కొలతలు. — (గ్రంథమాల/
మాలకు బాధ్యులు; సంఖ్య)
ఇతర వివరాలు
అంతర్జా  తీయ పుస్తక ప్రమాణ సంఖ్య
ఇతర పద్దుల వివరాలు

---

పత్రిప్రధాన పద్ధులో విధిగా అన్ని వివరాలు ఉండాలని నియమం లేదు. కాని చాలావరకు వివరాలుంటాయి. కనుక ఈ వివరాలలో ఒక్కొక్క దానిని గురించి మరికొన్ని విశేషాలు తెలుసుకుందాం.

## పరిచయ సంకేతం

గ్రంథాలయంలోని ఏ పుస్తకం ఎక్కడఉందీ తెలుసుకోడానికి వీలైనసంకేతాన్ని పరిచయ సంకేతం(కాల్ నంబర్) అంటారు. దీనిలో వర్గ సంఖ్య (క్లాసిఫికేషన్ నంబరు) గ్రంథకర్త గుర్తు (ఆథర్ మార్క్) ఉంటాయి. తొలి హద్దుకు ఎడమ వైపున పై భాగంలో వర్గ సంఖ్య క్రింది భాగంలో గ్రంథకర్త గుర్తు ఉండాలి. దీనివలన పుస్తకం స్థానాన్ని గుర్తించవచ్చు.

ఇటీవల తెలుగులో వ్యాప్తిలోకి వచ్చిన గ్రంథకర్త గుర్తులలో సాధారణంగా గ్రంథకర్త ఇంటిపేరు, అసలుపేరు పుస్తకం పేరులోని మొదటి అక్షరాలతో ఏర్పడుతుంది. కనుక చాల సందర్భాలలో గ్రంథకర్త పేరును, పుస్తకం పేరును సూచన ప్రాయంగా గుర్తించ వచ్చు. వర్గీకరణ విధానంలో ఎప్పటికప్పుడు నవీన సంస్కరణలను అనుసరించాలి గనుక అపుడపుడు వర్గ సంకేతంలో మార్పులు వచ్చే అవకాశముంది.

హిందీ, సంస్కృతం ఇతర భారతీయ భాషా గ్రంథాలకు ఇదే పద్ధతి అనుసరింపవచ్చు. ఆంగ్ల భాష గ్రంథాలకు రచయిత పేరులోని తొలి మూడక్షరాలను చిన్నస్థాయి గ్రంథాలయాలలో ఉపయోగించవచ్చు. పెద్ద గ్రంథాలయాలలో కేవలం గ్రంథకర్త గుర్తుల కోసం నిర్దేశించిన కటరు గుర్తులను వాడే అలవాటు బాగా ఉంది.

## శీర్షిక

సూచీకరణలో శీర్షిక (హెడ్డింగ్) గ్రంథకర్త పేర పరివర్తిత రూపంలో చేయాలి. ప్రభుత్వాలు, స్థానిక సంస్థలు, సంఘాలు, సభలు, పవిత్ర గ్రంథాలు, నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వాలు, వార్షిక గ్రంథాలు మొదలైనవాటికి–కొన్ని అవసరాలను బట్టి గ్రంథనామం పేరనే శీర్షిక చేయాలి. నిర్ణయించేటపుడు ఈ దిగువ సూచనలను గనునికలో ఉంచుకోవాలి. (2.1, 2.14డి)

1 గ్రంథకర్త సజీవంగా ఉంటే జనన తేదీ, మరణిస్తే జనన, మరణాల తేదీలు ఇవ్వవలసి ఉంటుంది

ఉదా : చలం, గుడిపాటి వెంకట (1894 –1983)
గోపీచంద్, త్రిపురనేని (1910 – 1962)

2 మారు పేర్లు, కలం పేర్లతో రాసే వారికీ ఇలాగే ఇవ్వవలసి ఉంటుంది

ఉదా : పాపయ్యశాస్త్రి, జంధ్యాల (1912—)
హేమలత, తెన్నేటి (1928—)

3 పేర్లు సాధ్యమైనంతవరకు పూర్తిగా రాయాలి. ఇంటిపేరులోగాని, అసలు పేరులోగాని కొంత భాగం తెలియకపోతే. తర్వాత తెలుసుకొని రాసేందుకు వీలుగా కొంత జాగా ఉంచాలి

ఉదా : సీతాపతి, గిడుగు వెంకట
ఆంజనేయ ప్రసాద్, ఎస్ ఆర్

4 ఎక్కువ పదాలున్న పేర్లలో ప్రచారంలో ఉన్న పేరు / తూకం ఎక్కువగా ఉన్న పేరు శీర్షిక తొలి పదం / పదాలుగా తీసుకోవాలి.

ఉదా : నరసింహరాజు, గజపతిరాజు వెంకటసూర్యలక్ష్మి నరసింహరాజు
జ్ఞానానందకవి, సురగాలి తిమోతి

5 ఇద్దరు రచయితలకు ఒకే పేరుంటే వారి తేదీలను భేదం గుర్తించే అంశాలను నమోదు చేయడం ద్వారా ఆ తేడా గుర్తించ వచ్చు.

వెంకట రామమూర్తి, గిడుగు (1863 – 1940)
వెంకట రామమూర్తి, గిడుగు (1925 — )

6 వెంకట రాయశాస్త్రి, వేదం (1853 – 1929)
వెంకట రాయశాస్త్రి, వేదం (1932 — )

ముఖ్య గమనిక : ఈ గ్రంథంతో భారతీయ నామాలకు శీర్షిక ఎంపిక చేయడం 10 వ, అధ్యాయంలో చర్చించడమైనది. ఒకసారి చూడండి.

7 ఆంగ్ల నామాలలో సాధారణంగా మూడు భాగాలుంటాయి
1 ముందు నామం ఉదా : జాన్
2 మధ్య నామం : మైకేల్
3 సర్‌నేమ్ (కుటుంబనామం) : స్మిత్
సూచీకరణలో ఈ పేరుకు శీర్షికగా స్మిత్, జాన్ మైకేల్ అని రాయాలి.

8 ఒక గ్రంథకర్త పేరులో
1 ముందు నామం — ఆలివర్
2 సర్‌నేమ్ (కుటుంబనామం) – గోల్డ్‌స్మిత్ అని ఉన్నపుడు శీర్షిక – గోల్డ్‌స్మిత్, ఆలివర్ అని రాయాలి.

9 ప్రభుత్వాధినేతల అధికార రచనలకు వారి పాలనా కాలం శీర్షికలో నమోదు చేయాలి.

2 గ్రంథ నామం

పుస్తకం పేరుకు (టైటిల్) సంబంధించిన వివరాలన్నీ ఈ విభాగంలో ఉంటాయి. దీనిని రెండో హద్దునుంచి ప్రారంభించాలి. (1.1)

అప్పుడు ఈ దిగువ సూచనలను గమనించాలి.

1 పుస్తకానికి ఉపనామం (సబ్ టైటిల్) ఉంటే దానిని తప్పక చేర్చాలి. ఇది గ్రంథ స్వభావాన్ని మరింత ఇనుమడింప జేస్తుంది.

ఉదా : 1 పోస్టు చెయ్యని ఉత్తరాలు – ఆధ్యాత్మిక భౌతిక వాద సమన్వయం.
2 సరస్వతీ సామ్రాజ్యమ్, అయ్యంకి వెంకట రమణయ్యగారి సన్మాన సంచిక.

2 ఒక పుస్తకానికి రెండు పేర్లున్నపుడు ప్రత్యామ్నాయి రెండు పేర్లను ఈ విభాగంలో విధిగాచేర్చాలి.

ఉదా : 1 వాసిష్ట రామాయణము, లేక, యోగ వాసిష్ఠము
2 కురల్, లేక, తిరువళ్ళూరు సూక్తులు

3 ఒక గ్రంథ నామం సుదీర్ఘమై ఒకటి రెండు పంక్తులున్నట్లయితే దానిని కుదించవలసి ఉంటుంది.

4 గ్రంథనామం పిదప గ్రంథాన్ని లేదా గ్రంథకర్తను గురించి వివరించే ఉపోద్ఘాతం, పీఠిక, పరిచయం మొదలైనవి ఉంటే వాటిని ఉదహరించడం అవసరం అయితే ప్రశంసలు, అభిప్రాయాలు ఉదహరించరాదు.
ఉదా : హరిశ్చంద్రోపాఖ్యానము / రచన — గౌరన ; పీఠిక = పి. యశోదా రెడ్డి

5 ఒక పుస్తకం రెండు లేదా అంత కంటే ఎక్కువ ముద్రణలను పొందితే ఆ సంఖ్యను గ్రంథ నామం పిదప చేర్చాలి (1.2 & 2.2)
ఉదా : వేయి పడగలు .— 12వ — ముద్రణ
ఉదయశ్రీ .— 15వ — ముద్రణ

6 గ్రంథ నామాన్ని రెండవ పంక్తి రెండవ హద్దునుంచి ప్రారంభించాలి. రెండవ పంక్తిలో పూర్తి కానప్పుడు, 3వ పంక్తి మూడవ హద్దు నుంచి కొనసాగించాలి.

7 పుస్తక రచనా బాధ్యత (స్టేట్‌మెంట్ ఆఫ్ రెస్పాన్సిబిలిటీ) పుస్తక శీర్షిక రాశాక '/' వాలుగీత గీసి రచయిత పేరు / పేర్లు రాయాల్సి ఉంటుంది.
ఉదా : విజయ విలాసము / చేమకూర వేంకటకవి

3 ప్రచురణాది వివరాలు

గ్రంథ ప్రచురణ వివరాలను ఈ విభాగం తెలియ జేస్తుంది. కొన్ని సందర్భాలలో ప్రచురణ కర్త స్థానాన్ని బట్టి గ్రంథ స్థాయిని గుర్తించే అవకాశముంది. అందుచేత, దీని విలువ తక్కువది కాదు. ఈ విభాగ వివరాలు సేకరించేప్పుడు ఈ క్రింది విషయాలు గమనించాలి. ఇందు ప్రధానంగా గ్రంథ ప్రచురణ స్థలం ప్రచురణ కర్త ప్రచురణ తేదీ ఉంటాయి (1.4)

1 ఒక గ్రంథాన్ని రెండు చోట్ల నుంచి ప్రచురిస్తే రెంటిని గమనికలోకి తీసుకోవాలి.

ఉదా: యం. శేషాచలం అండ్ కో మచిలీపట్నం, మద్రాసు

2 ఒక గ్రంథాన్ని ఇద్దరు ముగ్గురు ప్రచురణ కర్తలు కలసి ప్రచురిస్తే మొదటి ప్రచురణ కర్తను మాత్రం తీసుకోవాలి. (1.4 సి 5)
ఉదా: గాంధీజీ ఆత్మకథ

ప్రచురణ : త్రివేణి పబ్లిషర్స్, మచిలీపట్నం
ఆంధ్ర ప్రదేశ్ గాంధీ సాహిత్య ప్రచురణాలయం ,హైదరాబాదు

3 ప్రచురణ సంస్థలుచాల ప్రసిద్ధమైనవైతే వాటి ప్రచార నామాన్ని మాత్రం తీసుకుంటే స్థలం కలసివస్తుంది.

ఉదా : వావిళ్ళ రామస్వామి శాస్త్రులు, అండ్ సన్స్‌కు బదులు 'వావిళ్ళ', విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌కు బదులు 'విశాలాంధ్ర'
గమనిక : ఇటువంటి సంగ్రహణల పట్టికను సూచీకర్త ఎప్పుడు దగ్గర ఉంచుకోవాలి.

4 సాధ్యమైనంత వరకు నూతన ప్రచురణ తేదీని ఇవ్వాలి.
ఉదా : జనవరి 1974
అక్టోబరు 1975

5 ప్రచురణ తేదీ లేకపోతే తేదీ లేదు అని రాస్తే మంచిది. లేదా ఆ పుస్తకం తాలూకు పీఠికలో, ఉపోద్ఘాతంలోని తేదీని బ్రాకెట్లలో వేస్తే కొంత వరకైనా ప్రచురణ తేదీ ఊహించ డానికి సాధ్య పడుతుంది (1.4 సి 6)

6 గ్రంథనామం లేదా ఉపనామం పిదప ఒక చుక్క పెట్టి జాగావదలి అడ్డగీత గీసి మళ్లీ జాగావదలి (. — ) ప్రచురణాది వివరాలను ప్రారంభించాలి.

పుటాది వివరాలు

పుస్తకానికి సంబంధించిన పుటలు, పటాలు, చిత్రాలు సైజు మొదలైన వివరాలన్నీ ఈ విభాగంలో ఉంటాయి. గ్రంథ స్వరూపాన్ని తెలుసు కోడానికి ఇవి చాల వరకు

ఉపయోగిస్తాయి. ఈ వివరాలను నమోదు చేయడంలో ఈ దిగువ విషయాలు గమనికలో ఉంచుకోవాలి (1.5 & 2.5)

1 పుటలను యథాతథంగా వేయాలి. అంటే అరబిక్, రోమన్, తెలుగు అంకెలను ఉన్నవి ఉన్నట్లు వేయాలి. పుట సంఖ్యలు లేని పుటలు చెప్పుకోతగినన్ని వున్నప్పుడే వానిని లెక్కించి బ్రాకెట్లలో చూపించాలి.

ఉదా : 4, 144 పు

X, VII, 376 పు

౧౨, ౪౫౭ పు

[14], 130 పు

2 సాధ్యమైనంత వరకు ప్రత్యేక స్థాయిలో ముద్రించిన చిత్రాలు తీసుకోవాలి సాధారణ రేఖా చిత్రాలు, పటాలు గమనికలోనికి తీసుకోరాదు. (2.5డి)

ఉదా :— ఆరుద్ర వ్యాఖ్యతో గల కందుకూరి రుద్రకవి జనార్దనాష్టకం

4 సైజుఎత్తుమాత్రం సెంటీమీటర్లలో (భిన్నాలను తరువాతిపై పూర్ణాంకాలుగా మార్చి) వేయాలి. ఎత్తును బట్టి అడ్డుకొలతను చాలా మట్టుకు ఊహించు కోవచ్చును.

ఉదా :— 19 సెం మీ

22.5 సెం మీ ను 23 సెం మీ గా నమోదు చేయాలి

గమనిక : పుస్తకాన్ని బైండు చేసినప్పుడు చూరుతోకూడ కొలతలు తీసుకోవాలి. ప్రతి పుస్తకాన్ని స్కేలుబెట్టి కొలవాలే తప్ప సుమారుగా నిర్ణయం చేయుట మంచిదికాదు.

ప్రచురణాది వివరాలు పూర్తికాగానే ఈ విభాగాన్ని తరువాత పేరాలో రెండవ హద్దునుంచి ప్రారంభించాలి.

5 గ్రంథమాల వివరాలు

పుటాది వివరణ విభాగం నమోదు పూర్తయ్యాక ఏదైన గ్రంథమాల తరపున పుస్తకం ప్రచురింపబడి ఉన్నట్లయితే ఆగ్రంథమాల (సీరీస్)ను చేర్చాలి. (2 . 6 )

ఉదా :– 14, 174 పు, 19 సెం మీ . — (ఆంధ్ర గ్రంథమాల; 36)
3, × 374 [4]పు: 3చిత్ర ; 22 సెం మీ;

గ్రంథమాల వివరాలను బ్రాకెట్లలో ఉంచాలి. గ్రంథమాలకు సంఖ్య ఉంటే తప్పని సరిగా వేయాలి. ఇదే గ్రంథమాలకు సంబంధించి ఈ గ్రంథాలయంలోగల ఇతర గ్రంథాలకు ఉపపద్దు చేయాలి. గ్రంథమాలకు సంపాదకుడు ఉంటే ఆ వివరం కూడ తెలపాలి.

6 నోట్సు విభాగం

పై విభాగాలలో ఇచ్చిన వివరాలు గ్రంథాన్ని గురించి తెలుసుకోడానికి చాలకపోవచ్చును. దానికి అనుబంధంగా గ్రంథకర్తను గురించీ, గ్రంథాన్ని గురించీ అవసరమైన మరి కొన్ని వివరాలు ఇక్కడ ఇవ్వాలి. (2.7 & 1.7)

1 అనువాద రచన అయితే మూల గ్రంథం పేరు ఇవ్వాలి.

ఉదా : గాంధీ ఆత్మకథ

మూలం ''మై ఎక్స్పెరిమెంట్స్ విత్ ట్రూత్''

2 గ్రంథసూచీ (బిబ్లియోగ్రఫీ), పరిభాష (గ్లాసరీ) ఉంటే వాటి విషయం తెలుపాలి.

3 పుస్తకం ఇంతకు పూర్వం మరొక పేరుతో ప్రచురిస్తే ఆ వివరం తెలపాలి.

ఉదా : 1. కొమర్రాజు వేణుగోపాల రావు గారి శారద నవల తొలి ముద్రణ చిన్నక్క పేరుతో ప్రచురింపబడినది.

2. బీనాదేవిగారి ''పుణ్యభూమి కళ్ళుతెరు'' ఆంధ్ర జ్యోతి వారపత్రికలో ''హాంగ్ మి క్విక్'' గా ప్రచురింపబడింది.

4 ఒక గ్రంథంలో ఇతర గ్రంథకర్తల రచనలు కలిపి ముద్రించినపుడు లేదా కలిపి కుట్టినపుడు వివరం చెప్పాలి.

5 ఒక గ్రంథకర్త ఇతర రచనలు సంపుటాలుగా ముద్రించి నపుడు లేదా కుట్టి నపుడు ఆ వివరం ఇచట చెప్పాలి.

6 ప్రసిద్ధమైన పలువిషయాలు ఒక గ్రంథంలో ఉన్నపుడు ఆ వివరంకూడా సూచన ప్రాయంగా చెప్పాలి.

7 పుటాది వివరణ పూర్తయ్యాక ఈ వివరాలను తరువాతి పేరా రెండోహద్దు నుంచి ప్రారంభించాలి.

గమనిక:

గ్రంథకర్త, గ్రంథనామం, విషయం మొదలైన వాటికి విశ్లేషణాత్మక పద్దులు (ఎనలిటికల్ ఎన్ట్రీస్) చేసినపుడు పై విషయాలు ఈ విభాగంలో ఇవ్వవలసిన అవసరం ఉండదు.

7 ప్రమాణ సంఖ్య.

దీన్నే అంతర్జాతీయ ప్రమాణ పుస్తక సంఖ్య (ఇంటర్నేషనల్ స్టాండర్డు బుక్ నంబర్– I S B N ) అంటారు. పుస్తక ప్రపంచంలో ముఖ్యంగా అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాలలో ప్రచురించిన పుస్తకాలకు పదంకెలు గల సంఖ్య వేస్తారు.(2.8)

1 I S B N 0–566–03460 – 3 HERROD'S LIBRARIANS Glossary and Referencc Book, 1985.

2 I S B N 0–333 – 37261 – 1 Macmillam Dictionary of Information Technology 1985

ఈ సంఖ్యలను International Organisation for Standardisation అనే సంస్థ 1969 లో చేసిన సిఫారసు మేరకు అనేక దేశాలు అనుసరిస్తున్నాయి.

ఈ సంఖ్యలో పదంకెలుంటాయి. ఇందు మొదటి భాగం దేశం, రెండవ భాగంలో ప్రచురణ కర్త, మూడో భాగంలో గ్రంథనామానికి గుర్తు, నాలుగో భాగంలో అదుపుకు గుర్తు ఉంటాయి. విదేశీ ప్రచురణలను గ్రంథాలయానికి సేకరిస్తే ఈ గుర్తులు ముఖపత్రం వెనుకవైపు ఉంటే వాటిని సూచీలో గుర్తించాలి. భారత దేశంలో అచ్చయ్యే గ్రంథాలకు ఈ సంఖ్యల వాడకం ఇంకా ప్రారంభం కాలేదు. కనుక తెలుగు పుస్తకాల సూచీకరణలో ఈ సంఖ్యల వాడుక ప్రసక్తిరాదు.

## ప్రవేశ సంఖ్యా విభాగం

వ్యవహార రీత్యా ప్రవేశ సంఖ్య (యాక్సెషన్ నంబర్) కు ఎంతో ప్రాముఖ్యం ఉంది.
1 ఒక పుస్తకాన్ని ఒకసారి సూచీకరణ చేసినపుడు, మరల ఏ మాత్రం మార్పు లేని అదే ప్రచురణ కర్త తాలూకు నూతన ప్రతి వస్తే పాతప్రతి ప్రవేశ సంఖ్య క్రింద, నూతన ప్రతి ప్రవేశసంఖ్య చేర్చితే సరిపోతుంది.

ఉదా:— 1476 బాలవ్యాకరణం
1596 ”
4761 ”

అంటే బాలవ్యాకరణం ఈ గ్రంథాలయంలో మూడు ప్రతులున్నవని భావించాలి. ఇదే తీరుగా మిగతా కార్డులలో కూడ గుర్తించాలి.

2 ప్రవేశ సంఖ్యను గ్రంథకర్త, గ్రంధ నామం పద్దులలో ఎడమవైపు క్రింది భాగంలో వేయాలి. విషయ పద్దులలో కుడివైపు క్రింది భాగంలో వేయాలి. ఆచూకీ పద్దులలో ప్రవేశ సంఖ్య వేయరాదు.

## ఉపపద్దులు

ప్రధానపద్దు, ఉపపద్దుల సమ్మేళనం సక్రమంగా ఉన్నపుడే సూచీ పటిష్టంగా ఉంటుంది. ప్రయోజనకరంగా ఉంటుంది. గ్రంథంలోని విషయం పూర్తిగా ప్రతిబింబించే వరకు — చదువరి ఏ కోణం నుంచి చూచినా కావలసిన విషయం కనుమరుగై పోకుండా ఉండే విధంగా అవసరమైనన్ని ఉపపద్దులను చేయాలి. అయితే ఉపపద్దుల సంఖ్య విపరీతంగా పెంచుకుంటూ పోతే సూచీ స్థూలమయ్యే ప్రమాదం ఉంది. అందుచేత పొదుపుగా, ప్రయోజనకరంగా ప్రతిసారి ఆలోచించి, వీటిని చేస్తూ ఉండాలి.

'చిన్నస్థాయి' గ్రంథాలయాలకు పదహారు సొరుగులు గల ఒక పేటిక ఉంటే దానిలో సుమారు ఏడువేలు చిల్లర గ్రంథాలకు సరిపోను కార్డులను పేర్చవచ్చును. అప్పుడు నవలలు, నాటకాలు మొదలైన సృజనాత్మక సాహిత్యానికి ఒక్కొక్క పుస్తకానికి రెండు కార్డులు సరిపోతాయి. ఇందు గ్రంథకర్త, గ్రంథనామం, విషయానికి సంబంధించిన

కార్డులు అన్నీ అకారాది క్రమంలో పెట్టవచ్చు. పెద్ద గ్రంథాలయాలలో గ్రంథకర్త, గ్రంథనామం, విషయం తాలూకు కార్డులను మూడు వేరువేరు పేటికలలో పెడతారు. అప్పుడు ప్రతి పుస్తకానికి కనీసం మూడు, నాలుగు కార్డులు అవసరమౌతాయి కనుక మన గ్రంథాలయ స్థాయిని బట్టి ఉపపద్యాలను తయారు చేసుకోవాలి. మొత్తంమీద సాధారణ సూచీకరణలో ఈ దిగువ అంశాలపై ఉపపద్యాలు అవసరమౌతాయి.

1 సహ గ్రంథకర్త
2 సంపాదకుడు
3 సంకలనకర్త
4 సంగ్రహ కర్త
5 వ్యాఖ్యాత
6 టీకా కర్త
7 పరిష్కర్త
8 చిత్రకారుడు
9 అనువాదకుడు
10 గ్రంథ నామం
11 విషయం
12 సూచికలు
13 గ్రంథమాల
14 గ్రంథకర్త, గ్రంథనామ, విషయ విశ్లేషణాత్మకాలు

ఉపపద్యాలు తయారుచేసేప్పుడు ఈ దిగువ నియమాలు దృష్టిలో ఉంచుకోవాలి.

1 ఉపపద్యాల శీర్షికను రెండో హద్దు నుంచే ప్రారంభించాలి.

2 ఇంతకు ముందే వివరించినపుడు ఎ.ఎ సి.ఆర్–2లో ప్రధానమైన మార్పు ఏమంటే — ప్రధానపద్యానికు ఉప పద్యాలకు పెద్దతేడా లేదు. అన్నిపద్యాలు సమానమైన ప్రాతినిధ్యం కలవే. ఉపపద్య శీర్షిక ఎంచుకొన్న పిదప ప్రధానపద్యం యధాతథంగా చేర్చితేచాలు. ఉపపద్య అవుతుంది. అంతే.

3 అయితే మార్గసూచిక పద్యాలు, విశ్లేషణాత్మక పద్యాలు, గ్రంథమాల పద్యాలు నియమాలను అనుసరించి వేరుగా చేయవలసిందే.

## వివరాలలో ప్రమాణాలు

గ్రంథాలయ సూచీకార్డులోని వివరాలకు ప్రమాణాలు (స్టాండర్డ్సు) కొన్ని స్థిరీకరించడం అవసరం. ఈ విషయంలో అంతర్జాతీయ గ్రంథాలయ సంఘాల సమాఖ్య (ఇంటర్నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ లైబ్రరీ అసోసియేషన్సు అండ్ ఇన్‌స్టిట్యూషన్స్

— IFLA) ముందుకు వచ్చి ప్రధాన పద్దులో ఉండాల్సిన వివరాల గురించి కొన్ని ప్రమాణాలు సిద్ధంచేసి 1974లో ప్రచురించింది. దీన్ని అంతర్జాతీయ గ్రంథ సూచీ ప్రమాణవర్ణన (ఇంటర్నేషనల్ స్టాండర్డ్ బిబ్లియో గ్రాఫిక్ డిస్క్రిప్షన్—ISBD) అంటారు. ప్రధానంగా ఇది చిన్నపుస్తకాలకు (మానగ్రాఫ్స్)కు మాత్రం ఉద్దేశించారు. ఎ.ఎ.సి.ఆర్ పరిష్కరణ కమిటీ ప్రతినిధులు కలసి చర్చించి మరికొన్ని చేర్పులు, మార్పులు చేసి ప్రమాణాలను సాధారణ గ్రంథాలకు, అన్ని తరగతుల పఠన సామాగ్రికి అన్వయించేటట్లు చేశారు. ఈ ప్రమాణాలలో చేసిన సూచీ ప్రధాన పద్దులో, ఈ దిగువ వివరాలుంటాయి. ఉపపద్దులలోనూ ఇవే వివరాలుండటం ఒక విశేషం.

1 గ్రంథనామం, ఉపనామం, సమాననామం, గ్రంథకర్త—విభాగం
2 ముద్రణ, పరిష్కరణ, సంపాదకులు మొ. వివరాల విభాగం
3 వస్తువు, ప్రచురణ స్వభావం
4 ప్రచురణాది వివరాలు, గ్రంథం ప్రచురించినస్థలం, ప్రచురణకర్త, ప్రచురణ సం.—విభాగం
5 పుటలు, చిత్రాలు, సైజు ఇత్యాది వివరాలవిభాగం
6 గ్రంథమాల విభాగం
7 నోట్సు విభాగం
8 అంతర్జాతీయ ప్రమాణాల పుస్తక సంఖ్య

ఈ ప్రమాణాలలో విరామ చిహ్నాలు ఒక ప్రత్యేకత. ఈ కార్డులో ప్రతి విభాగం (మొదటిది తప్ప) ఒక బిందువు అడ్డగీతతో (.—) ప్రారంభమౌతుంది.

| వ. సం. | విభాగం | ముందుండే విరామచిహ్నం | వివరం |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| 1 | గ్రంథనామ విభాగం | | 1 గ్రంథనామం |
| | | = | 2 సమాంతర గ్రంథనామం |
| | | : | 3 ఇతర సమాచారం |
| | | / | 4 గ్రంథకర్త |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 2 | ముద్రణ వివరాల విభాగం | = | 1 ముద్రణ సంఖ్య<br>2 సమాంతర ముద్రణ |
| 3 | వస్తువు/ప్రచురణ స్వభావ విభాగం | | |
| 4 | ప్రచురణాది విభాగం | | 1 ప్రచురణ స్థలం |
| | | ; | 2 రెండోస్థలం (ఉంటే) |
| | | : | 3 ప్రచురణకర్త |
| | | [ ] | 4 పంపిణీదారు |
| | | , | 5 ప్రచురణ తేదీ |
| 5 | పుటాది వివరాల విభాగం | | 1 పుటలు |
| | | ; | 2 ఎత్తు |
| | | + | 3 అనుబంధ సమాచారం |
| 6 | గ్రంథమాల విభాగం | | 1 గ్రంథమాల పేరు |
| | | = | 2 సమాంతర గ్రంథమాల పేరు |
| | | | 3 ఇతర సమాచారం |
| | | | 4 గ్రంథమాల సంపాదకుడు |
| | | | 5 ప్రమాణ సంఖ్య |
| 7 | నోట్సుల విభాగం | | |
| 8 | ప్రమాణసంఖ్యా విభాగం | | 1 అంతర్జాతీయ ప్రమాణాల గ్రంథసంఖ్య |

భారత దేశంలో అచ్చయిన పుస్తకాలకు ఇంకా ప్రమాణసంఖ్యలువేసే అలవాటు రాలేదు. అందుచేత మనదేశంలో అచ్చయిన గ్రంథాలకు ఎనిమిదోవిభాగ ప్రసక్తిలేదు. విరామచిహ్నాల గురించి పూర్తి వివరణ గ్రంథాలయ సూచీకరణ ప్రయోగ దీపికలో లభిస్తుంది.

— 0 —

# 10 భారతీయ నామాలు

## భారతీయ నామాలు

సంపన్నమైన భారత దేశం వివిధ సంస్కృతుల సమ్మేళనం. వివిధ మతాల కూడలి. వివిధ సంప్రదాయాల నిలయం. వీటన్నిటినీ సమన్వయం చేసుకొని, భిన్నత్వంలో ఏకత్వసాధనే అనాదినుంచి మన ప్రధానలక్ష్యం. దీని సాధనలో, ఆచార వ్యవహారాలలో వచ్చిన మార్పులను బట్టి వంశనామాలు వ్యక్తిగత నామాలు ఏర్పడ్డాయి. వీటిలో ముఖ్యంగా హిందువుల, మహమ్మదీయుల, క్రైస్తవుల పేర్ల నిర్మాణం, నాగరికతా ప్రభావం వలన వాటిలో వచ్చిన మార్పులు గమనింప దగినవి. గ్రంథాలయ సూచీ కరణలో ఈ మార్పులను దృష్టిలో ఉంచుకుని శీర్షికను నిర్ణయింపవలసి ఉంది.

## జరిగిన కృషి

గ్రంథాలయ శాస్త్రంలో అపారమైన కృషి చేసిన డాక్టర్ రంగనాథన్ వంటి పలువురు పెద్దలు భారతీయ నామాల నిర్మాణంపై కృషి చేశారు. వీటి విషయంలో 1961లో భారత దేశంలో జరిగిన ప్రత్యేక గ్రంథాలయాల, సమాచార కేంద్రాల సదస్సు లోనూ, పారిస్‌లో జరిగిన అంతర్జాతీయ సూచీకరణ సదస్సులోనూ కొన్ని నిర్ణ యాలు చేశారు. ఆ తరువాత 1967లో వెలువడిన ఆంగ్లో–అమెరికన్ గ్రంథా లయ సూచీకరణ నియమావళిలో భారతీయ నామాల విషయం కొంత చర్చ జరిగింది. ఈ గత అనుభవాలను, సూచనలను దృష్టిలో ఉంచుకుని కొన్ని విషయాలు తెలిసికో వలసి ఉంది.

## తెలుగు పేర్లు

ఆరు కోట్లపై చిలుకుగల తెలుగు వారి పేర్లలో ఇంటిపేర్లు లేదా వంశనామం; వ్యక్తిపేరు, దానికి అనుబంధంగా కులం పేరు లేదా గౌరవ వాచకాలు ఉంటాయి.

| వసం | ఇంటిపేరు లేదా వంశనామం | వ్యక్తి పేరు | కులం పేరు లేదా గౌరవ వాచకం |
|---|---|---|---|
| 1 | కట్టమంచి | రామలింగా | రెడ్డి |
| 2 | శరణు | రామస్వామి | చౌదరి |
| 3 | దేవులపల్లి | వెంకటకృష్ణ | శాస్త్రి |
| 4 | కొడవటిగంటి | కుటుంబ | రావు |
| 5 | ఆచంట | శారదా | దేవి |
| 6 | గుంటుపల్లి | రాధాకృష్ణ | మూర్తి |
| 7 | అన్నె | కేశవార్యశాస్త్రి | — |
| 8 | — | షేక్ జాన్సన్ శాస్త్రి | — |
| 9 | ముగ్గురాల | రాఘవచంద్ర శాస్త్రి | — |
| 10 | రావిపాటి | రాజేంద్రప్రసాద్ | — |
| 11 | — | ఉదయశంకర్ | — |
| 12 | — | అరవింద | — |

పై పేర్లను బట్టి మొదటి మూడు పేర్లలో తుదిపదం కులాన్ని తరువాతి మూడు పేర్లలో తుది పదం గౌరవ వాచకాన్ని తెలుపుతుంది. పింగళి లక్ష్మీకాంతం, ముద్దా విశ్వనాథం మొదలైన పేర్లలో కులం పేరుగాని. గౌరవ వాచకాలుకాని లేవు. అయితే అన్నె కేశవార్యశాస్త్రి పేరులోని 'శాస్త్రి' పదాన్ని కులం పేరుగా స్వీకరించరాదు. వర్ణవ్యవస్థ పై తిరుగుబాటుగా పెట్టుకున్న కల్పిత నామం మాత్రమే. కనుక కేశవార్యశాస్త్రి, షేక్ జాన్సన్ శాస్త్రి మొదలైన పేర్లను పూర్తిగా వ్యక్తిగత నామాల క్రిందే స్వీకరించాలి, దేశంలో వచ్చిన రాజకీయ, సాంఘిక ఉద్యమాల ప్రభావంచేత బాలగంగాధర తిలక్, రాజేంద్రప్రసాద్, జవహరలాల్ నెహ్రూ, సురేంద్రనాథ్ బెనర్జీ వంటి పేర్లు అన్ని ప్రాంతాల ప్రజలు వాడుతున్నారు. ఆ పరిస్థితిలో ఒక ప్రభావంచేత వచ్చిన పేర్లను పూర్తిగా వ్యక్తిగత నామంగానే గుర్తించవలసి ఉంటుంది.

## ఇతర దక్షిణ దేశపు పేర్లు

తమిళం, మలయాళం, కన్నడం మాట్లాడే ప్రజలు దక్షిణ దేశంలో అధికంగా ఉన్నారు. తమిళుల పేర్లలో చాలవరకు వారి ప్రాచీనులు నివసించిన గ్రామం పేరు, వారి తండ్రిపేరు, వ్యక్తిపేరు, దానికి అనుబంధంగా ఒక్కొక్కప్పుడు కులంపేరు ఉంటాయి.

| | | | |
|---|---|---|---|
| 1 | శ్రీయాళి | రామామృత | రంగనాథన్ |
| 2 | — | చంద్రశేఖర | వెంకటరామన్ |
| 3 | మాస్తి | వెంకటేశ | అయ్యంగార్ |

చివరి పేరులో వెంకటేశ అను పదం వ్యక్తి నామాన్ని అయ్యంగార్ అనుపదం కులాన్ని తెలుపుతుంది. ఇతర ప్రాంతాల ప్రభావం మీద వచ్చిన పేర్లు కూడ తమిళ దేశంలో, ఇతర దక్షిణ ప్రాంతంలో లేక పోలేదు. కన్నడ పేర్లుగూడ దాదాపు పై విధానాన్ని పోలి ఉంటాయి. మలయాళ దేశపు పేర్లలో ఇంటిపేరు తండ్రిపేరు వ్యక్తిపేరు, కులంపేరు చాల సందర్భాలలో వరుసగా ఉంటాయి.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | ఎలంకుళత్తు | మున్నక్కల్ | శంకరన్ | నంబూద్రిపాద్ |
| 2 | వెంగలిల్ | కృష్ణన్ | కృష్ణ | మీనన్ |
| 3 | తకళి | — | శివశంకర | పిళ్ళై |
| 4 | పిలవుళ్లకండి | తెక్క | పరంచిల్ | ఉష |

## ఉత్తర దేశపు పేర్లు

సువిశాలమైన ఉత్తర భారతంలో హిందీ, గుజరాతీ, మరాటీ, పంజాబీ, బెంగాలీ, ఒరియా మొదలైన భాషను మాట్లాడే ప్రజల పేర్ల స్వరూపం ఇలా ఉంటుంది.

| భాష | వ. సం. | వ్యక్తినామం | తండ్రి పేరు | వంశనామం |
|---|---|---|---|---|
| హిందీ | 1 | జయశంకర ప్రసాద్ | — | |
| | 2 | తులసీ | | దాస్ |
| గుజరాతీ | 3 | మోహన్ దాస్ | కరంచంద్ | గాంధీ |
| మరాఠీ | 4 | బాల | గంగాధర | తిలక్ |
| | 5 | గోపాల | కృష్ణ | గోఖలే |
| బెంగాలీ | 6 | రమేశ్ చంద్ర | — | దత్ |
| | 7 | సురేంద్రనాథ్ | — | దాస్ గుప్త |
| ఒరియా | 8 | కాళీందీ చరణ్ | — | పాణిగ్రహి |
| పంజాబీ | 9 | రంజిత్ | — | సింగ్ |
| | 10 | గ్యాన్ | — | సింగ్ |
| కాశ్మీర్ | 11 | జవహర్ లాల్ | — | నెహ్రూ |

ఉత్తర భారతీయ రచయితలలో రాజేంద్ర ప్రసాద్, జయశంకర ప్రసాద్, ఉదయశంకర్ మొదలైనవారు, వారి తండ్రి పేరును లేదా వంశనామాన్ని వదలివేసి వ్యక్తి నామానికే అధిక ప్రాధాన్యం ఇచ్చినపుడు ఆ పేరుకే శీర్షికను చేయడం సముచితం.

## స్వామీజీల పేర్లు

భారత దేశంలో దేశ వ్యాప్తంగావున్న స్వామీజీల పేర్లకు ఒక ప్రత్యేకత ఉంది. ఒక విధంగా చెప్పాలంటే వీటిని మారు పేర్లు, లేదా గుప్తనామాలు (సూడోనేమ్స్) అనవచ్చు. సన్యసించే ముందు వారి అభీష్టాను సారంగా పెట్టుకున్నవి.

పూర్వాశ్రమంలోని పేర్లు బయట పెట్టడం వారికి ఇష్టం ఉండదు. ఇవి రచన కోసం పెట్టుకున్నవి కాదు. కనుక అసలు పేరు జోలికి పోకూడదు. కనుక ఈ పేర్లలో వ్యక్తినామం, తండ్రి పేరు గౌరవ వాచకం అంటూ ఉండవు. పేరును పూర్తిగా వ్యక్తి నామం క్రింద గ్రహించవలసిందే. పూర్వాశ్రమంలో వారి పేరు మీద ఏవైనా తాత్విక, మతైక రచనలు సదరు గ్రంథాలయంలో ఉంటే ఆ పేరుకు మార్గ సూచికను చేయడం సమంజసంగా ఉంటుంది. రచయితలుగా ఉన్న కొందరు స్వామీజీల వారి పేర్లు యిలా ఉంటాయి.

1 అనుభవానందస్వామి
2 దయానంద సరస్వతి
3 తత్వానందస్వామి
4 మాతాజీ
5 లక్ష్మణయతీంద్రులు
6 శుద్ధ సత్వానందస్వామి
7 స్వామి చిద్ఘనానందగిరి

అయితే ఈ నాడు ప్రతికారంగంలో ఉన్న స్వామి వాస్తవికానంద, సహజానందస్వామి మొదలైనవారు సన్యసించిన స్వాములు కాదు. గుప్తనామాలతో రాస్తున్నవారు మాత్రమే.

శీర్షిక నిర్ణయం

భారతీయ నామాలకు శీర్షిక నిర్ణయించునపుడు వ్యక్తి పేరును లేదా హెచ్చు ప్రచారంలోగల పేరును (సాధారణంగా ఇంటి పేరును) శీర్షికలో తొలి పదంగా నిర్ణయించాలని, పేరులో మిగతా భాగాలకు మార్గ సూచికలు ఇవ్వాలనీ ఆంగ్లో అమెరికన్ నియమావళి నిర్దేశిస్తోంది.

ఉదా :

నారాయణరావు కాశోజీ
కృష్ణశాస్త్రి, దేవులపల్లి వెంకట
గాంధీ, మోహన్‌దాస్ కరంచంద్
తిలక్, బాలగంగాధర
రాజేంద్ర ప్రసాద్

సూచికలు

వెంకటకృష్ణ శాస్త్రి, దేవులపల్లి
కరంచంద్ గాంధీ, మోహన్‌దాస్
గంగాధర తిలక్, బాల
ప్రసాద్, రాజేంద్ర

దాదాపు ఇదే సరణిలో డాక్టరు రంగనాధన్‌గారు భారతీయ నామాలను గురించి తన అభి ప్రాయాన్ని వెలిబుచ్చారు. ఒక పేరులో బరువైన లేదా ప్రచారంలోగల భాగాన్ని తొలి పదంగా, నిర్ణయించి—మిగతా ప్రచారంలోగల పదాలకు మార్గ సూచికలను ఇవ్వవలసి ఉంటుందని వారు భావించారు. స్థూల దృష్టితో చూస్తే పై రెండు అభిప్రాయాలకు అట్టే తేడా లేదు. అయితే భారతీయ నామాలకు శీర్షిక నిర్ణయించే ముందు ఆ పేర్లు ఏర్పడిన స్వభావాన్ని సూచీ కర్తలు తెలుసు కోవాలనేదే ముఖ్య ఉద్దేశం.

— o —

# 11 మార్గసూచికలు

గ్రంథాలయ సూచీలో ఒక శీర్షికనుంచి మరొక శీర్షికకు దారి చూపేదాన్ని మార్గ సూచిక [రెఫరెన్స్] అంటారు. దీన్ని ఒక పదాన్నుంచీ మరొక పదానికి, ఒక పేరు నుంచి మరొక పేరుకు ఒక విషయం నుంచి మరొక విషయానికి చేస్తారు. ముఖ్యంగా తక్కువ ప్రచారంలో ఉన్న శీర్షిక నుండి ఎక్కువ ప్రచారంలోఉన్న శీర్షికకు ఈపద్దు చేస్తారు. వర్గీకృత సూచీలో గ్రంథాలయంలో అనుసరించిన వర్గీకరణ విధానాన్ని అనుసరించి పద్దులు చేస్తారు. విషయం అభివృద్ధి చెందిన క్రమంలోనే పద్దుల అమరిక ఉంటుంది గనుక మార్గ సూచికల అవసరం అంతగా ఉండదు. నిఘంటు సూచీలో పద్దులన్నీ అకారాది క్రమంలో అమరుస్తారు. కనుక విషయం అభివృద్ధి చెందిన క్రమానికి, అమరికకు పొంతన కుదురదు. ఈ లోపాన్ని మార్గ సూచికల ద్వారా సరిదిద్దుకోవచ్చు. నిఘంటు సూచీనిర్మాణానికి మార్గసూచికల తయారీ తప్పని సరిగా అవసరం

మార్గసూచికల పద్దులలో ఒక శీర్షిక మరొక శీర్షికకు మార్గాన్ని చూపుతుంది. చదువరి ఏ కోణాన్నుంచి చూచినా అతని కవసరమైన విషయం వైపుదారి చూపుతుంది. తెలియనిదానినుండి తెలిసినదానికి దారిచూపడమే,దీనిప్రవృత్తి. మార్గసూచికలను ప్రతి సారిచేయాల్సినపనిలేదు. ఒకసారిచేస్తేచాలు. శాశ్వతంగా అవే సరిపోతాయి. అయితేఇంతకు ముందుచేసిన మార్గసూచికల పట్టికను సూచీకారుడు చెంత ఉంచుకోవలసిఉంది. వీటిలో పరిచయ సంకేతంగాని, ప్రవేశ సంఖ్యగాని వేసే ప్రసక్తిలేదు. మార్గ సూచిక శీర్షికను రెండవ హద్దునుంచి, ప్రారంభించాలి. చూడండి ఇంకా సూడండి చూచికలను మూడవ హద్దునుంచి ప్రారంభించాలి. సూచించే సూచిక స్వభావాన్ని బట్టి, మిగతాది మొదటి లేదా రెండవ హద్దునుంచి ప్రారంభించవలసి ఉంటుంది.

చూడండి మార్గ సూచిక

నిఘంటు సూచిలోఉపయోగించే మార్గసూచికలు నిర్దిష మార్గసూచికలు [స్పెసిఫిక్ రెఫరెన్స్], విశిష్ట మార్గ సూచికలు [స్పెషల్ రెఫరెన్స్] అని రెండు రకాలుగా

ఉంటాయి. నిర్దిష్ట మార్గ సూచికలు చూడండి, ఇంకా చూడండి అనిరెండు విధాలు, చూడండి సూచికలు ఈ క్రింది సందర్భాలలో ఉపయోగిస్తారు.

సమానార్థకాలకు లేదా నామాంతరాలకు —

| | | |
|---|---|---|
| విష్ణుచిత్తీయము | చూడండి | అముక్తమాల్యద |
| నరసభూపాలీయము | ,, | కావ్యాలంకారసంగ్రహము |
| చిన్నక్క (నవల) | ,, | శారద |

సమాన శీర్షికలో రెండో భాగానికి—

| | | |
|---|---|---|
| గ్రంథాలయాలు, బాలలు | చూడండి | బాలల గ్రంథాలయాలు |
| విద్య, వయోజన | ,, | వయోజన విద్య |

పద స్వరూపంలోని తేడాలకు —

| | | |
|---|---|---|
| ఉమాకాన్తం | చూడండి | ఉమాకాంతం |
| ఠాగోరు | ,, | ఠాకూరు |
| తోల్‌స్టాయి | ,, | టాల్ స్టాయి |

వ్యతిరేకార్థాలకు—

| | | |
|---|---|---|
| సంశ్లేషణ | చూడండి | విశ్లేషణ |

తక్కువ ప్రచారంలోగల పదాలనుంచి ఎక్కువ ప్రచారంలోగల పదాలకు—

| | | |
|---|---|---|
| చలన చిత్రం | చూడండి | సినిమా |
| అపరాధ పరిశోధన | ,, | డిటెక్టివ్ |

కలం పేర్లు లేదా మారు పేర్లు, లేదా గుప్తనామాలకు—

| | | |
|---|---|---|
| లత | చూడండి | హేమలత, తెన్నేటి |
| మంజుశ్రీ | ,, | రమాపతిరావు, అక్కిరాజు |
| చక్రపాణి | ,, | వెంకటసుబ్బారావు, ఆలూరి |

పేరులో పరివారమైన కొంత భాగానికి—

కరంచంద్ గాంధీ, మోహన్‌దాస్

చూడండి

గాంధీ, మోహన్‌దాస్ కరంచంద్

సుబ్బయ్య, గొర్రెపాటి వెంకట

చూడండి

వెంకట సుబ్బయ్య, గొర్రెపాటి

ఇంకా చూడండి మార్గ సూచికలు

నిర్దిష్ట మార్గసూచికలలో రెండవ అంశమైన "ఇంకా చూడండి" సూచికలు ఈ దిగువ సందర్భాలలో ఉపయోగింపబడతాయి. అయితే సూచింపబడు అంశంపై సూచిక ఇంతకు ముందే సదరు గ్రంథాలయంలో విధిగా కొన్ని విషయాలను నమోదు చేసి ఉండాలి. సూచింపబడిన విషయం సంబంధ విషయమై ఉండాలి.

సాధారణ విషయంనుండి నిర్దిష్టవిషయానికి దారిచూపే సమయంలో —

ఖగోళశాస్త్రం ఇంకా చూడండి గ్రహాలు

పరస్పర సంబంధంగల విషయాలను తెలిపే సందర్భంలో—

ఆధునిక భౌతిక శాస్త్రం ఇంకా చూడండి అణుశక్తి

విప్లవ కవిత్వం " దిగంబర కవిత్వం

కొన్ని ప్రత్యేక సందర్భాలలో ఒకవిషయ పరిభావం మరొక విషయంమీద పడినప్పుడు -నిర్దిష్ట విషయంనుంచి సాధారణవిషయానికి సూచికచేయవలెను. ఇది యాదృచ్ఛికం.

రెండు సూచనలు

మార్గ సూచికలను సాధ్యమైనంత వరకు సంగ్రహ పరచవలెను.

| | | |
|---|---|---|
| పువ్వులు | ఇంకా చూడండి | గులాబీలు |
| ,, | ,, | చామంతులు |
| ,, | ,, | మల్లెలు |

అని మూడుసార్లు వరుసగా మూడు పద్దులు చేసే బదులుగా వాటిని తగ్గించి—పువ్వులు ఇంకా చూడండి గులాబీలు, చామంతులు, మల్లెలు అని ఒకే పద్దుతో సరిపెట్ట వచ్చును.

అన్నిటికంటె ముఖ్యంగా ఈ సూచికలను పరివర్తిత క్రమంలో వినియోగించరాదు.

| | | |
|---|---|---|
| వెలుగు | ఇంకా చూడండి | భౌతిక శాస్త్రం |
| అణుశక్తి | ,, | ఆధునిక భౌతిక శాస్త్రం |

విశిష్ట మార్గ సూచికలు

సూచిలో ఎన్నుకొనబడిన విషయాలకు పరస్పర సంధానం కల్పించేందుకు, కొన్నిటికి విశిష్ట మార్గ సూచికలు రూపొందించ వలసి ఉంటుంది. సాధ్యమైనంత వరకు ఇవి విషయాన్నుంచి వ్యక్తులకు చేయబడతాయి. పై రెంటికంటే ప్రత్యేక ప్రవృత్తి గలిగినవి గనుక వీటిని విశిష్ట మార్గసూచికలు అంటారు. ఈదిగువ సందర్భాలలో ఇవిచేయాలి.

ఉద్యమాలకు,వ్యక్తుల జీవితాలకు సన్నిహిత సంబంధమున్నపుడు ఆవ్యక్తి పేర సూచికను చేయాలి.

| | | |
|---|---|---|
| గ్రంథాలయోద్యమం | చూడండి | వెంకటరమణయ్య, అయ్యంకి |
| సంఘ సంస్కరణోద్యమం | ,, | వీరేశలింగం, కందుకూరి |

శాస్త్రీయ పరిశోధనా ఫలితాలనుంచి ఆయా పరిశోధకులకు సూచికనుచేయాలి.

| | | |
|---|---|---|
| పెన్సిలిన్ | చూడండి | ఫ్లెమింగ్ |
| రేడియో | ,, | మార్కొని |

దేశాల, నగరాల, పట్నాల చరిత్రల వివరణ సందర్భంలో వాటితో సన్నిహిత సంబంధ మున్న వ్యక్తుల పేర సూచికలు చేయాలి.

చీరాల చూడండి గోపాల కృష్ణయ్య, దుగ్గిరాల
బార్డోలీ ,, పటేల్, వల్లభాయి

చారిత్రక సంఘటనలు వివరించేటప్పుడు ఆ సంఘటనలతో సన్నిహిత సంబంధంగల దేశాలు, నగరాలు, పట్నాలు,పల్లెలకు సూచికలు చేయాలి

పన్నుల నిరాకరణ చూడండి పెదనందిపాడు

ఒక విషయానికి వివరణ జరుగుతున్నపుడు ఆ విషయంతో సన్నిహిత సంబంధంగల లేదా ఆవిషయంలో అపారమైనకృషి చేసిన వ్యక్తుల పేర సూచిక చేయాలి.

తెలుగు వ్యాకరణం చూడండి చిన్నయసూరి
చరిత్ర పరిశోధన ,, సోమశేఖరశర్మ, మల్లంపల్లి

దేశచరిత్రల వివరణలో ఆయా దేశాల రాజుల, రాణుల ప్రముఖ మంత్రుల పేర్లకు సందర్భాన్ని బట్టి సూచికను ఇవ్వాలి.

విజయనగర సామ్రాజ్యం చూడండి శ్రీకృష్ణదేవరాయలు
ఆంధ్ర రాష్ట్రం ,, ప్రకాశం, టంగుటూరి

దేశంలో భౌగోళిక విభాగాల నుండిఅందలి ప్రముఖమైన ప్రదేశాలకు సూచికను ఇవ్వాలి

ఆంధ్రప్రదేశ్ చూడండి నాగార్జునసాగర్
భారతదేశం ,, భక్రానంగల్

చిత్రకళకు సంబంధించిన గ్రంథాల విషయంలో ఆయా ప్రక్రియలలో విశేషకృషి చేసిన చిత్రాకారులకు సూచిక ఇవ్వాలి.

ప్రకృతి చిత్రాలు చూడండి సంజీవదేవ్
వర్ణచిత్రాలు ,, కృష్ణమూర్తి, మొక్కపాటి

సమరూప శీర్షికలకూ

వేదామృతము చూడండి వేదాలు
యజుర్వేదము చూడండి వేదాలు
కురాన్ షరీఫ్ చూడిండి కురాను

మిష్కాత్-ఇ-షరీఫ్ చూడండి బైబిలు
పరిశుద్ధ గ్రంథము చూడండి బైబిలు

ద్వ్యర్థి కావ్యాలు, త్ర్యర్థి కావ్యాలలో విషయాలకు ——
రాఘవపాండవీయం చూడండి రామాయణం, భారతం
యాదవ రాఘవఫాండవీయం చూడండి భాగవతం
రామాయణం, భారతం

పొడి అక్షరాలనుంచి, మామూలు పేరుకు
కొ.కు చూడండి కుటుంబరావు, కొడవటిగంటి
పా.ప. చూడండి పద్మరాజు, పాలగుమ్మి

మార్గ సూచికలు అతిగాచేయడం మంచిదికాదు. గ్రంథాలయస్థాయి, చదువరుల అవసరాల మేరకే చేయాలి.

ప్రత్యేక గమనికలు

1 మార్గసూచికలలో పరిచయ సంకేతంగాని, ప్రవేశ సంఖ్యలుగాని ఉండవు.
2 పద్దు ఒకసారి చేస్తే మరల చేయవలసిన పనిలేదు.
3 మార్గసూచికను రెండవ హద్దునుంచే ప్రారంభించాలి.

— 0 —

# 12 విశ్లేషణాత్మకాలు

సాధారణంగా ప్రతి పుస్తకానికి ప్రధాన పద్దు, అవసరాన్ని బట్టి మరి కొన్ని ఉప పద్దులు చేయాలి. వీటితో గ్రంథానికి సంబంధించిన వివరాలన్నీ తెలిసి పోతాయి. అప్పటికీ కొన్ని అసాధారణ పరిస్థితులలో కొన్ని అంశాలు మిగిలి పోవచ్చు అది ఒక గ్రంథంలో సూచీకరణలోకి రాని మరొక వ్యాసం, ఏదైన కావచ్చు. కనుక మిగిలి పోయిన ఈ అంశాలకు చదువరి అవసరం దృష్ట్యా మరికొన్ని పద్దులు చేయవలసి ఉంటుంది. వీటిని విశ్లేషణాత్మక పద్దులు (ఎనలిటికల్ ఎన్ట్రీస్) అంటారు.

ఇవి మూడు రీతులుగా ఉంటాయి.

1 గ్రంధకర్త విశ్లేషణాత్మకాలు

2 గ్రంధనామ ,,

3 విషయ ,,

గ్రంధ కర్త విశ్లేషణాలలో శీర్షిక తొలి హద్దు నుంచి ప్రారంభమౌతుంది. ఆ తర్వాత మిగతా వివరాలు, విశ్లేషణాత్మకాలు ఆయా పద్దుల నమూనాలలోనే కొనసాగుతాయి.

## గ్రంథకర్త విశ్లేషణాత్మకాలు

ఈ దిగువ వివరించిన సందర్భాలలో గ్రంథ కర్త విశ్లేషణాత్మక పద్దులు చేయవలసి ఉంటుంది.

ఒక గ్రంథంలో ప్రధాన విషయానికంటే మరికొంత భాగాన్ని వేరొక రచయిత రాసినప్పుడు ఈ పద్దు చేయవలసి ఉంటుంది.

| | స్ట్రేంజ్, థామస్ ఏమ్స్ డేన్ |
|---|---|
| 928.94827 | \| హింధూ ధర్మశాస్త్ర సంగ్రహము/అనువాదము చిన్నయ సూరి. |
| | \| వెంకటరావు, నిడదవోలు గారి చిన్నయసూరి జీవితము. చూ. పుట 86–103. |
| చిన్న – చి | |

ఒక రచయిత రాసిన రెండు అంత కంటే ఎక్కువ గమనించదగిన రచనలను ఒక గ్రంథంలో కలిపి కుట్టి మిగతా రచనల ప్రసక్తి సూచీకరణలో రానప్పుడు ఈ పద్దు చేయాలి.

| | సత్యనారాయణ, విశ్వనాథ (1885 – 1976) |
|---|---|
| 894.82717 | కోకిలమ్మ పెళ్ళి |
| | కిన్నెరసాని పాటలు |
| స.వి – కో | చూ. పుట 36 – 41. |

ముఖ్య గమనిక: అయితే సాధారణ కథలు, నాటికలు, వ్యాసాల సంపుటాలలోని విడివిడి రచనలకు, సంపూర్ణ గ్రంథావళి ప్రత్యేక ప్రాముఖ్యత ఉంటే తప్ప గ్రంథకర్త విశ్లేషణాత్మక పద్దు చేయవలసిన పనిలేదు. వీటిని చేసేప్పుడు మరొక్క సారి పునరాలోచన చేయవలసిన అవసరం మాత్రం ఉంది. ఇది ముఖ్యం.

## గ్రంథనామ విశ్లేషణాత్మకాలు

ఈ పద్దులను ఈ దిగువ సందర్భాలలో చేయవలసి ఉంటుంది

ఒక గ్రంథంలో ఒక కథగాని, నాటికగాని, వ్యాసంగాని దాని పేరుతో విశేషంగా ప్రచారమై ఉంటే – ఆ పేరును శీర్షికగా గ్రహించి, గ్రంథ నామానికి విశ్లేషణాత్మక పద్దు చేయవలసి ఉంటుంది.

| | బిక్షాపాత్ర (నాటిక) |
|---|---|
| | కృష్ణారావు, జి. వి. |
| 894.8272 | వేణు గోపాలస్వామి, కూర్మా (సంపా) |
| వే.కూ - ప్ర | ప్రసిద్ధ నాటికలు – పుట (48 – 71) |

గమనిక : ఈ విధమైన పద్దులను ఒక్కొక్కప్పుడు సంపూర్ణ గ్రంథావళి (కంప్లీట్ వర్క్స్) లోని ప్రసిద్ధ గ్రంథాలకు చేయవలసి ఉంటుంది.

విషయ విశ్లేషణాత్మకాలు

ఈ పద్దులను ఈ దిగువ వివరించిన చోట్ల చేయవలసి ఉంటుంది.
విషయపు పద్దులలో చేరకుండా ఏదైనా విషయం ఉంటే - అది చదువరికి అవసర మని భావిస్తే — దానిని శీర్షికగా గ్రహించి ఈ పద్దు చేయవలసి ఉంటుంది.

| | తెలుగు సాహిత్యం — పత్రికలు
| తెలుగులో సాహిత్య పత్రికలు రామ చంద్ర, తిరుమల

059.4827 | (ఆంధ్ర సారస్వత పరిషత్తు రజతోత్సవ
ఆంధ్ర — ర | సంచిక. పుట 327 – 343)

అనుభవ నీయులైన గ్రంథ పాలకులు ఈ విశ్లేషణాత్మక పద్దులను సాధ్యమైనన్ని తక్కువ చేయడం మంచిదనే అభిప్రాయంలో ఉన్నారు. ఎందుచేతంటే — సూచీ పెరిగి పోతుందన్న భయం ఒకటి. రెండవది ఈనాడు కథలకు, నాటికలకు, వ్యాసాలకు ముద్రిత రూపంలో అనుక్రమణికలు లభిస్తున్నపుడు ఈ పద్దులతో ఆట్టే పనిలేదు చదువరిని ఆ అనుక్రమణికలను సంప్రదింప వలసినదిగా సూచింపవచ్చు. అందువలన చదువరి మరికొంత ప్రయోజనాన్ని పొందడానికి అవకాశం ఉంది.

మిగిలిన మరికొన్ని

సూచీకరణ విధానం అత్యంత విస్తృతమైనది. ఎన్ని విషయాలు ఎంత విపులంగా వివరించినప్పటికీ మరికొన్ని మిగిలిపోక తప్పదు. అలా మిగిలిపోయిన అనేక అంశాలలో రాత ప్రతుల సూచీకరణ, కేంద్రీకృత సూచీకరణ, అనుబంధిక, సూచీకరణ విభాగం, సూచీ ప్రచారం మొదలైనవి గమనించ దగినవి.

రాత ప్రతులు: చలన చిత్రాలు

సాధారణ సూచీలో వలె రాత ప్రతి భౌతిక వివరాలు నమోదుచేశాక రాతకు ఉపయో గించిన లిపి, రాసిన వారిపేరు, రాత ప్రతిని సిద్ధంచేసిన సంవత్సరం, ఆ ప్రతి ఎవరి

నుంచి సంపాదించారో వారిపేరు, మొదలైన వివరాలు చేర్చాలి. రాత ప్రతుల సూచీ వేరుగా ఉంటే మంచిది. రాత ప్రతులను హైదరాబాదులోని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారానికి పంపిస్తే మంచిది. అక్కడ మరింతబాగా ఉపయోగపడగలవు.

చలన చిత్రాల సూచీలో ఈ దిగువ వివరాలు నమోదు చేయాలి. చలన చిత్రం పేరు, తయారు చేసిన సంస్థ పేరు, విడుదల తేదీ, కొలత, రంగు, ప్రవేశ సంఖ్య, వర్గ సంకేతం, సంపాదించిన తేదీ, మొదలైన వివరాలు ప్రత్యేకంగా తయారు చేసిన కార్డులపై నమోదు చేయాలి. సదరు గ్రంథాలయంలో గల చిత్రాలకు తగిన ప్రచారం గూడ ఇవ్వాలి.

— 0 —

# 13 సమీకృత సూచి

ఒక దేశంలో, ఒక రాష్ట్రంలో, ఒక పరిధిలోగల గ్రంథాలయాలలోని పఠన సామగ్రి తాలూకు సూచీకార్డులను ఒక క్రమంలో, ఒకచోట అమర్చినపుడు అది సమీకృత సూచీ (యూనియన్ కేటలాగ్) అవుతుంది. సాధారణంగా సమీకృత సూచీ చాల స్థలం ఆక్రమిస్తుంది. ముద్రించడం ఎన్నడో గాని సాధ్యంకాదు. ఎప్పుడూ సంపూర్ణంగా ఉండదు. ఎప్పుడూ పూర్తికాదు. అదొక నిరంతర నిర్విరామ కార్యక్రమం. సమీకృత సూచీ వలన—

1 ఒక గ్రంథం ఏ గ్రంథాలయంలో ఉందో తెలుసుకోడానికీ,

2 గ్రంథాలయ సహకారం—అనగా ఒక గ్రంథాలయం నుంచి మరో గ్రంథాలయం పుస్తకాలు ఇచ్చిపుచ్చు కోడానికీ,

3 పుస్తకాల క్రమబద్ధమైన ఎంపికకు,

4 ఖరీదైన పుస్తకాలు, పత్రికలు కొనుగోలులో పునరుక్తి తగ్గించడానికి,

5 గ్రంథాలకు సంబంధించిన వర్ణనాత్మక వివరాలు తెలుసుకోడానికి — వీలవుతుంది.

అయితే సమీకృత సూచీని ఒక నగరానికో, జిల్లాకో, రాష్ట్రానికో, దేశానికో పరిమితం చేసి తయారు చేస్తేనే ఉపయోగించే వారికి వీలుగా ఉంటుంది. అంతేగాక ఈ సూచీని ఒక శాఖకు చెందినవిగా, అనగా విశ్వవిద్యాలయ గ్రంథాలయాలు, పారిశ్రామిక గ్రంథాలయాలు, పరిశోధక గ్రంథాలయాలు, ప్రాచ్య గ్రంథాలయాలు ఇలా వేరు వేరుగా, చేసినప్పుడే మరింత ప్రయోజనకరంగా, ఆశాజనకంగా ఉంటుంది. అంతేగాని ఒక భౌగోళిక పరిధిలోని అన్ని తరగతుల గ్రంథాలయాలలోని అన్ని పుస్తకాలకు విచక్షణా రహితంగా ఈ సూచీని తయారు చేయడానికి ప్రయత్నిస్తే అది పూర్తికాక—అందుకు వెచ్చించిన వ్యయ ప్రయాసలు వృథాఅయ్యే ప్రమాదం ఉంది.

## తయారు చేసే విధానం

గ్రంథాలయ సూచీ అంత విపులంగా సమీకృత సూచీ తయారు చేయడం జరగదు. దీనిలో అన్ని పద్దులుండవు. ఈ సూచీలో కేవలం గ్రంథకర్తపద్దు, గ్రంథనామం పద్దులు మాత్రం ఉంటాయి. గ్రంథకర్త పద్దు ప్రధానపద్దుగా ఉంటే, గ్రంథనామం పద్దు— ఉప పద్దుగా ఉంటుంది. పత్రికలకు సంబంధించిన సమీకృతసూచీని కూడ ఇదే రీతిలో తయారు చేస్తారు. రెండు రకాలలో ప్రధాన పద్దులు వర్గీకృత క్రమం లోను, గ్రంథ నామాల పద్దులు అక్షరక్రమంలోనూ వేరు వేరు పేటికలలో అమర్చు కుంటే వినియోగదారులకు ప్రయోజన కరంగా ఉంటుంది.

ఈ సూచీలో వివరాలు సాధ్యమైనంత తక్కువగా, అవసరం మేరకే ఇవ్వవలసి ఉంటుంది. ప్రధాన పద్దులో—

1 పరిచయ సంకేతం, 2 గ్రంథకర్త, 3 గ్రంథనామం,
4 ముద్రణ సంఖ్య, 5 ప్రచురణతేదీ— ఉంటాయి.

ఉపపద్దులో—

1 పరిచయ సంకేతం, 2 గ్రంథనామం, 3 గ్రంథకర్త— ఉంటాయి. రెంటిలో ఈ వివరాలుగల పుస్తకం గ్రంథాలయంలో ఉంటే, ఆ గ్రంథాలయం తాలూకు సంకేత సంఖ్య తప్పని సరిగా ఉంటుంది. ఈ సూచీని తయారు చేసే టప్పుడు ముందుగా పెద్ద గ్రంథాలయంలోని గ్రంథాల వివరాలను 6"X4" కారు పై నమోదు చేసి, చిన్న గ్రంథాలయాలకు పంపుతారు. చిన్న గ్రంథాలయాలు తమవద్ద గ్రంథం ఉంటే—తమకు కేటాయించిన సంకేత సంఖ్యను ఆ కార్డుపై వేస్తారు. మరొక సారి ఒక వ్యక్తి అన్ని గ్రంథాలయాలు తిరిగి సమాచారం సేకరించడం సేకరించిన సమాచారాన్ని ధ్రువ పరచు కోవడం ముఖ్యం. ఏమైనా అన్ని గ్రంథాలయాల సంపూర్ణ సహకారం ఉన్నపుడే ఈపని సాధ్యమౌతుంది.

## తొలి ప్రయత్నాలు

సమీకృత సూచీని తయారు చేసే ప్రయత్నాలు చిరకాలంనుంచీ ఉన్నాయి. 13వ, శతాబ్దంలోగల 183 ఇంగ్లీషు, స్కాటిష్ మత గ్రంథాలయాలకు సమీకృత సూచి తయారు చేసే ప్రయత్నం జరిగింది. కానీ ఇది అసంపూర్తిగా నిలచి పోయింది. 15వ,

శతాబ్దానికి చెందిన జాన్ బోస్టన్ బురీ 195 మత సంస్థలు, మత సంబంధ సదనాలలోని గ్రంథాలయాలకు సమీకృత సూచీ చేసే ప్రయత్నం చేశాడు. గ్రంథకర్త అక్షర క్రమంలో పద్దుల అమరిక జరిగింది. తదుపరి 1548లో జూరిచ్‌కు చెందిన కెర్నాడ్ గెస్నర్ "బిబ్లియోథికా యూనివర్సలిస్" అనే విశ్వజనీన (యూనివర్సల్ బిబ్లియోగ్రఫీని) గ్రంథ సూచీ తయారు చేశాడు. ఇందు ప్రసిద్ధ భాషలకు చెందిన 12,000ల గ్రంథాల వివరాలున్నాయి, గ్రంథకర్త అక్షరక్రమంలో అమరిక ఉంది. దీనికి అనుబంధం మరో 3000 పుస్తకాల చేర్పుతో 1555లో జరిగింది. ఇది వాస్తవానికి సమీక్సత సూచి కాకపోయినా, ఈ సూచీకి సంకేత సంఖ్యలు చేర్చినా, అప్పట్లో ముద్రిత పుస్తకాల సంఖ్య చాలా తక్కువ గనుక, సమీకృత సూచీగా దీనిని, ఉపయోగించుకోవచ్చు. ఆ తరువాత 19వ, శతాబ్దంలో అంతర్జాతీయ గ్రంథసూచీ సంస్థ "యూనివర్సల్ బిబ్లియోగ్రాఫిక్ కేటలాగ్" పేరుతో ఒక ప్రపంచ ప్రసిద్ధ గ్రంథాలయాల సమీకృత సూచీ తయారు చేయడానికి ప్రయత్నం చేసింది. కాని అది జయప్రదం కాలేదు.

20వ, శతాబ్దంలో సమీకృతసూచీలు ముమ్మరంగా రాసాగాయి. అమెరికాలో లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్, బ్రిటన్‌లో ఆక్స్ ఫర్డ్, కేంబ్రిడ్జి మొదలైన విశ్వవిద్యాలయాలు, కొన్ని దేశాలలో వ్యాపార సంస్థలు, భారతదేశంలో INSDOC, ICSSR వంటి సంస్థలు ముందుకు వచ్చాయి. ఈ సంస్థలు తయారు చేసి ప్రచురించిన కొన్ని సమీకృత సూచీల పేర్లు తెలుసుకుందాం.

USA :

1 Union list of Serials in Libraries of the United States and Canada. Edited by Mrs. EDNA BROWN TITUS, 3rd ed, New York, Wilson, 1965, 5v.
(Continued by New Serials Titles, Washington, Library of Congress : Monthly with annual, 5-yearly and 10 yearly cumulations)

2 National Union Catalog of Manuscript collection (Library of Congress).

UK :

1 World list of Scientific Periodicals, 1963-65. 4th ed., London, Butterworths, 3v.

INDIA

1 Union Catalogue of learned periodicals in South Asia. V. 1: Physical and Biological sciences, compiled by Dr S R Ranganathan and others. Published by Indian Library Association, 1953.

2 India, Directorate of Health Services. Union Catalogue of Medical Periodicals in Indian Libraries, corrected upto 31st December 1955. (4th ed 1956).

3 Regional Union Catalogue of Scientific Serials, Hyderabad. New Delhi, INSDOC, 1975.

4 Union list of Social Science periodicals, Andhra Pradesh. New Delhi, ICSSR, 1976.

5 List of Scientific periodicals in the Bombay Presidency, 1931.

ఇవిగాక ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ శాఖ తరఫున గుంటూరులోని ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయం 1960లో ఆంధ్రప్రదేశ్‌లోని సుప్రసిద్ధ గ్రంథాలయాలకు సమీకృతసూచీ తయారు చేసే పని కొన్ని సంవత్సరాలుచేసి చాలా భాగం పూర్తి చేసింది. ప్రారంభించిన మూడేళ్లకే నిధులకొరత వలన మూలపడింది. మరల తలెత్తలేదు.

— 0 —

# 14 కేంద్రీకృత సూచీకరణ

ఒక కేంద్రంలో పఠనసామాగ్రిని సూచీకరించే విధానాన్ని ''కేంద్రీకృత సూచీకరణ'' (సెంట్రలైజ్డు కేటలాగింగ్) అంటారు. ఈ విధానాన్ని ఒక కేంద్రంనుంచే ఆపరేట్ చెయ్యాలి. ప్రభుత్వం సంస్థ నిర్వహించవచ్చు. నియమిత పరిధిలోని కొన్ని గ్రంథాలయాల సముదాయంలో ఈ విధానాన్ని అమలుచేయడానికి సులభసాధ్యమౌతుంది. కేంద్రీకృత సూచీకరణ ఉద్దేశాలు ఇలా ఉంటాయి.

1 పనిలో పునరుక్తి తగ్గించడం

2 సూచీకరణ ఖర్చు తగ్గించడం

3 సూచీకరణలో సమరూపత సాధించడం

4 సూచీకరణ స్థాయి పెంచడం

5 సూచీ వినియోగం మరింత ప్రయోజన వంతంగా ఉండేట్లు చేయడం

6 పాఠకులకు తగినంతగా ఎక్కువసాయపడడం

7 యోగ్యతగల సిబ్బందికాలం చదువరుల సేవలకు వినియోగించడం

సాధారణంగా గ్రంథాలయాలలో వర్గీకరణ, సూచీకరణలు సిబ్బంది సమయం పూర్తిగా హరించి వేస్తుంది. అత్యవసరమైన చదువరుల సేవలకు సిబ్బంది కొరత ఉండడం అన్ని గ్రంథాలయాలలో సహజం. ఈ లోటును కేంద్రీకృత సూచీకరణ విధానం తీర్చుతుంది.

అయితే కేంద్రీకృత సూచీకరణ విధానంలో కొన్నిలోటు పాట్లు లేక పోలేదు. ముఖ్యంగా—

1 కార్డులు తయారు చేయడంలో, వాటిని ముద్రించి, బట్వాడా చేయడంలో ఆలస్యం కావడం సహజం.

2 ఈ విధాన పరిధిలోగల అన్ని గ్రంథాలయాలు కార్డులు తీసుకో వాల్సిందే. అయితే ఇలా తీసుకున్న కార్డులన్నిటికీ పుస్తకాలుండే అవకాశంలేదు.

3 పరిధిలోగల అన్ని గ్రంథాలయాలలో ఒకే రకమైన పుస్తకాలున్నప్పుడే ఈ విధానం పూర్తిగా సద్వినియోగం అవుతుంది.

4 స్థానికంగా కొద్దిపాటి మార్పులు చేసుకోవాలంటే, ఈ విధానంలో అదనపు శ్రమ అవుతుంది.

5 ఈ విధానంలో ఎప్పుడూ కొంత పునరుక్తి, కొంత దుబారా తప్పదు. విజ్ఞాన ప్రచారాన్ని దృష్టిలో ఉంచుకొని ఈ ఖర్చును ప్రభుత్వం భరిస్తే సరి—లేకుంటే ఈ విధానం శాశ్వతంగా కొనసాగడం కష్టం.

## కేంద్రీకృత పద్ధతులు

కేంద్రీకృత సూచీకరణ విధానంలో ఈ దిగువ ఉదహరించిన పద్ధతులు అమలులో ఉన్నాయి.

1 సూచీకార్డులు తయారుచేసి, ముద్రించి పంపడం

2 మెషీన్‌ద్వారా చదువుకోవడానికి వీలైన కార్డులు తయారుచేసి పంపడం (మెషీన్ రీడబుల్ కేటలాగింగ్ సర్వీస్—MARC)

3 పుస్తకాల సరఫరాతో పాటే సూచీకార్డులు పంపించడం

4 ఈ మూడు పద్ధతులు నేడు ప్రపంచ వ్యాప్తంగా అమలులో ఉన్నాయి. వీటి వివరాలు కొన్ని తెలుసుకుందాం.

## ముద్రిత కార్డుల సేవ

ఈ పద్ధతిలో ఒక కేంద్రంలో సూచీ కార్డు తయారు చేసి, ముద్రించి ఆకేంద్రానికి అనుబంధంగా గల గ్రంథాలయాలకు పంపడం జరుగుతుంది. 1898 జులైలో అమెరికాలోని లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్, కాపీరైట్ గ్రంథాలకు కార్డులు ముద్రించడం ప్రారంభించింది. 1901 నుంచి అన్ని గ్రంథాలకు కార్డులు తయారు చేసి ముద్రించి నియమిత గ్రంథాలయాలకు అందించింది. ఈ విధానం ఆనాడు పలువురి ప్రశంసల నందుకుంది. తదుపరి బ్రిటిష్ జాతీయ గ్రంథసూచి, వ్యాపార సంస్థలైన

హెచ్ డబ్ల్యూ. విల్సన్ మొదలైన కంపెనీలు కార్డుల ముద్రణ ప్రారంభించాయి. అనేక దేశాలలో ఈ పద్ధతి ప్రారంభమైంది.

### మెషీన్ కార్డుల సేవ

ఈ పద్ధతిలో ఒక గ్రంథాలయంలో మాగ్నటిక్ టేపులలో సూచీ వివరాలు రికార్డు చేస్తారు. ఈ టేపులకు ప్రతులు తీసి అనుబంధ గ్రంథాలయాలకు పంపినపుడు, ఈ టేపులను కంప్యూటర్ల ద్వారా చదువుకోవచ్చు. కావలసిన అంశాలను ''ప్రింటర్'' ద్వారా ముద్రించు కోవచ్చు. ఆటోమేషన్‌మీద కింగ్స్ నివేదిక ఆధారంగా ఈ పద్ధతిని లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ 1966 నవంబరులో ప్రవేశ పెట్టింది. తొలిదశలో 16 గ్రంథాలయాలకు ఈ సేవలందాయి. ఒక్క ఏడాది కాలంలో 16,000 చిన్న పుస్తకాలను మాగ్నటిక్ టేపుల మీదికి ఎక్కించడం సాధ్యమైంది. రెండవ దశలో ఈ పద్ధతిని శాశ్వత ప్రాతిపదికపై నిర్వహించడానికి నిర్ణయం తీసుకున్నారు. ఇందువలన ఏ గ్రంథాలయంలోనైనా చందాదారుడుగా చేరి టేపులను పొందే అవకాశం కలిగింది. కొన్ని అధునాతన సంస్థలు సంప్రదాయ బద్ధంగా వస్తున్న గ్రంథాలయ సూచీలను వెనక్కునెట్టి ఈ టేపులనే వినియోగిస్తున్నారు. ఈ విధానంలో ప్రతి పుస్తకానికి గ్రంథకర్త, గ్రంథనామాది వివరాలు, లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ విషయ శీర్షిక, దశాంశ వర్గీకరణ సంకేతం మొ॥ ఉంటాయి.

### పుస్తకంతో కార్డులు

ఈ పద్ధతిలో ప్రచురణకర్త ఈ కేంద్రానికి ముద్రిత గ్రంథం బైండింగ్ దశలో ఉన్నపుడు విడుదల కాకముందే పంపుతారు. పుస్తకం విడుదలయ్యే సరికి కార్డులు సిద్ధమవుతాయి. పుస్తకాలు సేకరించే గ్రంథాలయానికి పుస్తకాలతో పాటు సూచీ కార్డులు వస్తాయి. సరిగా సాగితే, అందరూ సహకరిస్తే ఇది అపూర్వమైన విధానం. 1938 లోనే హెచ్. డబ్ల్యూ. విల్సన్ అనే వ్యాపార సంస్థ ఈ కార్యక్రమం ప్రారంభించింది. గ్రంథాలయాలనుంచి తగినంత ప్రోత్సాహం లేనందున ఈ పథకం ఆదిలోనే అంతమైంది.

సోవియట్ రష్యాలో ఈ విధానం 1925 నుంచి అమలులో ఉంది. తొలుత ఈ పని విద్యాశాఖ చూసేది. తదుపరి ఈపని బుక్ ఛాంబర్‌కు అప్పగించారు. ఉభయ జర్మనీ

దేశాలు, స్వీడన్, డెన్మార్క్ మొదలైన దేశాలలో ఈ పద్ధతి నేటికీ నిరాటంకంగా సాగుతూంది.

### డాక్టర్ రంగనాథన్ సూచన

సుప్రసిద్ధ గ్రంథాలయ శాస్త్రవేత్త డాక్టరు ఎస్. ఆర్. రంగనాథన్ ఈ పనిని జాతీయ కేంద్ర గ్రంథాలయం చేపట్టాలన్నారు. ఈ కేంద్ర గ్రంథాలయానికి ప్రతి ప్రచురణకర్త పుస్తకం అచ్చుయినా అవడంతోనే పంపితే ఇచట సాంకేతిక పనులు పూర్తిచేసి మాస్టర్ స్టెన్సిలు తయారౌతుంది. దాన్నుంచి కార్డులు కావలసినవారు పొందవచ్చు. దీనివలన 79% సాంకేతిక సంబంధమైన ఖర్చు కలసి వస్తుందని డాక్టరు రంగనాథన్ అంచనా. కాని ఈ సూచనను మనదేశంలో అమలుచేయలేదు.

## సూచీకరణ సహకారం

కొన్ని గ్రంథాలయాలు పరస్పర సహకారంతో అందరి అవసరం కోసం సూచీకరణ కార్యక్రమం పూర్తి చేసుకొనే పద్ధతిని సూచీ కరణ సహకారం (కోఆపరేటివ్ కేటలాగింగ్) అంటారు. ఈ పని రెండు మూడు గ్రంథాలయాలకే పరిమితం. ఈ పద్ధతిలో ఖర్చును, ప్రయోజనాన్ని, సహకరించే గ్రంథాలయాలు సమానంగా భరిస్తాయి.

కేంద్రీకృత సూచీకరణ విధానంలోని ఉద్దేశాలు, ప్రయోజనాలు, లోటుపాట్లు ఇచటా వర్తిస్తాయి. లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ 1961 సూచీ కార్డుల ముద్రణతోనే సూచీ సహకార పద్ధతి ప్రారంభమైనదని చెప్పవచ్చు. ఒక విధంగా ఈ పద్ధతి కేంద్రీకరణ సూచీకరణ సహకారం —రెండు పద్ధతులకు చెందినదని చెప్పవచ్చు. లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ సూచీ కార్డులను తయారు చేసి మార్పిడి ద్వారా అనేక దేశాల, భాషల కార్డులను సంపాదించి ఆ గ్రంథాలయంలో సమగ్రమైన సూచీని నిర్మించింది. ఈ సూచీ గొప్ప జాతీయ సంపద.

### జాతీయ కార్యక్రమం

లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ 1965 ఉన్నత విద్యా చటం ద్వారా జాతీయ స్థాయిలో సేకరణ, సూచీకరణ కార్యక్రమాన్ని 1966 నుంచి ప్రారంభించింది. ఈ కార్యక్రమం ప్రకారం లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ సభ్య గ్రంథాలయాల కోసం ప్రపంచ

వ్యాప్తంగా లభించే పఠన సామగ్రి సేకరించి, సూచీకరణ చేసి కోరినప్పుడు అందిస్తుంది. దీనినే నేషనల్ ప్రోగ్రాం ఫర్ ఎక్విజిషన్స్ అండ్ కేటలాగింగ్—N P A C అంటారు. ఈ పథకం అమలు చేయడానికి లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ అంతర్జాతీయ సహకారం కోసం జాతీయ స్థాయి, ప్రాంతీయ స్థాయి (కొన్నిదేశాలు కలిపి) కార్యాలయాలను స్థాపించింది. ప్రతి కార్యాలయం స్థానికంగా లభించే పుస్తకాలను, పత్రికలను ఎంపికచేసి, కేంద్రానికి పంపిస్తుంది. ఈ పథకం 1974 నాటికి 40 దేశాలలో అమలులో ఉంది. సభ్య దేశాలు అనేక తీరుల ప్రయోజనాన్ని పొందుతున్నాయి.

### కేంద్రీకృతసూచి : సహకారసూచి

స్థూలంగా చూస్తే కేంద్రీకృత సూచీ, సహకార సూచీకి దగ్గరగా ఉంటుంది. అయితే ఈ రెంటికీ మధ్య గణనీయమైన తేడాలు లేకపోలేదు.

| | కేంద్రీకృతసూచి | సహకారసూచి |
|---|---|---|
| 1 | ఒక కేంద్రంలో సూచి తయారౌతుంది. తదుపరి అన్నికేంద్రాలకు కార్డులు పంపుతారు | ఒక కేంద్రంలో/అనేక కేంద్రాలలో తయారు చేస్తారు |
| 2 | ఒక సిస్టమ్‌లోని గ్రంథాలయాలకు ఒకచోట సూచీ తయారై తదుపరి అన్ని గ్రంథాలయాలకు పంపుతారు | |
| 3 | ఒకచోట సూచీ తయారు చేస్తే అవసరమైన కార్డులు కొన్నిగ్రంథాలయాలు కొంటాయి | ఖర్చు అన్ని గ్రంథాలయాలు సమానంగా భరిస్తాయి |

ఈ రెండు విధానాలలో కొన్ని సామ్యాలూ ఉన్నాయి. రెంటి వలన—

1 పునరుక్తి తగ్గుతుంది
2 ఖర్చు కలసివస్తుంది
3 ప్రమాణాలు సాధించడానికి వీలవుతుంది

అయితే కేంద్రీకరించిన ఒక సంస్థ ద్వారా సూచీకరణ కార్యక్రమం జరిగి, కార్డులు ఒక ప్రదేశంనుంచి పంపిణీ జరిగి నపుడు గ్రంథాలయ సహకారసూచి, కేంద్రీకృత వర్గీకరణలో ఒకభాగమే ఆవుతుంది. అయినా వీటి తేడా స్వల్పం, చివరగా స్పష్టం చేసే దేమంటే— ఒక సూచీ ద్వారా కేంద్రీకరణ జరిగితే మరో సూచీవలన కొన్ని గ్రంథాలయాలకు తప్పనిసరి ప్రయోజనం చేకూరుతుంది.

— o —

# 15 సంగ్రహ సూచీకరణ: ఎంపిక సూచీకరణ

గ్రంథాలయంలోని పుస్తకాలను వర్గీకరించి సూచీకరించడం సహజం. ఒక గ్రంథాలయంలో పఠన సామగ్రి గురించి తెలుసుకోడానికి సూచీ మించిన సాధనం మరొకటి లేదు. సూచీ తయారు చేయడానికి కొన్ని నియమాలున్నాయి. ఈ నియమాలను అనుసరించి సూచీ తయారు చేస్తారు. ఈ గ్రంథంలో వివరించిన ఎ.ఎ.సి. ఆర్—2 అలాంటిదే. సూచీ నియమాలను అనుసరించి చేస్తున్న సందర్భంలో సూచీ కర్తలకు కొత్త ఆలోచనలు స్ఫురించడం సహజం. అలాటి వాటిలో సంగ్రహ సూచి (సింప్లిఫైడ్ సూచి) ఎంపిక సూచి (సెలక్టివ్ సూచి) ముఖ్యమైనవి. వీటిని గురించి సూచి నియమాలలో ఎక్కడా కనిపించదు. కాని సూచి మరింత ప్రయోజన కరంగా చేసేనిమిత్తం, సూచీ పై వెచ్చించే అపారమైన వ్యయం తగ్గించే నిమిత్తం, వెచ్చించే ప్రతిపైసాకు సార్థకత ఉండే నిమిత్తం సంగ్రహ సూచీ, ఎంపిక సూచీ మొదలైన నూతన ప్రయోగాలు చేయవలసిందే. తప్పదు. బ్రిటన్‌లో సహాయ గ్రంథ పాలకుల సంఘానికి చెందిన జేవ్స్‌గ్రాన్వాతన ''కటింగ్ కేటలాగింగ్ కాస్ట్స్ 50% '' అనే పుస్తకంలోపై ఆంశాలపై అనేక సూచనలు చేశాడు. సూచీ ప్రయోజనం నూటికి నూరుపాళ్ళు సిద్ధించాలనుకునేవారు ఈ పుస్తకాన్ని చదవక తప్పదు.

## సంగ్రహ సూచి

సహజంగా నియమాల ప్రకారం తయారుచేసే సూచీలో కొన్ని వివరాలను తగ్గించి సూచీ చేయడం సంగ్రహ సూచి అంటారు. ప్రధానంగా ఇందులో పద్దులో ఇచ్చే వివరాలను తగ్గించడం జరుగుతుంది. అంటే—

1 శీర్షికలో గ్రంథకర్త పేరు సూచీ నియమాల ప్రకారం పూర్తిగా రాయాల్సిందే. గ్రంథసూచీలో గ్రంథకర్త పేరు, ఇంటి పేరు వీలైనంత సంగ్రహంగా ఇవ్వవచ్చు.
ఉదా:— వెంకటచలం, గుడిపాటి—కి బదులుగా

చలం,—అని రాయవచ్చు .

2 అర్థం పోకుండా గ్రంథనామాన్ని వీలైనంత తగ్గించవచ్చు.

ఉదా:— శ్రీమదాంధ్ర మహాభారతం—కు బదులుగా

ఆంధ్రమహాభారతం—అని రాయచ్చు.

ఎ.ఎ సి.ఆర్—2లో ఇంకా మరికొన్ని సూచీ నియమాలలో గ్రంథనామం పిదప గ్రంథకర్త పేరు రాసే పద్ధతి వాడుకలో ఉంది. సంగ్రహ సూచీలో గ్రంథకర్త పేరు ఇచ్చే పద్ధతికి స్వస్తి చెప్పవచ్చు.

3 కొన్ని గ్రంథాల ప్రచురణ రెండు చోట్ల నుంచి జరగవచ్చు. ఇద్దరు ప్రచురణకర్తలు ఉండవచ్చు. అలాటి సందర్భాలలో ఒకచోటు, ఒక ప్రచురణకర్త పేరు ఇవ్వవచ్చు. అంతేగాక ప్రచురణకర్త పేరును సాధ్యమైనంత తగ్గించి ప్రచార నామాన్ని ఇవ్వవచ్చు. ఉదా:—

వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్‌సన్సుకు బదులు "వావిళ్ల" అని మాత్రం రాస్తే సరిపోతుంది.

అయితే ఇలాటి సంగ్రహనామాల జాబితా గ్రంథాంతంలో అనుబంధంలో ఇవ్వాల్సి ఉంటుంది.

4 సూచీ నియమాలకు పుటాది వివరాలు సుమారు పది అంశాలదాకా ఉంటాయి సంగ్రహ సూచీలో అన్నీ అనవసరం. పుటలకు 'పు' అనీ, సైజు 'సెం.మీ' అనీ రెండు మూడంశాలు మాత్రం సంగ్రహ రూపంలో ఇస్తే సరిపోతుంది.

5 గ్రంథాన్ని గురించే స్వల్ప వివరణ (నోట్స్) దాదాపు పరిహరింపవచ్చు. మొత్తంమీద సంగ్రహ సూచీని నియమాలు అనుసరించి చేయాల్సిందే. విజ్ఞత పాటించి కొన్ని వివరాలు తగ్గించవచ్చు. అందే—అందువలన—

1 సూచీ త్వరగా పూర్తవుతుంది.

2 బాగా ఉపయోగ పడుతుంది.

3 ఖర్చు కలసి వస్తుంది.

4 సూచీ స్థలం కలసి వస్తుంది.

5 ముద్రించడానికి వీలుగా ఉంటుంది.

కనుక చివరగా తెలియజేసే దేమంటే—పెద్ద గ్రంథాలయాలు, పరిశోధనా గ్రంథాలయాలు, ప్రత్యేక గ్రంథాలయాలు—సూచీలో పూర్తి వివరాలు తయారు చేయాల్సిందే. నియమాలు తు.చ. తప్పక పాటించవలసిందే. అయితే సాధారణ గ్రంథాలయాలు, పౌర గ్రంథాలయాలు, శాఖా గ్రంథాలయాలు—సంగ్రహ సూచీని సిద్ధం చేసుకుంటే—ఎంతో ప్రయోజనకరంగా ఉంటుంది. ఆశించిన ప్రయోజనం నెరవేరుతుంది.

## ఎంపిక సూచి

గ్రంథాలయసూచి బలుపు తగ్గించే నిమిత్తం కొన్నిచిన్న గ్రంథాలకు, కొన్నిగ్రంథాలకు మాత్రమే, సూచీ కార్డులు చేయడం, ఉపపద్దులు తగ్గించడం, ఎంపిక విధానంలో సూచీ కార్యక్రమాన్ని జరగడాన్ని ఎంపికసూచీకరణ (సెలక్టివ్ కేటలాగింగ్) అంటారు. ఎంపిక సూచీలో—

1 పెద్ద ఉపయోగం లేదనుకునే చిన్న పుస్తకాలకు అన్ని పద్దులు చేయడం తగ్గించవచ్చు.

2 కర పత్రాలకు పద్దులు అవసరం లేదు.

3 చిత్రకారుడు ఎంతో ప్రసిద్ధి గలవాడైతే తప్ప, అంతేగాక పుస్తకంలో చిత్రాలు చాల అధికంగా ఉంటే తప్ప చిత్రకారునికి ఉపపద్దు చేయరాదు. మిగతా ఉపపద్దుల విషయమూ అంతే.

4 గ్రంథమాల పద్దులు, నిర్దేశికపద్దులు సాధ్యమైనంత వరకు తగ్గించ వచ్చు.

5 విశ్లేషణాత్మక పద్దుల అవసరంలేదు.

6 ఇతర భాషలవి, ఇతరదేశాలనుంచి —ఉచితంగా వచ్చే పుస్తకాలను పరిశీలనజరిపి —అవసరం అనుకుంటేనే కార్డులు చేయాలి.

7 ముఖ్యంగా విషయ శీర్షికల విషయంలో బాగా పొదుపు పాటించాలి. ఆచితూచి ఈ పద్దులు చేయాలి.

8 పునర్ముద్రణకు సూచీచేయడం మానవచ్చు.

9 కల్పనా సాహిత్యానికి కార్డులు చేయడం వృథా శ్రమ. "క" అనే ఒక గుర్తు పెట్టి ఒక ప్రదేశంలో ఉంచడం మంచిది. విదేశాలలో కల్పనా సాహిత్యానికి ప్రవేశ సంఖ్యలు కూడా వెయ్యరట! పెద్ద గ్రంథాలయాలు, పరిశోధనా గ్రంథాలయాలు, ప్రత్యేక గ్రంథాలయాలు పూర్తి నియమాల ప్రకారం తమ సూచీలను చేయాల్సిందే. దీనికి రాజీలేదు. చిన్న గ్రంథాలయాలలో, సాధారణ గ్రంథాలయాలలో ఎంపిక సూచీ తయారు చేయవచ్చు. ఇందు ఒక ఇబ్బంది లేక పోలేదు. గ్రంథాలయంలోని పఠన సామగ్రిలో కొంత భాగానికి సూచీ పత్రాలు చేయకపోవడమే దీని లక్ష్యంగనా. అందు చేత సూచీ కర్త ఇష్టాయిష్టాలపై, అభిరుచులపై అతని విజ్ఞాన పరిధి పరిమితికి లోబడి ఈ సూచీ ఉండవలసి వస్తుంది. కనుక ఒక్కొసారి సూచీ చేయవలసిన పుస్తకం సూచీకర్త దృష్టినుంచి దూరమైతే చదువరికి నష్టం జరక్క తప్పదు. కనుక ఒకో సారి ఈ గ్రంథాలయంలో ఏ పుస్తకం ఉందో లేదో తెలుసుకోడానికి చదువరి విఫలుడౌతాడు. అలాటి ప్రమాదాలు జరక్కుండా ఉండాలంటే ఎంపిక సూచీ పద్ధతి పాటించ దలచుకున్నవారు ఒక నిర్దిష్ట విధానం—గ్రంథాలయ స్థాయి పూర్తిగా సమీక్షించాక నిర్ణయించుకుంటే పై లోపాలు తగ్గించుకోవచ్చు.

## కొన్ని ప్రయోగాలు

సంగ్రహసూచి, ఎంపికసూచిపద్ధతులు చిరకాలంగా ప్రచారంలోఉన్నా వీటిని ఆచరణలో చూపడానికి గ్రంథాలయాలు సాహసం చూపలేక పోయాయి. వాస్తవానికి ఈ రెండు విధానాలు పెద్ద గ్రంథాలయాలు, జగత్ప్రసిద్ధ గ్రంథాలయాలకు నిర్దేశించినవి కావు. అయినప్పటికీ ప్రపంచలో పెద్దదీ షుమారు 70 కోట్ల గ్రంథ సంపదగల వాషింగ్‌టన్‌లోని లైబ్రరి ఆఫ్ కాంగ్రెస్ గ్రంథాలయంలో 1951—1963 మధ్యకాలంలో సంస్కరణ రహితంగా పేరుకు పోయిన లక్షలాది గ్రంథాలను సూచీకరించడంలో సంగ్రహ సూచీవిధానం అనుసరించి అనతి కాలంలో అంటే 1963 ఆగస్టునాటికి సూచీ కరణ పూర్తిచేసింది. ఇలాంటి పరిస్థితి ఏర్పడితే ఏళ్ల తరబడి "ప్రాసెసింగ్" పేరుతో గదుల్లో భద్ర పరిచేకంటే— ఏదో ఒక రీతిలో సూచీ సిద్ధాంతం చేసి పుస్తకాలు, సూచీ — చదవరుల ముందుంచడం కంటే గ్రంథపాలకులు చేసే మంచిపని మరొకటి ఉండబోదు.

తుదకు మనవి చేసేదేమిటంటే సంగ్రహసూచీ, ఎంపిక సూచీ తయారు చేయడానికి ప్రత్యేక నియమాలంటూ ఏమీలేవు. అమల్లో ఉన్న నియమాలను అవసరం మేరకు తగ్గించి,విజ్ఞత పాటించి ఈ సూచీల్లో ఒకదాన్ని తయారు చేసుకోవచ్చు. ఏ పద్ధతి ఎంచుకున్నా సూచీకర్తకు చిత్తశుద్ధి, చదవరుల అవసరం ఎడల సానుభూతి, గ్రంథాలయపరిధి, ఆర్థిక వనరులు దృష్టిలో ఉంచుకొని చేయాలనేదే ముఖ్యంగా గుర్తుంచుకోవాలి.

— 0 —

# 16 సూచీ దర్శకాలూ — అమరిక

కార్డుల రూపంలో సూచీ అనేది ఇప్పటికీ మన దేశంలో కొత్తగానే ఉంటుంది. మన చదువరులు ఇంకా కార్డు సూచీని ఉపయోగించడానికి అలవాటు పడలేదు. అందుచేత ఎంత బాగా సూచీ తయారు చేసినా అది ఏదృష్టితో తయారైనదో, ఎలా ఉపయోగించాలో చెప్పవలసిన అవసరం ఉంది. అందుకు ముఖ్యంగా ఒక ప్రధాన పద్దు, ఒక విషయపు పద్దు, ఒక గ్రంథనామపు పద్దు నమూనాలను పెద్ద సైజులో బోర్డుపై రాయించి సూచీ పేటికలకు అతి చేరువలో ఉంచాలి. అంతేగాక వీటిని గ్రంథాలయం తాలూకు కరదీపికలో కూడా ప్రచురించాలి. బోర్డులోని ప్రతి అంశం ప్రయోజనం కూడా వివరించాలి.

మరొక బోర్డు ఈ తీరుగా ఉండాలి.

- గ్రంథాలయసూచీ -

1 గ్రంథకర్త, గ్రంథనామం, విషయం తాలూకు కార్డులన్నీ అక్షర క్రమంలో, నిఘంటువు నమూనాలో అమర్చి ఉన్నాయి

2 మీకు గ్రంథకర్త, గ్రంథనామం, విషయం – ఏ అంశం తెలిసినా అక్షర క్రమంలో చూడండి – వివరాలు తెలుస్తాయి

3 విషయ శీర్షికలన్నీ నిర్దిష్ట క్రమంలో ఉన్నాయి. సాధ్యమైనంత వరకు నిర్దిష్ట విషయమే చూడండి. కంప్యూటర్ గురించి తెలుసు కోవాలంటే కంప్యూటర్ అనే శీర్షిక చూడండి

ఈ అంశాలతోబాటు చదువరి గ్రంథాలయం అనుసరించిన <u>వర్గీకరణ</u> విధానంతో కొంత పరిచయం ఏర్పరచుకోవాలి. అందుకోసం వర్గీకరణ విధానం తెలియజెప్పే

చార్టును కూడ ఈ ప్రదర్శనలో చేర్చాలి. ఆంధ్రప్రదేశ్ లోని గ్రంథాలయాల్లో దశాంశ వర్గీకరణ పథకం అమలులో ఉన్నందున — ఆ తాలూకు చార్టు నమూనా ఈ తీరుగా ఉంటుంది.

- దశాంశ వర్గీకరణ పథకం -

**000 - 099** సాధారణ గ్రంథాలు — సాధారణంగా ఏ విషయానికి స్పష్టంగా చెందని పత్రికలు, పత్రికా రచన, రాత ప్రతులు, అరుదైన గ్రంథాలు ఇందుంటాయి.
ఉదా : 080 సంకలన గ్రంథాలు

**100 - 199** తత్త్వ శాస్త్రం — అధి భౌతిక తత్త్వ శాస్త్రం, మనస్తత్వ శాస్త్రం, జ్యోతిష శాస్త్రం, తర్క, నీతి శాస్త్రాలు ఇందుంటాయి.
ఉదా : 170 నీతి శాస్త్రం

**200 - 299** మతం — ప్రపంచ మతాలు, మత గ్రంథాలు ఇందుంటాయి.
ఉదా : 294.5 హిందూ మతం

**300 - 399** సామాజ శాస్త్రాలు — సాంఘిక శాస్త్రం, గణాంకాలు, రాజనీతి, ఆర్థిక, న్యాయ శాస్త్రాలు, సాంఘిక సంక్షేమం, విద్య, జానపదాలు మొ॥ అంశాలిందుంటాయి.
ఉదా : 370 విద్య

**400 499** భాష — ప్రపంచ భాషల జాబితా అవి, నిఘంటువు, వ్యాకరణం అలంకార శాస్త్రాలు, చంధస్సు ఉంటాయి.
ఉదా : 425 ఆంగ్ల వ్యాకరణం

**500 - 599** విజ్ఞాన శాస్త్రాలు — గణిత, భౌతిక, రసాయన, భూవిజ్ఞాన, జీవ, జంతు, వృక్ష శాస్త్రాలు ఇందుంటాయి.
ఉదా : 590 జంతు శాస్త్రము

**600 - 699** సాంకేతిక విజ్ఞానం — వైద్య, నిర్మాణ, వ్యవసాయ శాస్త్రాలు, గృహ విజ్ఞాన శాస్త్రం, పరిశ్రమలు, భవనాల నిర్మాణం ఇందుంటాయి.
ఉదా : 610 వైద్య శాస్త్రం

**700 - 799** కళలు — వాస్తు, శిల్ప, చిత్ర కళలు, ముద్రణ, అద్దకాలు, సంగీతం, వినోదం ఇందుంటాయి.
ఉదా : 780 సంగీతం

**800 - 899** సాహిత్యం — వివిధ సాహిత్యాల కావ్యాలు, నాటికలు, నవలలు, కథలు, వ్యాసాలు, ఉపన్యాసాలు ఇందుంటాయి.
ఉదా : 894.8273 తెలుగు నవలలు

**900 - 999** భూగోళ శాస్త్రం — యాత్రలు, జీవిత చరిత్రలు, దేశ చరిత్రలు ఇందుంటాయి.
ఉదా : 915 ఆసియా భూగోళ శాస్త్రం, యాత్రలు
920 జీవిత చరిత్రలు
954 భారతదేశ చరిత్ర

**జీవిత చరిత్రలు :** వ్యక్తుల జీవిత చరిత్రలు, జీవిత చరిత్రగల వ్యక్తుల అక్షర క్రమంలో అమర్చి ఉంటాయి.

**నవలలు : కథలు :** రచయిత పేర్ల అక్షర క్రమంలో అమర్చి ఉంటాయి.

**ముఖ్య సూచన :** మీకు పుస్తకం కనిపించకపోతే నిరాశ చెందకండి. లైబ్రేరియన్‌ను అడగండి. మీకు సాయపడతారు.

ఇవన్నీ చదువరి గ్రంథాలయ సూచీని సరిగా ఉపయోగించడానికి తోడ్పడతాయి. అక్షర క్రమంలో ఉన్న నిఘంటువును సరసగా చూచినా అనేక విషయాలు తెలుస్తాయి. కొందరు పండితులకు నిఘంటువులు చదవటం కూడ ఒక అలవాటు. ఒక సరదా. అలాగే నిఘంటు సూచీని కూడ అక్షర క్రమంలోపరిశీలిస్తూ వెళ్తే అనేక విషయాలు తెలుసుకోవచ్చు. రచయితలు, పుస్తకాలు, పుస్తక మాలలు, విషయాలుగల ఒక విచిత్ర ప్రపంచాన్ని చూడవచ్చు. అలౌకిక ఆనందాన్ని అనుభవించవచ్చు.

## కార్డుల అమరిక

పై విధంగా కార్డులు ఒక అనుభూతిని ప్రసాదించాలంటే వాటి అమరిక ఎంతో క్రమ బద్ధంగా ఉండాలి. అమెరికన్ గ్రంథాలయ శాస్త్రవేత్త ఛార్ల్స్ ఎమికట్టర్ 1904లోనే తన నిఘంటు సూచీ నియమాలలో అమెరికాకు సంబంధించిన కొన్ని మార్గ దర్శక సూత్రాలను పొందు పరిచాడు. తదుపరి 1942లో అమెరికన్ గ్రంథాలయ సంఘం అమెరికాకు సంబంధించిన నియమాలను రూపొందించి ప్రచారం లోకి తెచ్చింది. ఇవే నేడు విశ్వ వ్యాప్తంగా అమలులో ఉన్నాయి. వీటితోబాటు మన దేశంలో డాక్టర్ రంగనాథన్ తన వర్గీకృత సూచీకరణ కోసం కొన్ని సూత్రాలు ఏర్పరచారు. తెలుగు బాషకు వీటిని యథాతథంగా అమలు పర్చ వీలులేదు. మన అవసరం, సంప్రదాయాన్ని బట్టి చేర్పులు, మార్పులు చేయవలసిందే.

సూచీకరణ చేయడంలో శ్రద్ధ కార్డులను అమర్చడంలో గూడ చూపాలి. లేకపోతే ఒక చోట ఉండవలసిన కార్డులు మరొక చోట ఉంటే, చదువరికి అవసరమైన సమాచారం లభించక ఎంతో ఇబ్బంది పడవలసి వస్తుంది. అమరికలో గ్రంథకర్త, గ్రంథనామం, విషయం— ఈ మూటిని వేరు వేరు పేటికలలో అమర్చడం మంచిది. చిన్న గ్రంథాలయాలలో అన్నీ ఒకే పేటికలో అమర్చవచ్చు. అయితే "వీరేశలింగం, కందుకూరి" అను పేరు ఒక రచనకు గ్రంథకర్తగా, ఒక పుస్తకానికి నామంగా, ఒక పుస్తకంలోని విషయానికి పేరుగా రావచ్చు. అప్పుడు ఆ కార్డు స్వభావాన్ని బట్టి అమర్చ వలసి ఉంటుంది.

అమరిక రెండు తీరులుగా ఉంటుంది. ఒక్కొక్క అక్షరాన్ని వరుసగా తీసుకొని అకారాదిగా అమర్చడం ఒక పద్ధతి (లెటర్ బై లెటర్), ఒక పదాన్ని ప్రమాణంగా

తీసుకొని, వరుసగా అకారాది క్రమంలో అమర్చడం మరొక పద్ధతి (వర్డ్ బై వర్డ్) ఈ రెంటిలో రెండవ విధానమే బహుళ ప్రయోజన కరమని అనుభవజ్ఞుల అభిప్రాయం. అంతేకాదు. తెలుగు భాషలోని నిఘంటువులు, పదప్రయోగ సూచికలు, అనుక్రమణికలు, పద బంధాలు, మరేవి అమర్చాలన్నా అక్షర క్రమాన్నే పాటించడం ఆనవాయితీ. అందుచేత ఈ విధానమే పాటించడం సబబు. అయితే అక్షర క్రమం అమరిక, పదక్రమం అమరికలోని తేడాలను ఈదిగువ సోదాహరణంగా ఇవ్వడం జరిగింది.

| అక్షర క్రమం | పదక్రమం |
|---|---|
| వెంకట అప్పారావు | వెంకట అప్పారావు |
| వెంకట పతి | వెంకట పతి |
| వెంకటప్పయ్య | వెంకట రామయ్య |
| వెంకట రామయ్య | వెంకట సుబ్బయ్య |
| వెంకట సుబ్బయ్య | వెంకటప్పయ్య |

శీర్షికల అమరిక

నిఘంటు సూచీలో అన్నిరకాల పద్దులు అక్షర క్రమంలో అమర్చి ఉంటాయి. ఈ గ్రంథంలో ఉదహరించిన పద్దుల నుంచి కొన్ని కార్డులు ఎంపిక చేస్తే వాటి అమరిక నమూనా ఈ తీరుగా ఉంటుంది.

| | |
|---|---|
| అటవీ శాస్త్రం | విషయం |
| అట్లాసులు | విషయం |
| అప్పారావు, గురజాడ | రచయిత |
| అనంతం | గ్రంథనామం |
| అయ్యంకి లైబ్రరీ అవార్డు | జ్ఞాపిక (మెమెంట్) |
| ఆంధ్రజ్యోతి | పత్రికపేరు |
| ఆంధ్రప్రదేశ్ అధికార భాషా కమీషన్ | ప్రభుత్వ సంఘం |
| ఆంధ్రప్రదేశ్ పాలనా నివేదిక 1967–68 | ధారావాహిక(సీరియల్) |
| ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం | స్వచ్ఛంద సంఘం |
| ఆంధ్రప్రభ దినపత్రిక | మైక్రోఫిల్మ్ |
| ఈశ్వరరావు, సెటి | సంపాదకుడు |

| | |
|---|---|
| కన్యాశుల్కం | గ్రంథనామం |
| కాత్యాయనీ విద్మహే | సంకలన కర్త |
| కుమారస్వామి | స్వరకర్త |
| కురాను | గ్రంథనామం |
| కోదండ రామిరెడ్డి, మరుపూరు | సంక్షిప్తీకరణ |
| గోపాలకృష్ణయ్య, వడ్లమూడి | తొలిపలుకు రచయిత |
| కౌసల్యాదేవి, అరికపూడి | రచయిత్రి |
| కౌసల్యాదేవి, కోడూరి | రచయిత్రి (వివాహిత నామం) |
| గ్రంథాలయ సర్వస్వము | పత్రిక |
| జిల్లా కేంద్ర గ్రంథాలయం | ప్లాను |
| తిరుపతి శాస్త్రి, దివాకర్ల చూడండి | రచయిత—జంట కవులలో ఒకరు |
| తెలుగులో రెఫరెన్సు గ్రంథాలు | గ్రంథనామం |
| పిల్లల పాటలు | గ్రామఫోను |
| మహాప్రస్థానం | ఆడియో క్యాసెట్ |
| బంగోరె | వ్యాఖ్యాత |
| బాపు | చిత్రకారుడు |
| భారతదేశం. సమాచార ప్రసార మంత్రిత్వశాఖ: ప్రచురణ విభాగం | రచయితగా ప్రభుత్వం |
| బైబిలు | గ్రంథనామం |
| లత | కలంపేరు |
| లల్లాదేవి | కలంపేరు |
| లాజరస్, జి. | అనువాదకుడు |
| విష్ణు చిత్రీయము చూడండి | మార్గసూచిక |
| వేంకటరావు, నిడదవోలు | అనుబంధకర |
| వేంకట సుబ్బశాస్త్రి, మడిపల్లి | టీకాకర్త |
| వేదాలు— ఋగ్వేదం | విషయం |
| సంజీవదేవ్ | లేఖా రచయిత |
| సింగ్ డి. పి. | మావలేఖకుడు |
| సుబ్రహ్మణ్య భట్ పన్నాల | సంకలనకర్త |

| | |
|---|---|
| సుబ్రహ్మణ్యం, సూరాబత్తుల | అనువాదకుడు |
| సూర్యనారాయణ శాస్త్రి, వెంపరాల | టీకాకర్త |
| హైదరాబాదు నగర గ్రంథాలయ సంస్థ రజతోత్సవాలు | విశేష సంచిక |

ఈ సందర్భంలో ఒకటి, రెండు అంశాలు గమనికలో ఉంచుకోవాలి.

1 సుబ్బయ్య గొ. వెం., రామమూర్తి జి. వి మొదలైన పేర్లను విస్తరించడానికి అనగా— పూర్తిగా కార్డుపై రాయడానికి ప్రయత్నించాలి.

2 టి. ఎన్. ఎస్. కె. వి. మొదలైన పొడి అక్షరాలకు పూర్తి పేర్లు సేకరించగలిగితే మంచిదే. లేకుంటే వాటిని అదే రూపంలో అక్షర క్రమంలో అమర్చాలి.

3 కవిత్రయం, తిరుపతి వెంకట కవులు మొదలైన పదాలను అమరికలో ఒకే పదంగా స్వీకరించాలి.

గ్రంథాలయసూచీ తయారు చేయడం వ్యయ, ప్రయాసలతో కూడుకున్న పని. అందుకు దీక్ష, దక్షత అవసరం. వీటికి తోడు సూచీ వినియోగానికి సంబంధించి తగినంత ప్రచారమూ అవసరమే. బంగారు పళ్ళెనికి కూడా గోడ చేర్పు అవసరమే గదా! లేకుంటే సూచీ వలన ఆశించినంత ప్రయోజనం చేకూరదు.

— 0 —

# 17 సూచీకరణ విభాగం

ప్రతి గ్రంథాలయం సూచీ కరణ విభాగం ఏర్పరచడం సాధ్యంగాదు. జిల్లా కేంద్ర గ్రంథాలయాలు, కళాశాల గ్రంథాలయాలలో గ్రంథపాలకుని నేతృత్వంలో ఒకరిద్దరి సహాయకులతో సాంకేతిక పని కొనసాగించవచ్చును. అయితే ఈ విభాగంలో పనిచేసే సిబ్బందిని తరచు మార్చరాదు. అవగాహన, అనుభవం, ఓర్పు ఉన్న వారినే ఈ విభాగంలో నియమించాలి. తగినంతమంది సిబ్బంది నియామకం జరిగే సందర్భాలు తక్కువ. అయితే సిబ్బంది ఎందరు ఉన్నా తృప్తిగా పని చేసుకుంటూ పోవడం అలవాటు చేసుకోవడం విజ్ఞుల లక్షణం.

## ప్రామాణిక పట్టికలు

ప్రత్యేక విభాగం ఉన్నా లేక పోయినా, తగినంతమంది సిబ్బంది ఉన్నా లేకపోయినా, సూచీ ప్రయోజన కరంగా ఉండాలన్నా, సిబ్బంది మారుతున్నా సమత్వం సాధించాలంటే ఈ దిగువ ఉదహరించిన ప్రామాణిక పట్టికలు విధిగా అవసరం.

1 రచయితల పూర్తి పేర్లు, ప్రచార నామాలు, స్థిరీకరించిన నామాలు, జననమరణ తేదీలు
2 అసలు పేర్లు, మారు పేర్లు, కలం పేర్లు
3 అసలు రూపాలు, సంక్షిప్త రూపాలు
4 విషయ శీర్షికల జాబితా
5 ప్రచురణ కర్తల ప్రచారనామాలు, పూర్తి చిరునామాలు
6 మార్గసూచికల జాబితా
7 నమూనా పద్దులు

వీటిని ప్రతి గ్రంథాలయం వేరువేరుగా చేయడం వృధా శ్రమ. పైగా ఒక అవ్యవస్థ ఏర్పడే ప్రమాదం ఉంది. కనుక రాష్ట్రప్రభుత్వ స్థాయిలో తయారు చేయించి

రాష్ట్రవ్యాప్తంగా అన్ని స్థాయిల గ్రంథాలయాలలో అమలు పరిచేట్లు చూడడం మంచిది. అయితే ప్రతి గ్రంథాలయం స్వల్పమైన మార్పులు స్థానిక అవసరాల నిమిత్తం చేసుకోవచ్చు. అది యాదృచ్ఛికం.

## రెఫరెన్సు గ్రంథాలు

ప్రతి సూచీకరణ విభాగంలో ఈ దిగువ ఉదహరించిన రెఫరెన్సు గ్రంథాలు శాశ్వత ప్రాతి పదికపై ఉండాల్సిన అవసరం ఉంది.

1 ఆంధ్ర శబ్దరత్నాకరము. 3సంపు. చెలమ చర్ల రంగా చార్యులు
2 జాతీయ గ్రంథసూచి— మరికొన్ని సూచీలు
3 విద్యార్థి కల్పతరువు — 2వ భాగం. ఇందు తెలుగు రచయితలు పరిచయ వివరాలుకలవు
4 గ్రంథాలయ వర్గీకరణ విధానం 19వ. పరిష్కరణను అనుసరించి తయారు చేసినది
5 గ్రంథాలయ సూచీకరణ ఎ. ఎ. సి. ఆర్—2ను అనుసరించి తయారు చేసినది
6 గ్రంథాలయంలో ఆంగ్ల భాషలో, హిందీ భాషలో గ్రంథాలుంటే ఆయా భాషల లోనే పైన సూచించిన రెఫరెన్సు గ్రంథాలు సేకరిస్తేనే ప్రయోజన కరంగా ఉంటుంది. వీటితోబాటు స్కేలు, పుస్తకాలు సూచించే చార్టులు కూడ ఈ విభాగంలో పొందు పరచడం అవసరం.

## పర్యవేక్షణ

సూచీ తయారు చేశాక తదుపరి పర్యవేక్షించక పోతే అది నిరుపయోగం అయ్యే ప్రమాదముంది. సూచీని తరచు చదువరులు ఉపయోగిస్తారు. యాదృచ్ఛికంగానో, మనఃపూర్వకంగానో కొందరు చదువరులు కార్డులస్థానాన్ని, ట్రేలస్థానాన్ని మార్చే అవకాశాలు లేకపోలేదు. కొత్తకార్డులు ప్రవేశపెట్టేప్పుడు అక్షర క్రమం తప్పిపోయే సందర్భాలూ లేకపోలేదు. అంతేగాక చదువరులు పుస్తకాలు పోగొట్టినపుడు, వాటికి నష్టం కలిగించినపుడు పుస్తకం ఖరీదు వసూలు చేసి, పుస్తకాన్ని రద్దుచేసినపుడు ఆ పుస్తకంపై చేసిన కార్డులను కూడ సూచీనుంచి తొలగించ వలసి ఉంటుంది. అంతేగాక పుస్తకాలు సరిచూచినపుడు, కొన్ని పుస్తకాలు కనిపించకపోతే — అవి

శాశ్వతంగా లభించవని దృఢ పరిస్తే ఆ పుస్తకాల తాలూకు కార్డులను సూచీనుండి వెంటవే తొలగించవలసిన అవసరం ఉంది. కనుక కార్డుల అమరిక, క్రమంపై సూచీ విభాగసిబ్బంది తరచు పర్యవేక్షిస్తూ సూచీని సాధ్యమైనంత తాజాగా, సాధ్యమైనంత భద్రంగా ఉంచవలసిన బాధ్యత గ్రంథాలయ సిబ్బందిపైన ఉంది.

## సూచీకర్త

గ్రంథాలయంలో సూచీకరణ కార్యక్రమాన్ని నిర్వహించేవ్యక్తిని సూచీకర్త, సూచీ కారుడు (కేటలాగర్) అంటారు. సూచీకర్తకు కేవలం సూచీ నియమాలు తెలిసి ఉన్నంత మాత్రాన చాలదు. అతనికి విజ్ఞాన ప్రపంచంతో పరిచయం, గ్రంథాలయం అంటే అభిమానం, చదువరులంటే సానుభూతి ఉండాలి. అసలు గ్రంథాలయవృత్తే— మిగతా వాటికంటే భిన్నమయింది. గ్రంథాలయోద్యోగం సేవాధర్మంతో కూడినది. విశిష్టమైనది. నిర్వాహక కార్యాలయాలలో పని చేసే సిబ్బందికి దీనికి ఎక్కడా పోలికలేదు. ఇచ్చట పనిజేసే ఉద్యోగి— ఉద్యోగం వేరు కాకూడదు. డాక్టర్ రంగ నాథన్ ''ఐ సి గాడ్ ఇన్ లైబ్రరీస్'' అన్నట్లు ఒక తాదాత్మ్యత ఉండాలి. అప్పుడే అతడు చేసేపని జయప్రదం, ఫలప్రదం కాగలదు. ప్రసిద్ధ గ్రంథాలయశాస్త్రవిజ్ఞాని ఎల్. ఎస్. జాస్ట్ సూచీకర్త బాధ్యతలను గురించి ఇలారాస్తారు ''సూచీ కారులు తమ పనిలో పొలు మాలిక లేకుండా శ్రద్ధగా. ఖచ్చితంగా చిన్నవిషయాలకు గూడ తగి నంత ప్రాముఖ్యాన్నిచ్చి పొందికతో నిరంతరం ఒకేవిధంగా సూచీ కార్యక్రమాన్ని క్రమ బద్ధంగా నిర్వహించాలి.'' ఈ సందర్భంలోనే నిర్లక్ష్యం, అశ్రద్ధ, సోమరితనం ముప్పిరిగొన్న సూచీకర్తలకు ఇలా ఒక వార్నింగ్ కూడ ఇచ్చారు. సూచీలో శబ్ద స్వరూపాలలో సమరూపత, విరామ చిహ్నాలు, విరామాలు నిర్దేశించిన చోటఇవ్వాలి. అలా చేయక సూచీలోని ''పదాలను తారుమారు చేసినా, వాటి అక్షరక్రమాన్ని మార్చినా, సూచీనియమాలను ఉల్లంఘించినా — అదిఇల్లు తగల బెట్టడం, దొంగ తనం (ఇంకా చెప్పాలంటే) దేశద్రోహం లాంటి నేరాలతో సమానం'' ఇంతకంటె తీవ్రంగా సూచీకర్త బాధ్యతలను గురించి చెప్పినవారు లేరు. సూచీ నిర్మాణం వర్గీ కరణ అంతసులభం కాదు. చాలా వ్యయ ప్రయాసాలతో కూడు కున్నది. అందుచేత సూచీకర్త తాను చేసేపని చదువరులకు ఉపయోగించాలి— లేదా వారికి ఉపయోగించే

విధంగా తాను సూచీని సిద్ధం చెయ్యాలి అనే దీక్షతో, నిష్ఠతో ఉన్నపుడే ఈపనికి సార్ధకత చేకూరు తుంది. ఒక్కోసారి సూచీ ఎంత బాగా ఉన్నా చదువరులు ఉప యోగించుకోరు. కారణం సూచీ ఉపయోగించే విధానం, ఉపయోగం వారికి తెలియక పోవడమే. అందుచేత ఈ రెండు అంశాలను గురించి కూడ చదువరులకు చెప్పాల్సిన బాధ్యత గ్రంథాలయ సిబ్బందిపై ఉంది.

— O —

# 18 సూచీకరణలో ఆధునిక విధానాలు

ఈ గ్రంథారంభంలో ఇచ్చిన సాంకేతిక పదవివరణ పట్టిక చూస్తే— ఇటీవల గ్రంథాలయ రంగంలో ముఖ్యంగా సూచీకరణ, సమాచార ప్రసార రంగంలో వస్తున్న మార్పులను ఊహించుకోవచ్చు. ఈ మార్పులు అభివృద్ధి పొందిన అమెరికా, బ్రిటన్, సోవియట్ యూనియన్ వంటి విదేశాలలోనేగాక అభివృద్ధి చెందుతున్న భారతదేశం, మూడవ ప్రపంచ దేశాలలోని ప్రత్యేక గ్రంథాలయాలలో పరిశోధనా గ్రంథాలయాలలో విదేశయాజమాన్యం గల సంస్థలలో కనిపిస్తున్నాయి. అనతి కాలంలో సర్వత్రవ్యాపించే సూచనలు గోచరిస్తున్నాయి.

ఐదేళ్ళనాడు పౌర గ్రంథాలయాలలో టి. వి. లు పెట్టగల మన్న ఆశలేదు. విడియోలు మనకు మించినపని అనుకున్నాము. అనుకోకుండానే అనతి కాలంలో టి. వి. లు విడియోలు, జరాక్సు, ప్లెయిన్ పేపరు కాపీయర్లు, మైక్రోఫిల్ములు, స్లైడ్ ప్రాజక్టర్లు, రికార్డు ప్లేయర్లు, టేపురికార్డర్సు గ్రంథాలయాలలో చేరాయి. మినీ కంప్యూటర్లు, కంప్యూటర్లు, టెలి ప్రింటర్స్, టెలెక్సులు...... మార్గమధ్యంలో ఉన్నాయి. ఈ పరిస్థితిలో విశ్వ వ్యాప్తంగా గల అధునాతన ధోరణులను కొన్ని తెలుసు కొనడం అవసరం.

## 1 కంప్యూటర్ల యుగంలో ప్రవేశం

క్రిందటి శతాబ్దంలో అన్ని రంగాలలో యంత్రాలు ప్రవేశిస్తే— ఈ శతాబ్దంలో ముఖ్యంగా గత ఒకటి రెండు దశాబ్దాలలో— కంప్యూటర్లు దర్శన మిస్తున్నాయి. రాబోయే ఒకటి, రెండు దశాబ్దాలలో— ఈనాడున్న వేగం కొనసాగితే ప్రతి గ్రంథాలయంలో, ప్రతిసమాచార కేంద్రంలో, కార్యాలయంలో కంప్యూటర్ ప్రవేశిస్తుందన డంలో ఆశ్చర్యంలేదు. పరవళ్ళు తొక్కుతూ వస్తున్న విజ్ఞాన ప్రవాహాన్ని, సూర్యకాంతిని ఎవరూ అడ్డుకొనలేరు. ఇది వాస్తవం.

అంకెల కంప్యూటర్లు తొలిసారిగా అమెరికాలో 1950లో దర్శన మిచ్చాయి. పెద్ద పారిశ్రామిక వాడలలో, పరిశోధనా శాలలో అంకెల పనులకు ఇవి బాగా ఉపయోగించేవి.

ఊహించని వేగంలో కంప్యూటర్ అంకెలను కలుపుతుంది. తీసివేస్తుంది. భాగిస్తుంది. హెచ్చిస్తుంది. అంతేగాక కంప్యూటర్లలో సమాచారం కావలసినంత నింపచ్చు. కోరి నప్పుడు అవసరమైనంత సమాచారం తిరిగిపొందవచ్చు.

కంప్యూటర్లలో ఇటీవల చాల మార్పులు వస్తున్నాయి. మార్పులు సూచించేవాటిని రెండవతరం కంప్యూటర్లు, మూడవ తరం కంప్యూటర్లు అంటున్నారు. మనం ఇప్పుడు నాలుగవతరం కంప్యూటర్ల యుగంలో ఉన్నాం. పాతికేళ్లనాడు లక్షరూపా యలు ఖరీదు చేసే కంప్యూటరు నేడు ఇరవై వేలకు లభిస్తోంది. ఆనాడు ఒక గదిని ఆక్రమించిన కంప్యూటరు స్థానంలో ఈనాడు టేబుల్‌పై టైపురైటరులా పెట్టు కునేంత సైజుకు తగ్గిపోయింది. ఇది పెద్దమార్పు.

## సూచీకరణ రంగం

కంప్యూటర్ క్రమంగా సూచీకరణ రంగంలోకి రెండు దశాబ్దాలనాడు ప్రవేశించింది. సూచీకార్డులపైగల సమాచారాన్ని కంప్యూటర్‌లోకి ఎక్కించవచ్చు. ఇటీవల "ఆన్ లైన్ కేటలాగ్" అనేకొత్త పద్ధతి అమలులోకి వచ్చింది. దీని ప్రకారం ఇతర ప్రాంతా లలోని కంప్యూటర్లలో నిలువచేసిన సమాచారాన్ని కూడ వెదుకవచ్చు. టెలికమ్యూ నికేషన్స్ లింక్స్ ద్వారా ఒకడేటా బేస్ మరో డేటా బేస్‌కు కలుపవచ్చు. ఇలాకలిపే విధానాన్ని నెట్‌వర్క్ (NET WORK) అంటారు. జగత్ప్రసిద్ధమైన లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ తమవద్దగల గ్రంథసమాచారాన్ని మార్పిడి విధానంలో ఇతర గ్రంథా లయాలు వినియోగించు కునేందుకు ఒక విధానం రూపొందించింది. దీన్నే యాంత్రిక పఠన సూచి (మెషిన్ రీడబుల్ కేటలాగింగ్) MARC అంటారు. అంతర్జాతీయంగా అంగీకరించిన ప్రమాణాలతో దీనిని తయారు చేస్తారు. 1966లో ఇది ప్రారంభించ బడింది. ఈ విధానం వలన అమెరికాలో పదహారు గ్రంథాలయాలు కంప్యూటర్ ద్వారా గ్రంథసూచీ వివరాలను మార్పిడి చేసుకుంటున్నారు. అవసరమైన సూచీ కార్డులను పునర్ముద్రించు కుంటున్నవి. దీనివలన ఖర్చు తగ్గింది. వేగం పెరిగింది.

1967లో ఈ సూచీ రెండవదశ (MARC-2) ప్రారంభమైంది. యాభై గ్రంథా లయాలు ఈ విధానం వలన ప్రయోజనం పొందుతున్నాయి. రెండవ దశలోని కార్డులో ఎ. ఎ. సి. ఆర్–2 ప్రకారం పద్దునిర్మాణం జరుగుతున్నది. దశాంశ వర్గీ కరణ విధానం, లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ వర్గీకరణ విధాన సంకేతాలు, 'ప్రెసిస్'

విషయ శీర్షికలు కంప్యూటర్‌పై చదవడానికి వీలైన పద్ధతిలో రికార్డు చేసిఉంటాయి. 1969నుంచి బ్రిటీషు జాతీయ గ్రంథాలయసూచి కూడ ఈ పద్ధతిలోనే టేపుల మీద రికార్డు చేయబడి, బ్రిటీషు గ్రంథాలయాలకు పంపడం జరుగుతున్నది. బ్రిటీషు జాతీయ గ్రంథాలయం UK MARC పేరుతో ఈ కార్య క్రమాన్ని నిర్వహిస్తున్నది. ఈ సూచి అంతర్జాతీయ ప్రమాణాలలో పుస్తకాలకు, ధారా వాహి కలకు, దృశ్య శ్రవ్య పరికరాలకు వేరు వేరుగా లభిస్తుంది. క్రమంగా ఈ విధానం నేడు ఆస్ట్రేలియా, కెనడా, ఫ్రాన్స్, స్కాండినేవియా దేశాలు మొదలైన అనేక దేశాలకు పాకింది.

దీన్నింకా అంతర్జాతీయంగా వ్యాపింపజేయటానికి అంతర్జాతీయ గ్రంథాలయ సంఘాల సమాఖ్య సూపర్ మార్క్ పేరుతో అంతర్జాతీయ ప్రమాణాలు సిద్ధం చేయడానికి అంతర్జాతీయ ప్రమాణాల సంస్థ ISO కూడ పూనుకుంది. ఈ విధంగా సూచీకరణ రంగం యంత్రీకరణవైపు కంప్యూటర్ల వైపు మొగ్గింది.
వాస్తవానికిది యంత్రయుగం కాదు.

కంప్యూటర్ల యుగం.

## 2 విశ్వజనీన వాఙ్మయ నియంత్రణ

అంతర్జాతీయ గ్రంథాలయ సంఘాల సమాఖ్య (FID), యునెస్కో సహకారంతో విశ్వ వ్యాప్తంగా గల వాఙ్మయ నియంత్రణకు పూనుకొని విశ్వజనీన వాఙ్మయ నియంత్రణ (యూనివర్సల్ బిబ్లియో గ్రాఫికల్ కంట్రోల్–UBC) 1974లో పథకాన్ని సిద్ధం చేసింది. విశ్వవ్యాప్తంగా లభిస్తున్న గ్రంథ సమాచారం అంతర్జాతీయంగా అంగీకరించిన ఒక నమూనాలో లభించేట్లు చేయడం. అయితే ఈపథకం ఆచారంలోకి వచ్చేసరికి జాతీయస్థాయిలో వాఙ్మయనియంత్రణ పటిష్టం చేయడానికి ప్రయత్నం జరిగింది. జాతీయస్థాయిలో అంతర్జాతీయ ప్రమాణాలు అమలు పరచడం ద్వారా తొలుత ఆశించిన ప్రయోజనం కొంతవరకు నెరవేరడానికి వీలుంది. ఈ పథకం వలన ప్రధానంగా సూచీకరణలో, గ్రంథసూచీ వివరాలు క్రోడీకరించడంలో పునరుక్తి తగ్గు తుంది. స్థాయిపెరుగుతుంది. దీని అంతర్జాతీయ కార్యాలయాన్ని లండన్‌లోని బ్రిటీషు లైబ్రరీలో ఉంచారు. ఇందులో మూలసూత్రం ఏమంటే–జాతీయస్థాయిలో

వాఙ్మయ నియంత్రణ పటిష్టంగా ఉంటే అంతర్జాతీయంగా పటిష్టత సాధించ టానికి వీలుంది. అందుచేత జాతీయస్థాయిలోని కేంద్రాలు వాఙ్మయాన్ని సరిగా కార్డుల మీాదగాని, మాగ్నటిక్ టేపులమీాదగాని, ఇతర రూపాలలోగాని రికార్డు చేసి అంగీకారం కుదుర్చుకున్న దేశాలకు అందించవలసిఉంది. ఈ పనికి తోడుగా సమాఖ్య సూచీ కార్డు నమూనాలను అంతర్జాతీయ గ్రంథసూచీ ప్రమాణ వర్ణన (ఇంట ర్నేషనల్ స్టాండర్డ్ బిబ్లియోగ్రాఫిక్ డిస్క్రిప్షన్ (ISBD ) పేరుతో నిర్ణయిం చింది. అంతేగాక పుస్తకాలకు, పత్రికలకు ISBN, ISSN పేరుతో సంఖ్యాపధకాలను రూపొందించింది.

## 3 విశ్వజనీన వాఙ్మయ లబ్ధి UAP

### (Universal Availability of Publications)

ఈ కార్యక్రమం లక్ష్యం వినియోగదారుల ఆర్థిక, సాంఘిక, విద్యా విషయిక, వ్యక్తి వికాసాల కొరకు వారికి అవసరమైన ప్రచురిత పఠన సామగ్రిని వారెక్కడున్నా, వారు కోరినప్పుడు వీలైనంత సమృద్ధిగా అందజేయడమే. IFLA సంస్థ యునెస్కొ సాయంతో ఈ కార్యక్రమాన్ని చేపట్టింది. రచయితలు, ప్రచురణ కర్తలు, పంపిణీదారులు, గ్రంథపాలకులు, వినియోగదారులు — అంతా కూడ కలసి ఈ కార్య క్రమంలో పాలుపంచుకొని దీని విజయానికి ప్రపంచ మంతా కృషి చేస్తు న్నారు. స్థానిక స్థాయినుంచీ అంతర్జాతీయ స్థాయివరకూ కూడా అన్ని రకాల సంస్థలూ నిర్వహించే వాఙ్మయ ప్రచురణ, సేకరణ, నిల్వల నిర్వహణ కార్య కలాపాలు ఈ ప్రోగ్రాం పరిధిలోకి వస్తాయి.

UAP ఆధ్వర్యం క్రింద నేటి ప్రపంచంలోని ప్రచురిత వాఙ్మయ లబ్ధి అవకాశాలు, వాటికి సంబంధించిన వర్తమాన స్థితులపై అనేక పరిశోధనాత్మక నివేదికలు వెలుగు లోకి వచ్చాయి. 1982 మే నెలలో యునెస్కొ, UAP ల ఉమ్మడి ఆధ్వర్యంలో విశ్వ జనీన వాఙ్మయ లబ్ధి అవకాశలపై పారిస్ నగరంలో ఒక గొప్ప సభ జరిగింది. దీని సమావేశాలలో విశ్వ జనీన వాఙ్మయ ఉత్పత్తి, పంపిణీ, సేకరణ, నిల్వలు, ప్రణాళికలు మొ॥ అంశాలకు సంబంధిచిన మూల సూత్రాలు, విధానాలపై ఫలవంత మైన చర్చలు జరిగాయి. భవిష్యత్తులో ఈ కార్యక్రమం అమలుకు చేపట్ట వలసిన

మార్గ దర్శక సూత్రాలను, జాతీయ అంతర్జాతీయ రంగాలలో మారుతున్న సాంకేతిక విలువలను దృష్టిలో వుంచుకొని కార్యక్రమం విజయవంతంగా కొనసాగించ డానికి చేపట్ట వలసిన వ్యూహాన్ని వివరిస్తూ సభాంతంలో తుది నివేదిక నొకదాన్ని వెలువరించారు.

IFLA వారి UAP అంతర్జాతీయ కార్యాలయం ప్రస్తుతం బ్రిటిష్ లైబ్రరీ లెండింగ్ డివిజన్‌లో ఆశ్రయం సంపాదించి తన కార్యక్రమాన్ని కొనసాగిస్తుంది. అడపా దడపా తమ కార్యక్రమ విశేషాల్ని, సంబంధిత సమాచారాన్ని తెల్పుతూ UAP News Letter మనకు ఈ కార్యాలయం నుంచే దర్శనం ఇస్తూవుంది.

# 4 ప్రచురణ దశలో సూచీకరణ CIP
## (Cataloguing - in - Publication)

కేంద్రీకరణ సూచీకరణ, సూచీకరణ చరిత్రలో వచ్చిన ఒక ముఖ్య మలుపు. ఇది అనేక రూపాల్లో — ఉదా : Cataloguing - in-source Cataloguing - in-Publication, Pre - natal Cataloguing — ప్రచారంలోవుంది. దీనివల్ల గ్రంథాలయ ప్రపంచానికి చదువరులకూ అనేక లాభాలున్నాయి. సూచీకరణ రంగంలో విధిగా జరిగే వర్క్ డూప్లికేషన్ తగ్గించవచ్చు, సామర్థ్యం పెంచవచ్చు. సమ రూపత సాధించవచ్చు, పై పెచ్చు ఈ పద్ధతి అనుసరించడం ద్వారా సూచీకరణ శాఖలో రొటీన్ వర్క్ నుంచి విడుదల అయిన సిబ్బందితో, చదువరులకు అవసరం అయిన ఇతర ముఖ్యమైన సేవలు చేయించుకోవచ్చు.

ప్రచురణ దశలో సూచీకరణ (CIP) అనే ప్రక్రియ, కేంద్ర సూచీకరణ విధానా లన్నింటిలో ప్రముఖమైంది, బాగా ప్రచారంలోకి వచ్చింది కూడా. ఈ కార్యక్రమం పరిధిలోకి అన్నిరకాల ప్రచురణలూ ఉదా : పుస్తకాలు, చలనచిత్రాలు, దేశపటాలు మొ॥ — వస్తాయి. దీన్ని గురించి ఇక్కడ తెలుసు కుందాం.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ (LC) 1971 జూలైలో ఈ కార్యక్రమం చేపట్టింది. ఈ కార్యక్రమంలో భాగంగా దేశంలోని ప్రచురణ కర్తలందరూ, తాము ప్రచరించ బోయే పుస్తకాల గ్యాలీ ప్రూఫుల కాపీలు LCకు పంపుతారు. ఇక్కడ LC లోని సాంకేతిక సిబ్బంది ఆ పుస్తకాలకు సూచీ పద్దులు తయారు చేసి 10 రోజుల లోపల ఈ డేటాను సంబంధిత ప్రచురణ కర్తలకు

పంపుతారు. ఈ సూచీకరణ డేటాను పద్ధు రూపంలో ముఖపత్రం వెనుక భాగాన (కాపీ రైటు పుట మీద) ముద్రిస్తారు. ఇందులో DC, LC వర్గ సంఖ్యలు, LC క్యాటలాగ్ కార్డ్ సంఖ్య, ISBN కూడా ఇస్తారు. లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్‌లో, భౌతిక వివరణ, పుటాది అంశాలు పరిహరించి సూచీకరణ సమాచారాన్ని MARC టేపు పైకి ఎక్కించి, చందాదారులకు, అసలు పుస్తక ప్రచురణ కంటె 6 నెలలు ముందుగానే అందజేస్తారు. ఈ డేటాను అంతిమంగా, పుస్తక ప్రచురణకు కొద్ది రోజులు ముందుగా ప్రచురణ కర్తలు సప్లయి చేసిన బౌండు కాని కాపీతో సరిచూసి, భౌతిక వివరాలు, పుటాది అంశాలు జోడించి తాజా పరుస్తారు. దీన్ని కార్డుల రూపంలో చందాదారులకు కూడా సప్లయి చేస్తారు.

ఈ పద్ధతి ద్వారా ప్రచురించబడిన పుస్తకాలు మార్కెట్ లోకి రావడానికి ముందే, దానికి సంబంధించిన సమాచారం గ్రంథాలయాలకు ఇతర చందా దారులకు అంద జేస్తారు. అయితే ఈ కార్యక్రమం విజయవంతం కావాలంటే ప్రచురణ కర్తలు, LC సాంకేతిక సిబ్బంది స్వచ్ఛంద సహకారం చాల ముఖ్యం.

ఇంగ్లండ్‌లో ఈ కార్యక్రమాన్ని 1977 నుంచీ నిర్వహిస్తున్నారు. CIP పద్దులను బ్రిటీష్ జాతీయ వాఙ్మయ సూచిలోను, BLAISE –LINE లోను కూడా ఇస్తున్నారు. ఈ సమాచారం పుస్తకాల ఎన్నికకు, సంపాదనకు దోహదం చేస్తుంది. రష్యా, తూర్పు జర్మని, డెన్మార్క్ మొ॥ దేశాలలో కూడా CIPని అమలు చేసి లబ్ధి పొందుతున్నారు. ఇందులో వీరు సాధించిన విజయాలు ప్రోత్సాహ కరంగా వుంటున్నాయి.

CIP ద్వారా ముఖ పత్రాల వెనుక సూచీ పద్దులు ముద్రింపబడి వుండటం వలన లేదా పుస్తకాలతో పాటు ముద్రిత సూచీ కార్డులు కూడా సప్లయి చేయబడుట వలన, ఈ కార్యక్రమంలో పాల్గొనే గ్రంథాలయాలు పై పుస్తకాలను చదువరుల వినియో గార్థం సమయం ఏమాత్రం వృథా కాకుండా వెంటనే సర్క్యులేషన్‌లో పెట్టగల్గు తాయి. పైగా ప్రయివేటు సంస్థలు, వ్యక్తులు కూడా ఈ సమాచారాన్ని, సదు పాయాల్ని ఉపయోగించుకొని వారి పఠన సామాగ్రిని సమర్థవంతంగా నిర్వహించు కొంటూ దాని నుంచి అత్యంత సంతృప్తి కరమైన ఫలితాలు పొందగల్గుతారు.

భారతదేశంలో కూడా ఇటువంటి ప్రణాళికను ఒక దానిని త్వరలో అమలు పెట్టారని ఆశిద్దాం.

# 19 సూచీ నిర్మాణానికి సూచనలు

సూచీ నిర్మాణం ఒక కళ. తయారు చేసేవారికి ఓర్పు, నేర్పు, సదవగాహన ముఖ్యంగా ఉండాలి. చదువరి అవసరాలను ప్రధానంగా దృష్టిలో ఉంచుకోవాలి. సూచీ తయారుచేసే సిబ్బంది, ఈ దిగువ విషయాలు దృష్టిలో ఉంచుకోవాలి.

1 ముచ్చటైన రాత

అక్షరాలు కుదిరికగా రాయాలి. ముద్రణలోవలె పదానికి పదానికి మధ్య తగినంత ఎడం ఉండాలి.

2 పూర్తి పేర్లు

కవుల, రచయితల పేర్లు సాధ్యమైనంత వరకు పూర్తిగా రాయాలి.

| ప్రచార నామం | పూర్తి పేరు |
|---|---|
| సీతాపతి, జి.వి. | సీతాపతి, గిడుగు వెంకట |
| కుటుంబరావు, కె. | కుటుంబరావు, కొడవటిగంటి |
| నార్ల, వి. ఆర్. | వెంకటేశ్వరరావు, నార్ల |
| లక్ష్మీకాన్తమ్మ, ఊ | లక్ష్మీకాన్తమ్మ, ఊటుకూరి |

ఏకారణంచేతైనా పూర్తిపేరు తెలియక పోతే లభ్యమౌతున్న పేరును యథాతథంగా ఉపయోగింప వచ్చు.

ఉదా:— కృష్ణారావు, జి. వి.
నరసింహారావు, ఎం. వి. యల్.
రంగనాథన్, ఎస్. ఆర్.

అయితే పేరులో ఒక భాగమైన
శ్రీనివాసరావులో 'శ్రీ'ని

ప్రభాకర శాస్త్రిలో 'శాస్త్రి'ని
రామస్వామి చౌదరిలో 'చౌదరి'ని
గౌరవ వాచకాల పేరుతో తొలగించరాదు. అవి పేరులో ఒక భాగమేనని గుర్తించాలి.

4 పేర్ల ప్రామాణీకరణ

ముద్రిత గ్రంథాలలోనే ఒక గ్రంథకర్త పేరు అనేక తీరులుగా ఉండడం కద్దు. అనువాద గ్రంథాల విషయంలో ఇది మరీ ఎక్కువ. అందుచేత గ్రంథంమీద ఏ పేరున్నా సూచీకర్త శీర్షికకు ప్రామాణిక మైన ఒక సమ రూపాన్ని మాత్రం ఎంచుకోవాలి. అవసరం అనుకుంటే మిగతా రూపాలకు ఆచూకీ పద్దులను ఇవ్వాలి.

| గ్రంథం మీద గల పేర్లు | ప్రామాణీకరణ |
|---|---|
| అక్కిరాజు ఉమాకాంతం | అక్కిరాజు ఉమాకాంతం |
| అక్కిరాజు ఉమాకాంతము | |
| అక్కిరాజు ఉమాకాన్తము | |
| టాల్‌స్టాయి | టాల్‌స్టాయి |
| టాల్‌స్టాయ్ | |
| టాల్‌స్స్టాయి | |
| టాల్‌స్స్టాయ్ | |
| తోల్‌స్టాయి | |
| రవీంద్రనాథ్ టాగూరు | రవీంద్రనాథ ఠాకూర్ |
| రవీంద్రనాథ్ టాకూరు | |
| రవీంద్రనాథ్ టాగోరు | |
| రవీంద్రనాథ టాగూర్ | |
| రవీంద్రనాథ ఠాగూర్ | |
| రవీంద్రనాథ ఠాగోరు | |
| రవీంద్రనాథ ఠాకూరు | |
| రవీంద్రనాథ ఠాకూర్ | |
| రవీంద్రనాథ ఠాగోర్ | |

ముఖ్యంగా సూచీకర్త ప్రమాణీకరణ చేసిన పేర్ల పట్టికలను నిర్వహిస్తూ చెంత ఉంచుకోవాలి.

## 5 సంక్షిప్త రూపాలు

సూచీ పద్దులు వీలైనంత సంగ్రహంగా ఉండాలి. స్పష్టంగా, నీట్‌గా ఉండాలి. అందునిమిత్తం కొన్ని సంక్షిప్త రూపాలు (ఎబ్రీవియేషన్స్) విధిగా వాడాలి.

| | |
|---|---|
| అ.క. | అనుకర్త |
| అను. | అనువాదకుడు |
| గ్రం. మా. | గ్రంథమాల |
| గ్రం.నా. | గ్రంథనామం |
| చిత్ర. | చిత్రపటాలు |
| చి.కా. | చిత్రకారుడు |
| ఛా చి. | ఛాయాచిత్రాలు |
| తే.లే. | తేదీ లేదు |
| పరి. | పరిష్కరణ/పరిష్కర్త |
| ప.సం. | పరిచయ సంకేతం |
| పు. | పుటలు |
| పు.సం.లే | పుటల సంఖ్యలు లేవు |
| ప్ర.సం. | ప్రవేశ సంఖ్య |
| మూ.ము. | మూడవ ముద్రణ |
| నా.ము. | నాలుగో ముద్రణ |
| రెం.ము. | రెండో ముద్రణ |
| వ.సం. | వర్గ సంకేతం |
| విష. | విషయం |
| వ్యా. | వ్యాఖ్యాత/వ్యాఖ్యానం |
| సం. | సంపుటి |
| సం.క. | సంకలనం/సంకలన కర్త |
| సంచి. | సంచిక |

| | |
|---|---|
| సంగ్ర. | సంగ్రహ కర్త |
| సంచా. | సంచాలకుడు |
| సంవ. | సంవత్సరం |
| స.గ్రం. | సహ గ్రంథకర్త |
| సంపా. | సంపాదకత్వం/సంపాదకుడు |
| స్వక. | స్వరకర్తలు |

## 6 లింగ, వచనాలు

సూచీ కరణకు సంబంధించినంత వరకు కవుల, రచయితల పేర్లలో ఏకవచన, బహు వచనాలు పుం లింగ, స్త్రీలింగాలు— వీటిలో ఏ ఒక్కటి ఇచ్చినా మిగతా వాటికి అన్వయిస్తాయని భావించాలి. ''ఆథర్'' అనే భావంలో ఈ పదాన్ని వినియోగించాలి. ఉదా:– రచయిత = రచయిత్రి, రచయితలు, రచయిత్రులు.

## 7 రచన ప్రామాణీకరణ

ముఖ్యంగా తెలుగులో రచయిత, సంపాదకుడు, సంకలన కర్త, సంగ్రాహకుడు, సేకణ కర్త మొదలైన పదాలకు నిర్దిష్ట ప్రయోగం అలవాటు లేదు. నిఘంటువులను తయారు చేసే వ్యక్తులు తమ గ్రంథంలో రచన, సంపాదకుడు, సంకలన కర , సంగ్రాహకుడు— ఇలా తలోక రకంగా రాస్తారు. మిగతా గ్రంథాల విషయమూ అంతే. అందుచేత పుస్తకం మీద ఎలా ఉన్నా— సూచీకరణలో సమరూపత సాధించేందుకు వాడుకలో కొన్ని ప్రమాణాలు అనుసరించాలి.

| వ. సం. | విషయం | వాడుక | ప్రామాణీకరణ |
|---|---|---|---|
| 1 | నిఘంటువు | రచన<br>సంపాదకుడు<br>సంకలన కర్త<br>సంగ్రాహకుడు | సంగ్రాహకుడు |
| 2 | విజ్ఞాన సర్వస్వము | సంపాదకుడు<br>సంగ్రాహకుడు<br>రచన | సంపాదకుడు |

| | | | |
|---|---|---|---|
| 3 | గ్రంథసూచి | సంపాదకుడు<br>సంగ్రాహకుడు<br>సంకలన కర్త | సంకలన కర్త |
| 4 | పత్రిక | సంపాదకుడు<br>సంచాలకుడు | సంపాదకుడు |
| 5 | దర్శిని | రచన<br>సంపాదకుడు<br>సేకరణ | సంపాదకుడు |

## సమాచారం లభించే ఆధారాలు

గ్రంథాలయాలలో ఉండే పఠన సామగ్రిని, సూచీకరించేటప్పుడు దానికవసరమైన ముఖ్యసమాచారం కొరకు వెదకవలసిన ఆధారాల పట్టికలు ఈ దిగువ ఉన్నాయి. చూడండి.

| వ. సం | పఠనసామగ్రి, పరికరం | ఆధారం |
|---|---|---|
| 1 | పుస్తకాలు, కరపత్రాలు | ముఖపత్రం, ముఖపత్రం వెనుక |
| 2 | పత్రికలు, ధారావాహికలు | తొలిపుట, సంపాద పుట |
| 3 | దృశ్యచిత్రాలు అనగా పోస్టర్లు చిత్రాలు, ఛార్టులు | వాటిపైన |
| 4 | దేశపటాలు | ” |
| 5 | మైక్రోఫిల్ములు; మైక్రోఫిచ్‌లు మైక్రోకార్డులు | వాటిఫ్రేములపైన |
| 6 | గ్రామఫోన్ రికార్డు | రికార్డుపైన, పేపరుపైన |
| 7 | ఆడియోటేపు | కాసెట్ కవరుపైన |

| | | |
|---|---|---|
| 8 | వీడియోటేపు | కాసెట్ కవరు పైన |
| 9 | మెడల్సు, నాణేలు | వాటిపైన |

ముందుగా పై ఆధారాలనుంచి సమాచారం సంపాదించడానికి ప్రయత్నించాలి. అప్పటికీ లభించిన సమాచారం సంతృప్తికరంగా లేకపోతే శ్రమతీసుకొని ఈ దిగువ ఉదహరించిన అంశాలు పరిశీలించాలి.

1 సూచీకరణ నిమిత్తం గ్రంథపాలకుడు పుస్తకంలోని విషయాన్ని తెలుసుకోవాలంటే ముందుగా ముఖ పత్రాన్ని పరిశీలించవలసి ఉంటుంది. చాల సందర్భాలలో ముఖపత్రంమీది నామం గ్రంథస్థ విషయాన్ని తెలుపుతుంది. అప్పుడప్పుడు ఉపనామంగూడ గ్రంథవిషయాన్ని వ్యక్తీకరించే సందర్భాలు లేకపోలేదు. ఇందు ముఖపత్రాన్ని మాత్రమే ప్రధాన ఆధారంగా తీసుకొనరాదు.

2 గ్రంథంలో వివరించిన అంశాలపైనే విషయసూచిక ఉంటుంది. కనుక విషయసూచిక గూడ గ్రంథంలోని విషయాన్ని తెలుసుకోడానికి ఉపయోగిస్తుంది. అప్పటికీ విషయం అస్పష్టంగా ఉంటే—

3 గ్రంథ పరిచయం, పీఠిక, సంపాదకీయం మొదలైన వాటిని పరిశీలింపవలసి ఉంటుంది.

4 అప్పటికీ మూల విషయం పూర్తిగా బోధపడకపోతే పుస్తకాన్ని అక్కడక్కడా చదవవలసి ఉంటుంది. అనుక్రమణికను గూడ పరిశీలించవలసి ఉంటుంది.

5 వర్గీకరింపవలసిన గ్రంథం ఏదైనా మాల (సీరిస్)లో ప్రచురింపబడితే, ఆ మాలను (సీరీస్) బట్టి లేదా అందు యింతకు ముందు ప్రచురింపబడిన గ్రంథాలనుబట్టి గ్రంథస్థ విషయాన్ని కొంత తెలుసుకోవచ్చు.

6 గ్రంథస్థ విషయం తెలుసుకోడానికి మరో ఆధారం ఉంది. అదేమాపు అట్ట (బుక్ జాకెట్). దీనిమీది విషయం గ్రంథాన్ని గురించీ గ్రంథకర్తను గురించీ ప్రశంసాత్మకంగా ఉన్నప్పటికీ విషయవివరణ ఎంతో కొంత స్పష్టంగా ఉంటుంది.

కొన్ని ప్రత్యేక సందర్భాల్లో అప్పటికీ గ్రంథస్థ విషయం బోధపడక పోవచ్చు. రచయిత దృక్పథం తెలియకపోవచ్చు. అప్పుడు గ్రంథపాలకుడు ఈ దిగువ సమాచార గ్రంథాలను (రెఫరెన్స్ బుక్స్) కూడ పరిశీలించవలసి ఉంటుంది.

1 జాతీయ గ్రంథ సూచికలు

2 వివరణాత్మక గ్రంథ సూచికలు

3 ప్రసిద్ధ గ్రంథాలయాల సూచికలు

4 గ్రంథ సమీక్షలు

ఈ పరిశీలన కొంత శ్రమతో కూడుకొన్నప్పటికీ స్పష్టమైన విషయ పరిగ్రహణకు తోడ్పడుతుంది. విషయ నిర్ణయంలో సుమారు నిర్ణయం అంతమంచిది గాదు. ప్రతిసారి నిశతంగానూ, హేతుయుక్తంగానూ తర్కించుకొన్నాకనే తుది నిర్ణయానికి రావాలి. సందేహమనేది ఏ కాస్త ఉన్నా దాన్ని వదలి వేయరాదు. మరికాస్త శ్రమైనా, ఆలస్యమైనా విషయాన్ని తెలుసుకోవాలి. చదువరికి న్యాయం కలుగజేయాలి. అందుకోసం వెనుకంజ వేయరాదు. గ్రంథపాలకుడు గూడ తెలుసుకోవలసిన విషయాలెన్నో ఉంటాయి.

అటువంటి సమయాల్లో విషయ నిర్ణయానికి గ్రంథపాలకుడు ఆయా విషయాలలో ప్రసిద్ధులైన విజ్ఞానులను పండితులను సంప్రదించాలి. అవసరమైతే గ్రంథ రచనకు కారణభూతుడైన రచయితను, రచయితలభ్యం కాకుంటే వారి అనుయాయులను అభిమానులను సంప్రదించాలి. అంతకుమించి విషయ వివేచనకై చేయవలసిన ప్రయత్నం ఉండక పోవచ్చు.

సూచీకరణ చేసేటప్పుడు మరోమంచి విషయం గమనికలో ఉంచుకోవాలి. చదువరులకు బాగా అవసరమైన, సత్వరం కావాల్సిన గ్రంథాలకు ముందుసూచీ కరణ చేయాలి. అంతేగాక సులభంగా రెండు మూడు కార్డులు చేయడానికి, తక్కువ వివరాలు గల గ్రంథాలపని ముందు చూస్తే పని పూర్తవుతున్న సంతృప్తి ఉంటుంది. పనిలోతృప్తి. పనిత్వరగా జరగడానికి ప్రోత్సాహాన్నిస్తుంది. ఆనందాన్నిస్తుంది.

— 0 —

# 20 ఎ. ఎ. సి. ఆర్–2 స్వభావం

నేడు ప్రపంచ వ్యాప్తంగాగల గ్రంథాలయ సూచీకరణ విధానాలలో ఎ.ఎ.సి.ఆర్ – 2 ప్రశస్తమైంది. నిర్మాణంలో మంచి ప్రణాళిక, గట్టి పునాది కలది. ఏనాడో బ్రౌన్ తన వర్గీకరణ విధానంలో ఊహించిన విశ్లేషణ–సంశ్లేషణాత్మక విధానాన్ని (ఎనలిటికో థంసటిక్ మెథడ్ ), డాక్టర్ రంగనాథన్ పెంచిపోషించి గ్రంథాలయశాస్త్రంలో శాశ్వతరీతిలో ప్రతిష్ఠాపనచేశారు. ద్విబిందు వర్గీకరణ (కోలన్ క్లాసిఫికేషన్) విధానంలో వలె వివిధ అంశాలను ఏర్చికూర్చి సంకేతాన్ని పేర్చినట్లుగానే, ఎ.ఎ.సి.ఆర్–2 శీర్షికతో ప్రారంభించి, విరామ చిహ్నాలతో సహా ప్రతి అంశానికి నియమాలు వేరు వేరుగా అత్యంత నిర్దుష్టంగా రూపొందించి ఏర్చికూర్చి కార్డుపై నియమితస్థలాలలో పేర్చి, కార్డులపై నమోదు చేయవలసి ఉంటుంది. అన్ని స్థాయిలలో నియమాలను దృష్టిలో ఉంచుకొని చేస్తేనే పద్దు పూర్తవుతుంది. ఎ.ఎ.సి.ఆర్–2 నియమపథకం ఈ తీరుగా ఉంటుంది.

- 1.0 సాధారణ సూత్రాలు
- 1.0ఎ సమాచార ఆధారం
- 1.0బి వర్ణన నిర్వహణ
- 1.0సి విరామ చిహ్నాలు
- 1.0డి వర్ణన స్థాయిలు
- 1.0ఇ భాష, లిపి వర్ణన
- 1.1 గ్రంథనామం, రచనకు బాధ్యుడైన వ్యక్తి, సంస్థ
- 1.2 ముద్రణాది వివరాలు
- 1.3 విషయాలు (ప్రచురణ స్వభావ వివరణ)
- 1.4 ప్రచురణ, పంపిణీ వివరాలు
- 1.5 భౌతిక వర్ణన వివరాలు
- 1.6 గ్రంథమాల వివరాలు
- 1.7 వివరణ అంశాలు (నోట్ ఏరియా)

1.8 ప్రమాణ సంఖ్య
1.9 అనుబంధ వివరాలు

ఇవి స్థూల వివరాలు మాత్రమే. పైన వివరించిన ప్రతి అంశానికి అనేక నియమా లున్నాయి. వాటిలో తెలుగులో గల గ్రంథాలకు వర్తించే వాటిలో కొన్ని నియమాలను సోదాహరణంగా ఈ గ్రంథంలో ఇవ్వడం జరిగింది. గమనించండి.

## ప్రధాన పద్దులు : శీర్షికల ఎంపిక (స్థూలరూపాలు)

| వ.సం. | రచయిత/సంస్థ రచనలు | చేయవలసిన శీర్షిక—పేరఅనికళిపి చదువుకోవాలి | ఎ.ఎ.సి.ఆర్-2 నియమాలు |
|---|---|---|---|
| I | ఒకే రచయిత గ్రంథాలు | | |
| 1 | ఒకే రచయిత | రచయిత | 21–1ఎ 2 |
| 2 | ఒకే రచయిత (రెండవముద్రణ) | రచయిత | 21–4ఎ |
| 3 | స్వర రచనలు | స్వరకర్త | 21–1ఎ |
| 4 | సచిత్ర గ్రంథాలు (చిత్రకారుని ప్రాధాన్యం ఉంటే) | చిత్రకారుడు | 21.11ఎ |
| 5 | గ్రంథసూచీలు | సూచీకర్త | 21.7సి |
| 6 | అట్లాసులు, దేశపటాలు | మానచిత్రకారుడు | 21.1ఎ 1 |
| 7 | ఒక రచయిత గ్రంథం (పరిష్కర్త,వ్యాఖ్యాత,టీకాకర్త ఉన్నా—రచయిత ప్రాధాన్యంఉంటే) | రచయిత | 21.12ఎ |
| 8 | వ్యక్తి రచన(సంఘటిత సంస్థ ప్రచురణ) | రచయిత | 21.1బి 2 |
| 9 | ఉత్తరాలు | రాసినవారు | 4.1బి2 |
| 10. | ఉపన్యాసాలు | ఉపన్యాసకర్త | 21.1ఎ 1<br>21. 1ఎ2 |

## II బహుకర్తృత్వ గ్రంథాలు

| | | | |
|---|---|---|---|
| 1 | ఇద్దరు రచయితల గ్రంథాలు | మొదటి గ్రంథకర్త | 21.6 |
| 2 | ఇద్దరు రచయితల (ముద్రణ మారితే) | | 1.2ఇ1 |
| 3 | ముగ్గురు గ్రంథకర్తల గ్రంథాలు | మొదటి గ్రంథకర్త | 21.6 20 |
| 4 | నలుగురు అంతకంటె హెచ్చు గ్రంథకర్తలు | గ్రంథనామం | 21.6ది2 |
| 5 | పలువురు రచయితల గ్రంథానికి ఒకరు సంపాదకత్వం వహించినా | గ్రంథనామం | 21.7ఎ |

## III మిశ్రమ బాధ్యతగల రచయితల గ్రంథాలు

| | | | |
|---|---|---|---|
| 1 | పరిష్కరణలు | మూల రచయిత | 21.12ఎ |
| 2 | వ్యాఖ్య ప్రాధాన్యం ఎక్కువగా ఉంటే | వ్యాఖ్యాత | 21.12బి |
| 3 | సంపాదక గ్రంథం (రచయిత ఒకరే అయితే) | మూల రచయిత | 21.1ఎ 1 |
| 4 | సంపాదక గ్రంథం (వేరువేరు రచయితలైతే) | గ్రంథనామం | 21.7ఎ<br>21.7బి |
| 5 | అనువాద గ్రంథం | మూల రచయిత | 21.30కే 1 |
| 6 | అనుసరణ | అనుకర్త | 21.10 |
| 7 | ప్రక్రియమార్పు | మార్చిన వ్యక్తి | 21.10 |
| 8 | సంక్షిప్తీకరణ | మూల రచయిత | 25.3ఎ |
| 9 | విజ్ఞాన సర్వస్వాలు (ఒక రచయిత తయారుచేస్తే) | రచయిత | 21.ఎ1<br>21.ఎ2 |
| 10 | సంపాదకత్వంలో తయారైతే | గ్రంథనామం | 21.7ఎ |
| 11 | అభినందన గ్రంథాలు | గ్రంథనామం | 21.7బి |

## IV కలంపేర్లు : మారుపేర్లు రచయితల గ్రంథాలు

| | | | |
|---|---|---|---|
| 1 | అసలుపేరు, మారుపేరు రెండూతెలిసి,మారుపేరు బాగాప్రచారంలో ఉంటే | ప్రచారంలో ఉన్నమారుపేరు | 22.2సి 1 |

| | | | |
|---|---|---|---|
| 2 | అసలుపేరు ప్రకటనకు రచయితకు ఇష్టంలేకపోతే | కలం పేరు | 22.2సి 1 |
| 3 | రెండు మూడు ఏడారుపేర్లుంటే | ప్రబలంగా ప్రచారంలో ఉన్న పేరు | 22.2సి2 |
| 4 | ఒకే కలంపేరుతో ఇద్దరు రచయితలు ఉమ్మడిగా రాస్తే | కలం పేరు | 21.6డి |

5 వివాహిత రచయిత్రులు ఇంటి పేరులో కన్యాత్వపు పేరు, భర్త ఇంటి పేరు కలిసి వుంటే, భర్త ఇంటి పేరు మీద పద్దు ఇవ్వాలి. కాని ఈమె భాష జెక్ ఫ్రెంచి, హంగేరియన్, ఇటాలియన్ లేక స్పానిష్ అయితే సమస్తం పద్దు సంయుక్త ఇంటి పేరులేని మొదటి అంశానికి ఇవ్వాలి.

## V సమరూప శీర్షిక గల గ్రంథాలు

| | | | |
|---|---|---|---|
| 1 | వేదాలు, ఉపనిషత్తులు, గీత | ప్రచారంలోగల సమరూప గ్రంథనామం | 25.17 |
| 2 | బైబిలు | బైబిలు | 25.18ఎ1 |
| | ,, కొ.ని.చేర్చితే | బైబిలు కొత్తనిబంధన | 25.18ఎ2 |
| 3 | కురాను | కురాను | 25.17 |

## VI సంఘటిత సంస్థలు (కార్పొరేట్ బాడీస్) 25.6బి1

| | | | |
|---|---|---|---|
| 1 | ప్రభుత్వాధిపతి (అధికార ప్రచురణలు) | ప్రభుత్వం:అధిపతి హోదా | 24.20 C |
| 2 | ప్రభుత్వ శాఖల ప్రచురణలు | ప్రభుత్వం : శాఖ | 24.18 |
| 3 | శాసన సభల వృత్తాంతాలు | ప్రభుత్వం:లోక్‌సభ | 24.21 |
| | | ,, : రాజ్యసభ | |
| | | ,, : శాసనసభ | |
| | | ,, : శాసన మండలం | |

| | | | |
|---|---|---|---|
| 4 | కోర్టు నిర్ణయాలు | ప్రభుత్వం:సుప్రీంకోర్టు<br>" :హైకోర్టు<br>" :జిల్లాకోర్టు | 24.23 |
| 5 | కమీషన్ నివేదికలు | ప్రభుత్వం:కమీషన్ | 24.13<br>బైపు:2 |
| 6 | స్థానిక సంస్థల ప్రచురణలు | స్థానిక సంస్థ | 24.1 |
| 7 | విశ్వవిద్యాలయ ప్రచురణలు | విశ్వవిద్యాలయం | 24.1 |
| 8 | సంస్థలు, సంఘాల ప్రచురణలు | సంస్థ, సంఘం | 24.1 |
| 9 | పేరు మార్పు | | 24.1బి2 |

VII సభలు- సదస్సులు

| | | | |
|---|---|---|---|
| 1 | మహాసభలు | సభలు, స్థలం | 21.1బి1 |
| 2 | (స్థలంపేరులేకుండా) | గ్రంధనామం | 21. 5ఎ |
| 3 | వార్షిక సభలు | నిర్వహించే సంస్థ, సంఘం. సభ. సం | 21. 1బి1 |
| 4 | చిత్రకళా ప్రదర్శన సంచికలు | ప్రదర్శన నిర్వహించిన సంస్థ/సంఘం<br>ప్రదర్శన సం | 21. 1బి1<br>21. 1బి2 |

VIII రాజ్యాంగాలు : చట్టాలు

| | | | |
|---|---|---|---|
| 1 | రాజ్యాంగం | దేశం | 21. 33ఎ |
| 2 | బిల్లులు, చట్టాలు | చట్టం చేసిన దేశం/ రాష్ట్రం / బిల్లు / చట్టం | 21.31బి3 |
| 3 | ప్రాచీన చట్టాలు | ప్రచారనామం | 21. 31సి |
| 4 | " వ్యాఖ్యానాలు | వ్యాఖ్యాత | 21. 13బి |
| 5 | " అనువాదాలు | మూల రచయిత | 21. 14ఎ |

IV పత్రికలు : ధారావాహికలు

| | | | |
|---|---|---|---|
| 1 | సాధారణ పత్రికలు | పత్రికపేరు | 21. 1(సి)1 |
| 2 | ప్రత్యేక సంచికలు | | |
| 3 | రాష్ట్ర పరిపాలనా నివేదిక (వార్షికం) | గ్రంథనామం | 21. 1సి(3) |
| 4 | వార్షిక దర్శిని (రచయిత ఉంటే) | రచయిత | 21. 1ఎ2<br>21. 4ఎ |
| 5 | వార్షిక నివేదికలు | నివేదిక పేరు | 21. 1సి(3) |
| 6 | సంస్థ ప్రచురించే పత్రిక | పత్రికపేరు | 21. 1సి(3) |

X ఇతరాలు

| | | | |
|---|---|---|---|
| 1 | గ్రంథమాల | గ్రంథమాల | 1. 6జి |
| 2 | గ్రంథకర్త పేరు తెలియకపోతే | గ్రంథనామం | 21. 5ఎ |

గమనిక :

గ్రీకు, రోమన్ భాషలలో కాకుండా మిగతా భాషలలో క్రీ. శ 1500కు పూర్వం రాసిన వాటిని సమరూప శీర్షికల క్రింద శీర్షిక చేయాలి. 21. సి(1)

| | | | |
|---|---|---|---|
| 3 | రెండవ గ్రంథనామం | ప్రచారంలో ఉన్నపేరు | 1. 1బి1 |
| 4 | సచిత్ర గ్రంథాలలో చిత్రకారునిపేరు లేకపోతే | గ్రంథనామం | 21. 1సి(1) |

XI ఆధునిక పరికరాలు

| | | | |
|---|---|---|---|
| 1 | గ్లోబులు | గ్లోబుపేరు | 1. 1బి2 |
| 2 | అట్లాసులు | మానచిత్రకారుడు | 21. 1ఎ1 |
| 3 | " సంపాదకత్వంలో తయారైతే | గ్రంథనామం | 21. 1సి(2) |

| | | | |
|---|---|---|---|
| 4 | మెడల్ | మెడల్ పేరు | 1. 1బి1 |
| | | పొందినవారిపేరు | 1. 1ఇ6 |
| 5 | మైక్రోఫిచ్ | రచయిత | 21. 1ఎ1 |
| | | | 21. 1ఎ2 |
| 6 | మైక్రోఫిల్ము | రచయిత | 11. 5బి1 |
| 7 | మైక్రోస్కోప్ స్లైడ్లు | స్లైడ్ పేరు | 11. 5డి4 |
| | | | 10. 5C2 |
| | | | 10 5C1 |
| 8 | వీడియో రికార్డు | రికార్డు పేరు | 7. 5బి1 |
| | | | 7. 5సి3 |
| 9 | మెషీన్ రీడబుల్ డేటాఫైల్సు | రచయిత | 9. 5బి1 |
| | | | 9. 5బి2 |
| 10 | రేడియోగ్రఫీ | పేరు (బ్రాకెట్లలో) | 1.1బి7 |
| | | | 8. 1బి2 |
| | | | 8. 7బి3 |
| 11 | సౌండ్ టేప్‌లు | టేపు పేరు | 21. 5ఎ |
| 12 | గ్రామఫోన్ రికార్డు | రచయిత | 21. 1ఎ2 |
| | | | 21. 6బి1 |
| 13 | బ్రెయిలీ పుస్తకాలు | రచయిత | 23. 3సి2 |
| 14 | నాణేలు | ప్రభుత్వం: నాణెం | 10. 4ఎఫ్2 |
| | | | 10. 5సి1 |
| 15 | ప్లానులు (భవనాలు) | భవనం పేరు | 21. 1బి2 |

ముఖ్య గమనిక :

1 ఎ. ఎ. సి. ఆర్– 2లో ప్రతి అంశానికి ప్రత్యేక నియమాలున్నాయి. గ్రంథ విస్తరణ భీతిచే ప్రతినియమం, సంఖ్య ఇవ్వలేదు. కొన్ని అంశాలు స్థూలంగా మాత్రం ఇవ్వడం జరిగింది.

2 పైన వివరించింది ప్రధానపద్దు శీర్షిక మాత్రమే. ప్రధాన పద్దులో ఉదహరించిన అవసరమైన అంశాలకు ఉపపద్దులు చేసుకోవాలి.

3 సందేహం వస్తే మూల గ్రంథం చూడడం శ్రేయస్కరం. సొంత నిర్ణయాలు మంచిదికాదు.

— 0 —

# 21 విరామ చిహ్నాలు : కొన్ని గుర్తులు

| వ.సం | | ప్రదేశం | చిహ్నం | చిహ్న వివరణ |
|---|---|---|---|---|
| 1 | 1 | ప్రతి పేరా చివర | | |
| | 2 | పొడి అక్షరాల తరువాత<br>ఉదా : జి.వి. | . | బిందువు |
| | 3 | సంక్షిప్తాల తరువాత<br>ఉదా : సంపా. | | |
| 2 | 1 | గ్రంథకర్త వ్యక్తి నామం చివర<br>ఉదా : సీతాదేవి, వాసిరెడ్డి | | |
| | 2 | ప్రచురణకర్త పిదప<br>ఉదా : తెలుగు అకాడమీ, హైదరాబాదు | , | కామా |
| | 3 | వేరువేరు పుట సంఖ్యల మధ్య<br>ఉదా : X, 56పు. | | |
| 3 | 1 | పుటల సంఖ్య పిదప, సైజుకు ముందు<br>ఉదా : X, 56పు.; 19 సెం.మీ. | | |
| | 2 | గ్రంథమాలకు, సంఖ్యకు మధ్య<br>ఉదా : ఆంధ్ర గ్రంథమాల; సం. 2 | | |
| | 3 | గ్రంథకర్త, అనువాదకుని మధ్య<br>ఉదా : రచన టాల్‌స్టాయి; అను. రెంటాల | ; | సెమికోలన్ |
| | 4 | పీఠిక, ఉపోద్ఘాతం, చిత్రకారుని ముందు<br>ఉదా : రచన ముళ్లపూడి; చిత్రాలు బాపు | | |

| వ.సం | ప్రదేశం | చిహ్నం | చిహ్న వివరణ |
|---|---|---|---|
| 4 | 1 ప్రచురణ స్థలం పిదప<br>2 చిత్రాలకు ముందు<br>: చిత్రాలు | : | కోలను |
| 5 | కొంత విషయం వదిలేస్తే | ... | మూడు చుక్కలు |
| 6 | 1 సందిగ్ధం/చేరికలు<br>ఉదా : [195?], [1985?]<br>[19 –]<br>2 సంఖ్యలు లేని పుటలు<br>[43] పు.<br>3 చట్టాలు<br>4 సాధారణ పఠన సామాగ్రి వివరణ<br>5 ప్రచురణకర్త, పంపిణీదారుల విధుల వివరణ చేర్చినప్పుడు | [ ] | చతురస్ర కుండలీకరణ |
| 7 | గ్రంథమాల<br>(ఆంధ్ర గ్రంథమాల; సం. 2) | ( ) | కుండలీకరణ |
| 8 | 1 గ్రంథనామం, గ్రంథకర్తకు మధ్య<br>ఉదా : కన్యాశుల్కం/గురజాడ<br>2 ఒక గ్రంథంలో మరొక ముఖ్యాంశం ఉంటే రెండవ గ్రంథకర్తకు ముందు | | వాలుగీత (స్లాష్) |

| | | |
|---|---|---|
| | 3 సంస్కరణ ఏరియాలో సంస్కరణ సంఖ్య తరువాత మొదటి బాధ్యతా ప్రకటనకు ముందుగా<br>4 నోట్‌లో విషయ సూచిక రాస్తే ప్రతి రచనకు, రచయితకు మధ్య | / వాలు గీత (స్లాష్) |
| 9 | మొదటిది తప్పిస్తే, ప్రతి ఏరియాకు ముందు (ఆ ఏరియా కొత్త పేరా ఆరంభిస్తే తప్ప) | . — చుక్క, ఖాళీ, అడ్డుగీత, ఖాళీ |
| 10 | 1 ప్రభుత్వ శాఖల క్రింద<br>ఉదా: ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పౌరగ్రంథాలయ శాఖ<br>2 సమరూప శీర్షికలలో ఉపశీర్షిక క్రింద<br>ఉదా: బైబిలు . కొత్తనిబంధన<br>3 ప్రభుత్వ కమీషన్లు<br>ఉదా: ఆంధ్రప్రదేశ్. అధికారభాషా కమీషన్<br>4 మహాసభలు = సదస్సులు<br>ఉదా: ఆంధ్రప్రదేశ్ చరిత్ర కాంగ్రెస్ (1986: నగరం)<br>5 విశ్లేషణాత్మక పద్దులలో<br>ఉదా: వ్యాసావళిలో<br>6 మార్గ సూచికలలో<br>ఉదా: చూడండి ఇంకా చూడండి | -- క్రిందగీత (అండర్ లైన్) |

| | | | |
|---|---|---|---|
| 11 | సమానస్థాయి పరిభాష గ్రంథ/మాలా నామం ముందు | = | రెండుగీతలు (ఈజీక్వల్టు) |
| 12 | భౌతిక వివరాల క్షేత్రంలో, జోడించిన సామగ్రి వివరాలకు ముందుగా | + | ప్లస్ |
| 13 | 1 గ్రంథకర్త పూర్తి పేరు చివర<br>2 ఉపపద్ధాల వివరాల చివర | | ఏవిరామం లేదు |

## సూచీ భాగాల ఆద్యంతాలు

| వ.సం. | విషయం | ఎచటనుండి ప్రారంభించాలి |
|---|---|---|
| 1 | పరిచయ సంకేతం | కార్డు ప్రారంభంలో ఎడమ ప్రక్క పై మూల |
| 2 | గ్రంథకర్త నామం | మొదటి హద్దు (ప్రధాన అడ్డుగీతమీద) |
| 3 | గ్రంథకర్త జనన/మరణాలు | పేరుచివర, బ్రాకెట్టులలో |
| 4 | గ్రంథకర్త పేరు ఒకలైనుకు మించితే | మూడో హద్దు |
| 5 | గ్రంథనామం | రెండో హద్దు నుంచి (ప్రధాన అడ్డుగీత క్రింద గీత మీద) |
| 6 | గ్రంథకర్త పూర్తి పేరు (మామూలు వరుసలో) | గ్రంథనామం పిదప |
| 7 | ప్రచురణ స్థలం | సంస్కరణ, సామాగ్రి వివరణ క్షేత్రాలపిదప |
| 8 | ప్రచురణ కర్త | ప్రచురణ స్థలం పిదప |
| 9 | ప్రచురణ తేదీ | ప్రచురణ కర్త పిదప |
| 10 | పుటలు, చిత్రాలు, కొలత | రెండో హద్దు నుంచి వరుసగా |
| 11 | గ్రంథమాల | పుటాది వివరాల అనంతరం బ్రాకెట్టులలో |
| 12 | అంతర్జాతీయ ప్రమాణ సంఖ్య | రెండో హద్దు |
| 13 | విషయ శీర్షికలు | రెండో హద్దు |
| 14 | ఇతర శీర్షికలు | విషయ శీర్షికల అనంతరం |
| 15 | ప్రవేశ సంఖ్యలు | కార్డు ఎడమవైపు క్రిందిభాగంలో |

# 22 ఒకే రచయిత గ్రంథాలు

రచయిత (ఆథర్) అంటే సూచీకరణకు సంబంధించినంత వరకు వ్యక్తిగా రచయిత (పర్సనల్ ఆథర్) అని గుర్తించాలి. ఆంగ్లో అమెరికన్ సూచీకరణ నియమాలు (ఎ.ఎ.సి.ఆర్–2) ప్రకారం రచయిత అంటే ఒక రచన ఆవిర్భావానికి తన మేధాశక్తిని, కళాత్మక శక్తిని, ఉపయోగించిన వ్యక్తి. వీరు ఈ దిగువ ఉదహరించిన వారై ఉండ వచ్చు. రచయిత అంటే —

1 రచనకు బాధ్యుడైన వ్యక్తి

2 చిత్ర రచనకు బాధ్యుడైన వ్యక్తి

3 స్వరకర్త (కంపోజర్ ఆఫ్ మ్యూజిక్)

4 గ్రంథసూచీకర్త (బిబ్లియోగ్రాఫర్)

5 మాన చిత్రకారుడు, అట్లాసులను దేశపటాలను తయారుచేసిన వ్యక్తి (కార్టోగ్రాఫర్)

6 ఛాయాగ్రాహకుడు (ఫోటోగ్రాఫర్)

7 ధ్వని రికార్డు చేసినవారు, వీడియో రికార్డు చేసినవారు.

వీరందరిని గ్రంధకర్తలుగానే గుర్తించి నిఘంటు సూచీ విధానంలో ప్రధాన పద్దుకు శీర్షికను ఎంపిక చేయాలి.

ఒక రచయిత

ఒక రచయిత స్వరకర్త, చిత్రకారుడు, మాన చిత్రకారుడు, గ్రంధసూచీ కర్తల గ్రంథాలకు వాటిఆవిర్భావానికి కారకులైన రచయిత పేరనే శీర్షికచేయాలి(21.1ఎ7)

శ్రీరస్తు

# కన్యాశుల్కం

ఇది
శ్రీవిజయనగర రాజ్యమున ప్రాచీన లిపి పాఠకుడగు

గురజాడ అప్పారావు పంతులు బి.ఏ.చే

రచియింపబడినది.

## శ్రీవిజయనగరము

శ్రీవిజయ రామవిలాస ముద్రాక్షరశాలయందు

కొంకిపూడి, భద్రయ్యచే ముద్రింపబడి
ప్రకటింపఁబడియె.

౧౮౯౭ సం॥ ౧౦॥



దీని వెల ౮ అణాలు అంచెకూలి ౧ అణా

---

మొదటి కూర్పు లోపలి తొలి పుట

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 894.8272
అ. గు — క
2 పుటలు : 4,90
3 ఎత్తు : 21.4 సెం.మీ
4 ప్రచురణ సం : ౧౮౯౭ : 1897
5 ప్రవేశ సంఖ్య : 1001

894. 8272
అ.గు–క అప్పారావు, గురజాడ (1861 – 1915)
కన్యాశుల్కము గురజాడ అప్పారావు. —
విజయనగరం: కొంకిపూడి భద్రయ్య,
౧౮౯౭ [1897].

1001 4,90 పు ; 22 సెం. మీ.
1 నాటకాలు I గ్రం.నా.

అదే పుస్తకం : పునర్ముద్రణ

ఉదా: 2
894. 8272
అ.గు–క అప్పారావు, గురజాడ (1861 - 1915)
కన్యాశుల్కం/గురజాడ అప్పారావు; సంపాదకుడు
సెట్టి ఈశ్వరరావు. — హైదరాబాదు: విశాలాంధ్ర,
1986.

1002 xxiii, 90పు.; 22 సెం. మీ.
1 నాటకాలు I ఈశ్వరరావు, సెట్టి , సంపా.
II గ్రం నా.

అదే పుస్తకం : వ్యాఖ్యాన సహితం

ఉదా: 3
894.8272
అ.గు–క అప్పారావు, గురజాడ (1861 – 1915)
మొట్టమొదటి కన్యాశుల్కం. గురజాడ అప్పారావు;
వ్యాఖ్యాత బంగోరె
. — నెల్లూరు: వ్యాఖ్యాత, 1969.
xxxiv, ౭౧, 174 పు.; 23 సెం. మీ.

1003 1 నాటకాలు I బంగోరె, వ్యా. II గ్రం. నా.

అదే పుస్తకం : పరిష్కరణ

ఉదా: 4

శ్రీరస్తు

# కన్యాశుల్కము

హాస్యరస ప్రధానమగు నాటకము

—0—

శ్రీశ్రీశ్రీ హర్ హైనెస్

ది మహారాజ కుమారి కాసాహెబా

ఆఫ్ విజయనగరం, మహారాణి ఆఫ్ వూఘోగడ్, రీవా,

సర్కార్ వారి భృత్యుడగు

**గురజాడ - అప్పారావు చే**

రచింప బడినది.

రెండవ కూర్పు

చెన్నపట్టణం

జి. రామస్వామి శెట్టిగారి

ముద్రాక్షర శాలయందు

ముద్రాపితంబై ప్రకటింప బడియె

వెల 12 అణాలు

చెన్నపురి ఎస్ప్లెనేడ్ లోని

వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్

సన్సువారి డెపోలో దొరుకును.

—o0o—



1909

రెండో కూర్పు లోపలి తొలి పుట

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 894. 8272
అ.గు—క

2 పుటలు : 190

3 ఎత్తు : 21. 5 సెం.మీ.

4 ప్రవేశ సంఖ్య : 1004

894.8272
అ.గు – క అప్పారావు, గురజాడ (1861 – 1915)
కన్యాశుల్కము/గురజాడ అప్పారావు . — 2వ కూర్పు .
మద్రాసు : రచయిత, 1909.
190పు.; 22 సెం.మీ.

1004 రెండవ ముద్రణలో విస్తరణ జరిగింది.
1 నాటకాలు I గ్రం.నా.

అదే పుస్తకం : పరిష్కరణ : పునర్ముద్రణ

ఉదా : 5
894.8272
అ గు – క అప్పారావు, గురజాడ (1861 – 1915)
కన్యాశుల్కం/గురజాడ అప్పారావు; సమీక్ష శ్రీశ్రీ .
విజయవాడ : జయంతి, 1983.

1005 268పు.; 19 సెం.మీ.
1909 ప్రతికి పునర్ముద్రణ.
1 నాటకాలు I శ్రీ శ్రీ, సమీ. II గ్రం. నా.

అదే పుస్తకం : సంపాదక వ్యాఖ్యంతో పునర్ముద్రణ

ఉదా : 6

894 8272

అ.గు – క అప్పారావు, గురజాడ (1861 – 1915)

కన్యాశుల్కం, గురజాడ అప్పారావు; సంపాదకుడు సెట్టి ఈశ్వరరావు . — హైదరాబాదు : విశాలాంధ, 1986.

1006 xxviii, 280 పు.; 2 ఛా.చి; 22 సెం.మీ.

1 నాటకాలు I ఈశ్వరరావు, సెట్టి, సంపా. II గ్రం. నా.

గమనిక :

1 ఒక పుస్తకాన్ని అదే ప్రచురణ కర్త ఏ మాత్రం మార్పు లేకుండ తు. చ. తప్పక పునర్ముద్రిస్తే సూచల పద్దు చేయాల్సిన పనిలేదు. ఇంతకు ముందు చేసిన పద్దులో ప్రవేశ సంఖ్య పిదప, కొత్త ప్రవేశ సంఖ్య చేర్చితేచాలు.

2 మార్పులు ఏమాత్రం ఉన్నా కొత్త పద్దు చేయాలి. ఉదాహరణకు ఈ గ్రంథంలో తొలి పద్దు కన్యాశుల్కం విషయం తీసుకుందాం —

1 ఈ గ్రంథం 1897లో తొలిసారి అచ్చయింది.

2 ఈ ప్రతికి వ్యాఖ్యతో 1969లో బంగోరె అచ్చేశారు.

3 తొలి ముద్రణకు సంపాదకీయం చేర్చి 1986లో విశాలాంధ వారు అచ్చేశారు.

4 తొలి ముద్రణను బాగా పెంచి, సంస్కరించిన ప్రతిని వావిళ్లవారు 1909లో ప్రచురించారు.

5 ఈ ప్రతినే 1961లో కొండపల్లి వారు, 1968, 1969, 1973, 1977, 1981, 1983లో యం. శేషాచలం కంపెనీ, 1983లో జయంతి వారు, 1986లో విశాలాంధ్ర వారు పునర్ముద్రించారు. ఈ విధంగా ప్రచురణ కర్త మారిన ప్రతిసారి వేరు వేరుగా ప్రధాన

పద్దులు చేయవలసిందే. కేవలం పునర్ముద్రణ అయితే ప్రవేశ సంఖ్య పాత కార్డుకు చేర్చితేచాలు. (చూ. గమనిక – 1).

6 ఈ పద్దులలో ఉపోద్ఘాతం, సంపాదకీయం, వ్యాఖ్య, సమీక్ష, అనువాదం, ముందు మాట – మొదలైన వాటిలో ప్రత్యేకంగా గమనించ వలసిన అంశాలుంటే వాటన్నిటికీ ఉప పద్దులు చేయాల్సిందే. విచక్షణారహితంగా ఉప పద్దుల సంఖ్య పెంచుకుంటూ పోవడం మాత్రం భావ్యం కాదు.

7 పైన ఉదహరించిన "కన్యాశుల్కం" గ్రంథానికి వివరించినవన్నీ ఉపపద్దులే. కొండపల్లి, శేషాచలం అండ్ కంపెనీ ముద్రణలు లభ్యంకానందున వాటితాలూకు రెండు ప్రధాన పద్దులు చూపలేదు. చూపిన ఆరు పద్దులు గమనికలోకి తీసుకొనవలసిందే. వీటి ఉప పద్దుల స్వరూపం ఇలా ఉంటుంది.

## ఉపపద్దులు

ప్రధాన పద్దుకు అదనంగా ఉండే పద్దులన్నీ ఉపపద్దులే. అవసరాన్నిబట్టి ఈ దిగువ ఉదహరించిన అంశాలకు ఉపపద్దులు చేయాల్సి ఉంటుంది.

1 సంగ్రహ గ్రంథకర్త
2 సంపాదకుడు
3 సంకలన కర్త
4 సంగ్రహకర్త
5 వ్యాఖ్యాత
6 టీకా కర్త
7 పరిష్కర్త
8 చిత్రకారుడు
9 అనువాదకుడు
10 సమీక్షకుడు
11 విషయం
12 మార్గ సూచికలు
13 గ్రంథమాల
14 గ్రంథనామం
15 గ్రంథకర్త, గ్రంథనామ, విషయ విశ్లేషణాత్మకాలు మొ॥

ఎ. ఎ. సి. ఆర్–2లో ఒక పెద్ద సుగుణం ఉంది. ఇచట యూనిట్ కార్డు విధానం పాటించడం జరిగింది. ఇందు ప్రధానపద్దుకు పైన ఉప పద్దు శీర్షిక చేర్చితేచాలు! ఉప పద్దు ఔతుంది. ఇది చాల సులభం. పైసూచించిన 15 అంశాలలో– విషయం, మార్గసూచికలు, విశ్లేషణాత్మకాల పద్దుల తయారీ వేరు వేరు అధ్యాయాలలో సిద్ధాంత దీపికలో చర్చించడం జరిగింది. మిగతా అంశాలను యథాతథంగా శీర్షికగా ఉపయోగించవచ్చు. తొలి ఉదాహరణ కన్యాశుల్కం– గ్రంథానికి యూనిట్ కార్డు విధానం అనుసరించినపుడు ఈ దిగువ ఉదహరించిన పద్దులు అవసరం.

సంపాదకుని ఉపపద్దు

ఉదా : 7

894. 8272 ఈశ్వరరావు, సెట్టి, సంపా.
అ.గు–క అప్పారావు, గురజాడ (1861– 1915)
కన్యాశుల్కం/గురజాడ అప్పారావు; సంపాదకుడు సెట్టి ఈశ్వరరావు. — హైదరాబాదు : విశాలాంధ్ర, 1986.

1007 xxiii, 90పు. ; 22 సెం. మీ.
1 నాటకాలు I ఈశ్వరరావు, సెటి , సంపా. II గ్రం. నా.

2 వ్యాఖ్యాత ఉపపద్దు

ఉదా : 8

894. 8272 బంగోరె, వ్యా.
అ.గు–క అప్పారావు, గురజాడ (1861– 1915)
మొట్టమొదటి కన్యాశుల్కం/గురజాడ అప్పారావు ; వ్యాఖ్యాత బంగోరె. — నెల్లూరు : వ్యాఖ్యాత, 1969.

1008 xxxiv, 20, 174పు.; 22 సెం. మీ.
1 నాటకాలు I బంగోరె, వ్యా. II గ్రం. నా.

3 సమీక్షాకర్త ఉపపద్దు

ఉదా : 9

894. 8272 శ్రీశ్రీ, సమీ.

అ.గు.—క అప్పారావు, గురజాడ (1861–1915)

కన్యాశుల్కం/గురజాడ అప్పారావు; సమీక్ష శ్రీశ్రీ

. —విజయవాడ: జయంతి, 1983.

268పు.; 19 సెం. మీ.

1009 1909 ప్రతికి పునర్ముద్రణ.

1 నాటకాలు I శ్రీ శ్రీ, సమీ. II గ్రం. నా.

4 విషయపు ఉపపద్దు

ఉదా : 10

894.8272 నాటకాలు

అ.గు—క అప్పారావు, గురజాడ (1861–1915)

కన్యాశుల్కం/ గురజాడ అప్పారావు; సంపాదకుడు సెటి

ఈశ్వరరావు. — హైదరాబాదు: విశాలాంధ్ర, 1986.

1010 xxiii , 90పు.; 22 సెం.మీ.

1 ఈశ్వరరావు, సెట్టి, సంపా. II గ్రం.నా.

5 గ్రంథ నామం ఉపపద్దు

ఉదా : 11

894.8272 కన్యాశుల్కం

అ.గు—క అప్పారావు, గురజాడ (1861–1915)

కన్యాశుల్కం/గురజాడ అప్పారావు; సంపాదకుడు సెట్టి

ఈశ్వరరావు. — హైదరాబాదు: విశాలాంధ్ర, 1986.

1011 xxiii, 90పు.; 22 సెం.మీ.

1 నాటకాలు I ఈశ్వరరావు, సెట్టి, సంపా.

గమనిక :

విషయం, గ్రంథ నామానికి చెందిన ఉపపద్దులు అన్ని ప్రతులకు వేరు వేరుగా చేయాల్సిందే—అనే విషయం మరోసారి గుర్తుంచుకోవాలి. అయితే యూనిట్ కార్డు విధానం అనుసరించనప్పుడు ఉపపద్దుల స్వరూపం ఈ దిగువ ఉదహరించిన తీరుగా ఉంటుంది.

1 సంపాదకుని ఉపపద్దు

ఉదా : 12

894.8272
అ.గు—క ఈశ్వరరావు, సెట్టి, సంపా.
అప్పారావు, గురజాడ (1861–1915)
1007 కన్యాశుల్కం . — 1986.

2 వ్యాఖ్యాత ఉపపద్దు

ఉదా : 13

894.8272
అ.గు—క బంగోరె, వ్యా.
అప్పారావు, గురజాడ (1861–1915)
కన్యాశుల్కం. — 1969.
1013

3 సమీక్షా కర్త ఉపపద్దు

ఉదా : 14

894.8272
అ.గు—క శ్రీశ్రీ , సమీ.
అప్పారావు, గురజాడ (1861–1915)
1014 కన్యాశుల్కం. — 1983.

4 విషయపు ఉపపద్దు

ఉదా : 15
894.8272
అ.గు—క నాటకాలు
అప్పారావు, గురజాడ (1861–1915)
కన్యాశుల్కం. — 1986.
1015

5 గ్రంథ నామపు ఉపపద్దు

ఉదా : 15
894.8272
అ.గు—క కన్యాశుల్కం. — 1897, 1909, 1969, 1983, 1986.
అప్పారావు, గురజాడ (1861–1915)
1016

గమనిక :

1 గ్రంథనామం – ఉపపద్దుల విషయంలో – ఆయా ప్రతుల ప్రచురణ సంవత్సరాలు వేసి, అన్ని ప్రవేశ సంఖ్యలు చేర్చి సూచీ పరిమాణం తగ్గించ వచ్చు.

2 పరిశోధనా గ్రంథాలయాలలో వేరువేరుగా ఉపపద్దులు చేయడమే శ్రేయస్కరం.

3 యూనిట్ కార్డు విధానం అనుసరించాలా లేదా అనే విషయం గ్రంథపాలకుడు నిర్ణయించుకోవాలి.

ప్రత్యేక గమనిక :

ఈ గ్రంథంలో ఇకపై వివరించే ప్రధాన పద్దులకు, ఉపపద్దులు స్థలాభావంచేత, పునరుక్తి పరిహరించడం కోసం వివరించలేదు. ''కన్యాశుల్కం'' గ్రంథ విషయంలో చేసిన ఉపపద్దుల రీతిలో వివరించనున్న ప్రధాన పద్దులకు ఉప పద్దులు ఊహించ వచ్చును.

మరికొన్ని ఉదాహరణలు

494. 82709

వెం. గి — తె వెంకట సీతాపతి, గిడుగు

తెలుగులో ఛందోరీతులు గిడుగు
వెంకట సీతాపతి. — హైదరాబాదు:
విశాలాంధ్ర, 1964.

3743 37, 256 పు.; 19 సెం.మీ.

1 తెలుగు — ఛందస్సు — విమర్శ
I గ్రం. నా.

720

గో.శ్రీ—లే గోపాల కృష్ణమూర్తి, శ్రీపాద

లేపాక్షి కళా మంటపము శ్రీపాద
గోపాల కృష్ణమూర్తి. — హైదరాబాదు:
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురాతత్త్వ శాఖ,
1962.

1376 8, 67, 10 పు.; 24 సెం.మీ.

1 వాస్తు శిల్పం — లేపాక్షి I గ్రం. నా.

---

320.92

ప్రకా —నా ప్రకాశం, టంగుటూరి (1872-1957)

నా జీవిత యాత్ర/ టంగుటూరి
ప్రకాశం. — రాజమండ్రి: కాళహస్తి
తమ్మారావు అండ్ సన్స్, 1957.

2649 264 పు.; 19 సెం.మీ.

1 ప్రకాశం, టంగుటూరి — స్వీయచరిత్ర
I గ్రం. నా.



---

గమనిక : ఒక గ్రంథాన్ని ప్రభుత్వం ప్రచురించినా—రచయిత ఉంటే రచయిత క్రిందే శీర్షిక చేయాలి.

చిత్రకారుడు

ఉదా: 17

బుజ్జికథలు—6

# కాకి — కడవ

Chokkapu Venkata Ramana

ILLUSTRATIONS BY

**M. KANAKA SURI BABU**

General Editor
B. Subbarayudu

Published by

Andra Pradesh Balala Academy
(A Govt. Society)

Barkatpura, Hyderabad- 500 027

Phone-647001 

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం

2 పుటలు : 8

3 ఎత్తు: 23.5 సెం. మీ.

4 ప్రవేశ సంఖ్య : 1017

894.8278

క.యం—కా కనక సూరిబాబు, యం.

కాకి—కడవ/చిత్రాలు యం. కనక సూరిబాబు; [కథ] చొక్కాపు వెంకటరమణ. — హైదరాబాదు:ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ, 1984.

1017 8పు.;24 సెం.మీ. — (బుజ్జికథలు;6)

1కథలు I వెంకటరమణ, చొక్కాపు II గ్రం.నా.

మరొక ఉదా : 18

892.3

ప్రకా—ఆం బుజ్జాయి

ఆంధ్రకేసరి/రచన, చిత్రాలు బుజ్జాయి . — హైదరాబాదు:ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ, [198?].

31పు.;23 సెం.మీ.

1018 1 ప్రకాశం—జీవిత చరిత్ర I గ్రం.నా.

గమనిక

1 సచిత్ర గ్రంథాలలో రచయిత ప్రాధాన్యం అధికంగా ఉంటే రచయిత పేరనే శీర్షిక ఎంపిక చేయాలి. చిత్రాల ప్రాధాన్యం ఉంటేనే చిత్రకారునిపై శీర్షిక ఎంపిక చేయాలి.

2 రచయిత, చిత్రకారుడు ఒకరే అయితే వారి పేరనే శీర్షిక చేయాలి.

3 చిత్రకారుని పేరుంచి రచయిత పేరు లేకపోతే చిత్రకారుని పేరనే ప్రధాపద్దు చేయాలి.

ఒకే రచయిత:స్వరకర్తలు

ఉదా:19

# క్షేత్రయ్య పద స్వర సాహిత్యములు

స్వర రచన

## బి. కుమారస్వామి

పబ్లిషర్సు

నిర్మలాపబ్లిషర్సు

కుమ్మరివీధి, విజయవాడ—1



ఇతర సమాచారం

1 పరిచయ సంకేతం: 784.08
కు.బి—క్షే

2 పుటలు : 4,33

3 ప్రచురణ సం : 1968

4 సైజు : 23.5సెంమీ

5 ప్రవేశసంఖ్య : 1019

784.08
కు.బి—క్షే కుమారస్వామి, బి.
క్షేత్రయ్య పదస్వర సాహిత్యములు/స్వరకర్త బి.కుమారస్వామి. —విజయవాడ : నిర్మలాపబ్లిషర్సు, 1968.
1019 4, 33పు.; 24సెం.మీ.
1 పదసాహిత్యం 2 క్షేత్రయ్య పదసాహిత్యం
I గ్రం.నా.

మరొక ఉదా: 20
794.08
సయ్య—అ సయ్యద్ పాచ్చాసాహెబ్
అన్నమాచార్యకీర్తనలు/స్వరకర్త సయ్యద్ పాచ్చాసాహెబ్. —గూటాల:స్వరకర్త, 1983.
1020 [10], 232పు.; 22సెం.మీ.
1 అన్నమాచార్య — పద సాహిత్యం
I గ్రం.నా.

గమనిక

1 రచయిత, అనువాదకుడు, వ్యాఖ్యాత, స్వరకర్త ఎవరైనా తన పుస్తకాన్ని ప్రచురించుకున్నపుడు—కార్డులో ప్రచురణకర్త స్థానంలో ప్రచురణకు బాధ్యులైన వారిపేరు ఉదహరించాలి.

2 పదరచయితకు ఎలాగూ ఉపపద్దు ఇవ్వాలి.

ఒకే రచయిత:గ్రంథసూచీకర్తలు

ఉదా: 21

తెలుగులో రెఫరెన్సు గ్రంథాలు

— 0 —

ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం

హైదరాబాదు

1986

ఇతర సమాచారం

1 పరిచయసంకేతం: 011

వెం.వె–తె

2 పుటలు : viii, 116

3 సైజు : 24.5సెం మీ

4 ప్రవేశసంఖ్య : 1021

5 పాఠ్యనిర్మాతలు

ఆచార్యకేతువిశ్వనాథరెడ్డి (ఛైర్మన్, సంపాదకుడు)

డా॰ వెలగా వెంకటప్పయ్య (సంకలనకర్త)

6 115–116 పుటలలో తెలుగు రెఫరెన్సు గ్రంథాల గురించి ఆంగ్ల హిం భాషలలో వెలువడిన రెఫరెన్సు గ్రంథాల వివరాలున్నాయి.

011
వెం. వె—తె వెంకటప్పయ్య, వెలగా (1932– )
తెలుగులో రెఫరెన్సు గ్రంథాలు సంకలనకర్త వెలగా వెంకటప్పయ్య; ఛైర్మన్ సంపాదకుడు కేతు విశ్వనాథరెడ్డి. — హైదరాబాదు: ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, 1986.
(చూడు తదుపరి కార్డు)

2

011
వెం. వెం—తె వెంకటప్పయ్య, వెలగా (1932 — )
viii , 116పు.; 25 సెం.మీ.
ఆంగ్ల, హిందీ భాషలలోగల తెలుగు రెఫరెన్సు గ్రంథాల వివరాలు 115–116 పు. లో.
1 రెఫరెన్సు గ్రంథాలు I విశ్వనాథరెడ్డి, కేతు, సంపా.
II గ్రం. నా.

మరొక ఉదా: 22
012
వి. కా—రా కాత్యాయనీ, విద్మహే
రాయప్రోలు వాఙ్మయ జీవిత సూచిక , సంకలనకర్త కాత్యాయనీ విద్మహే. — వరంగల్: సంకలనకర్త, 1980.
12, 45 పు., 22 సెం.మీ.
పిమర్శని 1979 నుండి పునర్ముద్రణ.
1022 1 సుబ్బారావు, రాయప్రోలు— గ్రంథసూచి I గ్రం. నా.

అట్లాసులు: దేశపటాలు

అట్లాసులు, దేశపటాలు— వాటిని తయారు చేసిన నాన చిత్రకారుని పేరుతో శీర్షిక చేయాలి.

ఉదా: 23

# బ్రిజ్ బాసి

## పాఠశాల ప్రపంచ అట్లాసు

ఈ అట్లాసులో No. 7, 8, 11, 13, 16and 31 to 48
పుటల చిత్రపటములలోని హిందూదేశపు అంతర్జాతీయ సరిహద్దు
సర్వేయర్ జనరల్ ఆఫ్ ఇండియా వారిచే అమోదించబడి
No. T. B. 24004/62-A-3/212 dated 16-6-77
సర్వే ఆఫ్ ఇండియా వ్యాపుల మీద ఆధారపడి యున్నవి.

సంకలన కర్త
డి. పి. సింగ్, ఎమ్. ఏ., సాహిత్యరత్న,
భూగోళశాస్త్రశాఖ ప్రధానోద్యాపకులు,
బి. ఎస్. ఏ. డిగ్రీ కాలేజ్, మథుర, ఉత్తర ప్రదేశ్.

తెలుగు కూర్పు : ఎన్. పి. విఠల్, బి.ఏ., జి.డి. ఆర్ట్స్(కమ్.),
గవర్నమెంట్ కాలేజ్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్, హైదరాబాద్.

ప్రకాశకులు
బ్రిజ్ బాసి పబ్లికేషన్స్
మథుర ఉ. ప్రదేశ్

1985 వెల: రూపాయలు Rs 7.00

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 912
సి.డి–బ్రి
2 పుటలు : 48
3 ఎత్తు : 28 సెం.మీ.
4 ప్రవేశసంఖ్య : 1023

912
సి.డి–బ్రి సింగ్, డి.పి.
బ్రిజ్ బాసి పాఠశాల ప్రపంచ అట్లాసు/డి.పి.సింగ్;
తెలుగు కూర్పు యన్.పి. విఠల్. — మథుర : బ్రిజ్ బాసి పబ్లికేషన్స్, 1985.
48పు.; 28సెం.మీ.
1023 1 దేశపటాలు : ప్రపంచం I విఠల్, ఎన్.పి., అను.
II గ్రం. నా.

మరొక ఉదా: 24

910
రాయ రాయల ప్రపంచ అట్లాసు. —
మద్రాసు : రాయల ఏజన్సీస్, 1986.
64పు.; 28 సెం.మీ.
1024 1 అట్లాసు– ప్రపంచం I గ్రం. నా.

గమనిక:

మాన చిత్రకారుని పేరు లభించనపుడు గ్రంథ నామం పేరనే శీర్షిక చేయాలి.
ఇది సాధారణ నియమం (21. డి సి(3)

**ఒకే రచయిత: రెండవ ముద్రణ**

**ఉదా: 25**

LIBRARY EDITION

శ్రీ జ్ఞాన ప్రసూన మాలిక — ప్రథమ ప్రసూనము

శ్రీరస్తు

శ్రీమన్మహాకవి ధూర్జటిచే

రచియింపబడిన

# శ్రీకాళహస్తి మాహాత్మ్యము

— 0 —

క్రొత్తపల్లి — అన్నపూర్ణమ్మచేఁ

బ్రకటింపబడియె

శివుడు—'' XX మణికొనువాని వెతక

దవనిఁగొనువాఁడె రత్నంబు నరయుఁ గాదె?''

రెండవ కూర్పు ౨౦౦౦ ప్రతులు

చెన్నపురి

బ్రిటిష్ మాడెల్ ముద్రాక్షర శాలయందు

ముద్రింపబడియె

౧౯౩౦



**ఇతర వివరాలు**

1 పరిచయ సంకేతం : 894.8271
ధూర్జ-శ్రీ

2 పుటలు : 4; 156

3 సైజు : 22 సెం.మీ

4 ప్రవేశసంఖ్య : 1025

894.8271

ధూర్జ—శ్రీ    ధూర్జటి

శ్రీకాళహస్తి మహాత్మ్యము / ధూర్జటి. —
2వ కూర్పు. — చెన్నపురి: కొత్తపల్లి అన్నపూర్ణమ్మ,
౧౯౩౦ [1930].

1025    4, 156పు; 22 సెం.మీ. — (జ్ఞాన ప్రసూనమాలిక;1)
1 ప్రబంధాలు, I గ్రం. నా. (గ్రంథమాల)

గమనిక

1 ప్రచురణ సంవత్సరం తెలుగు అంకెలు యథాతథంగా వేయడమైనది. బ్రాకెట్లలో సమాచారార్థం అరబిక్ అంకెలు వేయాలి.

ఉపపద్దులు

1 విషయం, గ్రంథనామం ఉపపద్దులు ఇంతకుముందు కన్యాశుల్కం ఉదాహరణలోవలె ఊహించు కోవాలి

2 గ్రంథమాల ఉపపద్దు ఈ దిగువ ఉదహరించిన తీరులో ఉండాలి

జ్ఞాన ప్రసూన మాలిక

894.8271

ధూర్జ—శ్రీ    1 శ్రీకాళహస్తి మహాత్మ్యము, 1930.

894.8271    2 పాండురంగ మహాత్మ్యము, 1932.

రా.తే—పాం

సంకలనకర్త: గ్రంథాలయసూచి

ఉదా : 26

A
Descriptive Catalogue
of the
Telugu Manuscripts
in the
Tanjore Maharaja Serfojis Saraswati Mahal Library
Tanjore
Vol. II

Compiled by
V. Sundara Sarma
Pandit
Saraswati Mahal Library, Tanjore

Published by
S. Gopalan, B.A.,B.L.,
Hon. Secretary for the Administrative Committee
T.M.S.S.M. Library, Tanjore.
Saka 1880 A. C. 1959
Price Rs. 7.00

ఇతర వివరాలు

017

1 పరిచయ సంకేతం : తంజా
2 పుటలు : 4, 31, 463, xxviii, 2
3 ఎత్తు : 24.5 సెం.మీ.
4 1043 తెలుగు రాతప్రతుల వివరణాత్మకసూచి
5 ప్రవేశసంఖ్య : 1026

017
సుం.వి—తం సుందర శర్మ, వి.
తంజావూరు సరస్వతి మహల్ లైబ్రరీ రాత ప్రతుల
వివరణాత్మక సూచి. 2వ భాగము = A Des... / సంకలనము
వి. సుందర శర్మ. — తంజావూరు: ఎస్. గోపాలన్‌చే టి.ఎం.ఎస్
1026 ఎస్. ఎం. లైబ్రరీ కొరకు, 1959.
4, 31, 463, xx viii, 2పు.; 25 సెం.మీ.
ఇందు 1043 రాత ప్రతుల వివరణ కలదు.
(చూడు తదుపరి కారు)

170
తంజా — తం సుందర శర్మ, వి.
తంజావూరు సరస్వతి మహల్... సూచి.
1 గ్రంథాలయ సూచి — తంజావూరు సర
స్వతీ మహల్ I గ్రం. నా.

గమనిక

ఒకనాడు దేశంలో నెలకొన్న పాలనా వ్యవహారాల దృష్ట్యా — కొన్ని తెలుగు పుస్తకాల ముఖ పత్రాలు ఇంగ్లీషు, తదితర బాషల్లో ఉన్నాయి. ఎ. ఎ. సి. ఆర్ — 2లో సూచించినట్లు ఇలాటి సందర్భాలలో ప్రచారంలో గల పేరు రాసి, గ్రంథనామాన్ని " = " గుర్తు పెట్టి యథాతథంగా రాయాలి.

## గ్రంథకర్త పేరు ముఖపత్రం మీద లేకుంటే

రచయిత పేరు ముఖపత్రం మీాద లేకుంటే — ఇతర పద్ధతుల ద్వారా పేరు సంపాదించి, రచయిత పేరనే శీర్షిక చేయాలి.

ఉదా : 27

శ్రీరస్తు
విష్ణు చిత్తీయము
అను నామాంతరము గల
**ఆముక్తమాల్యద**
సవ్యాఖ్యానము
వావిళ్ల రామస్వామి శాస్త్రులు వారి టీకా సహితము
చెన్నపురి
**వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు**
వారిచే ప్రకటితము

1954
All Rights Reserved

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం :
2 పుటలు : 100, 686పు
3 ఎత్తు : 21.5 సెం.మీ
4 ప్రవేశ సంఖ్య 1027

894.8271
శ్రీ కృ—ఆ శ్రీకృష్ణదేవరాయలు
ఆముక్తమాల్యద, లేక, విష్ణు చిత్తీయము/ శ్రీ కృష్ణ దేవరాయలు. — మద్రాసు : వావిళ్ల, 1954.
1027 100, 686పు.; 21 సెం. మీ.
1 ప్రబంధాలు I గ్రం.నా.

గమనిక

1 రచయిత పేరు పీఠిక, ఉపోద్ఘాతం మొదలైన ఇతర వనరుల నుంచి సేకరింప వలసి ఉంటుంది.

2 ఒక పుస్తకానికి రెండు పేర్లుంటే ప్రచార నామం ముందు రాసి, కామా (,) పెట్టి 'లేక' అని రాసి మళ్ళీ కామా (,) పెట్టి రెండవ నామం రాయవలసి వుంటుంది.

విష్ణు చిత్తీయము
చూడండి
ఆముక్తమాల్యద

3 ఇచట కార్డుపై పరిచయ సంకేతాలు, ప్రవేశ సంఖ్యలు ఉండవు. ఇది మార్గ సూచిక మాత్రమే.

4 మార్గ సూచికలు ప్రచారంలేని అంశం నుంచి ప్రచారంలో ఉన్న అంశానికి చేయాలి.

5 ఈ కార్డులో ఉప పద్దులు యథారీతి చెయ్యాలి.

ఒకే రచయిత : ద్వ్యర్థి కావ్యాలు

ఉదా : 28

**నెల్లూరి రాఘవ కృతి**

యాదవ రాఘవ పాండవీయం

౧ ఆశ్వాసము

ఆనంద జ్యోత్స్నా విలసితము

టీకాకర్త, ప్రకాశకులు

విద్యాన్ సరిపెల్లి విశ్వనాథశాస్త్రి, ఎం.ఎ.పి.ఒ.ఎల్

హైదరాబాదు

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 894.8271
రా.నె – యా
2 పుటలు [6], x, 66 [8], 62 [4], 112పు.
3 ఎత్తు : 20.5 సెం.మీ.
4 ప్రచురణ కర్త : టీకాకర్త
6 ప్రచురణ సం : 1964
6 ప్రవేశ సంఖ్య : 1028

894.8271
రా.నె-యా రాఘవ, నెల్లూరి

యాదవ రాఘవ పాండవీయం. 1వ ఆశ్వాసము/నెల్లూరి రాఘవ; ఆనంద జ్యోత్స్నా విలసితము టీకాకర్త సరిపెల్లి విశ్వనాథశాస్త్రి. — హైదరాబాదు : టీకాకర్త, 1964.

1028 [6], x , 66 [8], 62, [4], 112పు.; 21 సెం.మీ.

(చూడు తదుపరి కార్డు)

2

894.8271
రా.నె–యా రాఘవ, నెల్లూరి
యాదవ రాఘవ పాండవీయము.
1 ప్రబంధాలు 2 భాగవతం 3 రామాయణం
4 భారతం I విశ్వనాథశాస్త్రి, సరిపల్లె, ప్రే. క. II గ్రం.నా.

గమనిక

ద్వ్యర్థి కావ్యాలు, త్ర్యర్థి కావ్యాలు తెలుగు సాహిత్యంలో ప్రత్యేకమైనవి. కావ్యంలో ఎన్ని అర్థాలున్నాయో అన్ని విషయ శీర్షికలివ్వడం తప్పనిసరి. అంతేగాదు మార్గ సూచికల అవసరం ఆలోచించాలి.
మరొక ఉదా : 29

894.8271
సూ.పిం–రా సూరన, పింగళి
రాఘవ పాండవీయము సటీక/పింగళి శూరన. —
మద్రాసు : వావిళ్ల, 1955.
1029 419పు.; 19 సెం.మీ.
1 ప్రబంధాలు 2 రామాయణం 3 భారతం
I గ్రం. నా.

ఒక రచయిత : ఇద్దరు ప్రచురణకర్తలు (1.4 బి8)

ఉదా : 30

ఆ త్మ క థ

మహాత్మాగాంధీ

అనువాదము

వేలూరి శివరామశాస్త్రి

ప్రకాశకులు

త్రివేణి పబ్లిషర్సు, మచిలీపట్నం

గాంధిసాహిత్య ప్రచురణాలయము,

హైదరాబాదు

(ఆంధ్రప్రదేశ్ గాంధీ స్మారకనిధి)

ఇతర వివరాలు

923

1 పరిచయ సంకేతం : గాంధి—ఆ

2 పుటలు : xxi, 803పు.

3 ఎత్తు : 19.1 సెం.మీ.

4 ప్రచురణ సం : 1968 ఐదవ కూర్పు

5 ప్రవేశ సంఖ్య : 1030

923

గాంధి-ఆ గాంధీ, మోహన్‌దాస్ కరమ్‌చంద్ (1869 – 1948)

ఆత్మకథ/మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ; అనువాదము వేలూరి శివరామశాస్త్రి .— 5వ కూర్పు . — మచిలీపట్నం : త్రివేణి పబ్లిషర్సు; హైదరాబాదు : గాంధీ సాహిత్య ప్రచురణాలయము, 1968.

1030 xxi, 803పు.; 19 సెం. మీ.

1 మహాత్మాగాంధీ — స్వీయ చరిత్ర I శివరామ శాస్త్రి, వేలూరి, అను. II గ్రం.నా.

# 23 బహుకర్తృత్వ గ్రంథాలు

సూచీకరణ నియమాలను అనుసరించి బహుకర్తృత్వ గ్రంథాలు అంటే ఇద్దరు ముగ్గురు అంత కంటే ఎక్కువమంది కలసి—

1 ఒక గ్రంథం రాసినా,
2 గుర్తింపుతో ఒక గ్రంథంలో వేరు వేరు భాగాలు రాసినా,
3 పదాలకు స్వరాలు కూర్చినా,
4 చిత్ర రచనలు చేసినా,
5 ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపినా—ఈ తరగతి క్రిందే వస్తాయి. ఇద్దరు, ముగ్గురు అంతకంటే ఎక్కువ అనువాదకులు, అనుకర్తలు, వ్యాఖ్యాతలు. పరిష్కర్తలు, నివేదికలు తయారు చేసిన వారికీ ఇదే నియమం వర్తిస్తుంది,

ఈ కోవకు చెందిన రచనలను ఎ.ఎ.సి.ఆర్—2 భాగస్వామ్య రచయితల (షేర్డ్ రెస్పాన్సిబిలిటీ) క్రిందికి చేర్చింది (21.6). ఇందలి నియమాలు వివరాలు ఇలా ఉంటాయి.

1 ఇద్దరు రచయితలు (21.6)
2 ఇద్దరు ప్రచురణ కర్తలు (1.428)
3 రెండు ప్రమాణ సంఖ్యలు (1.22, 1.8ఇ)
4 ముగ్గురు రచయితలు (21.6బి)
5 నలుగురు రచయితలు (21.6సి2)

ఇద్దరు గ్రంథకర్తలు

ఒక గ్రంథానికి ఇద్దరు రచయిత లున్నపుడు (ఇందులో ఎవరికీ రచనకు సంబంధించిన ముఖ్యబాధ్యత లేనప్పుడు) తొలి రచయిత పేర శీర్షిక చేయాలి (21.6బి)
ఉదా:31

సౌందర నందము

పింగళి లక్ష్మీకాంతం
కాటూరి వెంకటేశ్వరరావు
కాటూరి కవితాలత పబ్లిషర్సు

ఇతర సమాచారం

1 పరిచయ సంకేతం : 894.8271
ల.పిం–సౌ

2 పుటలు : 84

3 సైజు : 20.5 సెం.మీ.

4 సోల్‌డిస్ట్రిబ్యూటర్సు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ.

5 పింగళి లక్ష్మీకాంతం (1894–1972)
కాటూరి వెంకటేశ్వరరావు (1895–1962)

6 6వ, ముద్రణ 1972, తొలిముద్రణ 1932

7 ప్రవేశసంఖ్య : 1031

894.8271
ల.పిం-సౌ  లక్ష్మీకాంతం, పింగళి (1894–1972)
సౌందర నందము /పింగళి లక్ష్మీకాంతం,
కాటూరి వెంకటేశ్వరరావు. — 6వము. — విజయవాడ: కాటూరి
కవితాలత పబ్లిషర్సు : విశాలాంధ్ర, [సోల్ డిస్ట్రిబ్యూటర్స్],
1972.
1031  1 పద్య కావ్యాలు I వెంకటేశ్వరరావు, కాటూరి
(1895–1962)

మరొక ఉదా:32

894.8271
ప్ర.కూ—గా  ప్రభాకరశాస్త్రి, కూచిభొట్ల
గాథాసప్తశతీసారము/ కూచిభొట్ల ప్రభాకర
శాస్త్రి, కూచిభొట్ల వీర రాఘవస్వామి . —
తెనాలి : సాహితీ సమితి, 1951.
1032  88. 12పు.; 19సెం.మీ.
1 కావ్యాలు I వీరరాఘవస్వామి, కూచిభొట్ల
II గ్రం.నా.

గమనిక

మూలం మరో భాషలో ఉన్నా, సారం మాత్రం తీసుకొని స్వతంత్ర రచన చేశారు గనుక—ఈ రచయితల పేరనే శీర్షిక చేయడం సమంజసం.

## ఇద్దరు గ్రంథ కర్తలు/ఒక సంపాదకుడు

ఒక గ్రంథానికి ఇద్దరు గ్రంథకర్తలు, ఒక సంపాదకుడు ఉన్నా (రచనకు ముఖ్య బాధ్యత ఎవరూ వహించనప్పుడు) తొలి గ్రంథకర్త పేర శీర్షిక చేయాలి.

ఉదా : 33

తెలుగు అకాడమి ప్రచురణ-(బిఏ&బిఎస్‌సి)-29

# సామాన్య భూగోళ శాస్త్రము

ర చ యి త లు

డాక్టర్ కె. సురేందర్ రెడ్డి, ఎమ్.ఎ., పిహెచ్.డి.,

భూగోళశాస్త్ర శాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము

హైదరాబాదు

శ్రీ ఎస్. పర్మాజి, ఎమ్.ఎ., ఎమ్.ఇడి.,

లెక్చరర్, గవర్నమెంట్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్

వరంగల్

స ం పా ద కు డు

డాక్టర్ కె. విఠల్ రెడ్డి, ఎమ్.ఎ., పిహెచ్.డి..బి.ఇడి.,

రీడర్, భూగోళ శాస్త్రశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము

హైదరాబాదు

**తె లు గు అ కా డ మి**

హైదరాబాదు

**1973**

ఇతర వివరాలు :

1 పరిచయ సంకేతం : 910
 సు.కె—సా
2 పుటలు : x, 204, iv పు
3 ఎత్తు : 24.5 సెం.మీ.
4 ప్రవేశ సంఖ్య : 1033

910
సు.కె—సా సురేందర్ రెడ్డి, కె.
సామాన్య భూగోళ శాస్త్రము/కె. సురేందర్ రెడ్డి, ఎస్. పర్మాజి; సంపాదకుడు కె. విఠల్ రెడ్డి. — హైదరాబాదు : తెలుగు అకాడమీ, 1973.
1033 x, 204, ivపు.; 25 సెం.మీ.
1 భూగోళ శాస్త్రం I పర్మాజీ, ఎస్. II విఠల్ రెడ్డి, కె., సంపా. III గ్రం.నా.

మరొక ఉదా : 34
910
వి.వి—సాం విద్యానాథ్, వి.
సాంఘిక భూగోళ శాస్త్రము/వి. విద్యానాథ్, ఆర్. రామమోహనరావు; సంపాదకుడు ఎస్.ఎమ్.అలమ్ — హైదరాబాదు : తెలుగు అకాడమీ, 1972.
1034 xi, 214, viii, పు.; 24 సెం.మీ.
1 భూగోళ శాస్త్రం I రామమోహనరావు, ఆర్., II అలమ్, ఎస్. ఎమ్,. సంపా. III గ్రం.నా.

గమనిక :

1 పై ఉదాహరణలో "తెలుగు అకాడమీ ప్రచురణ (బి.ఎ.&బి.ఎస్.సి)—29" అనేది గ్రంథమాల కాదు. అది ప్రచురణ సంఖ్య మాత్రమే అని గమనించాలి.

2 పాఠ్య గ్రంథాలకు సాధ్యమైనంతవరకు రచయిత పద్దులు చేస్తే చాలు. సంపాదకుని ఉపపద్దు పరిహరింప వచ్చును.

ముగ్గురు గ్రంథ కర్తలు

ఒక పుస్తకానికి ముగ్గురు గ్రంథకర్తలుంటే (రచనకు ముఖ్యబాధ్యత ఎవరూ వహించనప్పుడు) మొదటి గ్రంథకర్త పేరనే శీర్షిక చేయాలి. ముగ్గురు గ్రంథకర్తల పేర్లు శీర్షిక పిదప చేర్చాలి. (21.6.బి)

ఉదా : 35

తెలుగు అకాడమి ప్రచురణ (బి.ఎస్‌సి.) –65

శి లా శా స్త్ర ము

సంకలనము :

డా॥ ఎన్. రమణరావు, ఎమ్.ఎస్‌సి.,డి.రెర్.నాట్. (పశ్చిమజర్మనీ)

డైరెక్టర్, ఓపెన్ యూనివర్సిటీ, హైదరాబాద్.

డా॥ కె. వి. సుబ్బరామయ్య, ఎమ్.ఎస్‌సి.,

భూవిజ్ఞాన శాస్త్ర శాఖాధ్యక్షులు, నానక్‌రామ్ భగవాన్‌దాస్ సైన్స్ కళాశాల, హైదరాబాద్

డా॥ కె. సూర్యప్రకాశరావు, ఎమ్.ఎస్‌సి.,పి.హెచ్‌డి. (ఉస్మానియా)

లెక్చరర్, భూవిజ్ఞాన శాస్త్ర శాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాద్.

సంపాదకుడు

ఆచార్య వై. జె. రావు, ఎమ్.ఎస్‌సి.,పి.హెచ్‌డి. (ఉస్మానియా),

భూవిజ్ఞానశాస్త్ర శాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాద్.

తె లు గు అ కా డ మి

హైదరాబాదు

1983

ఇతరవివరాలు :

1 ప్రవేశ సంఖ్య : 562
ర.ఎన్—శి

2 పుటలు : x, 328

3 ఎత్తు : 24. 5 సెం.మీ.

4 ప్రవేశ సంఖ్య : 1035

562
ర.ఎన్—శి రమణరావు, ఎన్,
శిలాశాస్త్రము/సంకలనము యన్. రమణరావు, కె. వి. సుబ్బ
రామయ్య, కె. సూర్యప్రకాశరావు; సంపాదకుడు వై. జె. రావు
—హైదరాబాదు : తెలుగు అకాడమీ, 1983.
1035 x, 328పు.; 25 సెం.మీ.
I సుబ్బరామయ్య, కె. వి. II సూర్యప్రకాశరావు, కె.
III వై. జె. రావు, సంపా. IV గ్రం.నా.

మరొక ఉదా : 36
533.1
కే.బి—స్థి కేశవరావు, బి.
స్థితిశాస్త్రము/సంకలనము బి. కేశవరావు, పి. భుజంగ
రావు, యన్. వి. శేషగిరిరావు; సంపాదకుడు వనజా
అయ్యంగార్. — హైదరాబాదు : తెలుగు అకాడమీ, 1976.
1036 viii, 272పు.; 25 సెం.మీ.
I భుజంగ రావు, పి. II శేషగిరిరావు, యన్.వి.,
III రావు, వై, జె, సంపా. IV గ్రం.నా.

### నలుగురు కంటె ఎక్కువమంది గ్రంథకర్తలు

ఒక గ్రంథానికి నలుగురు, అంతకంటె ఎక్కువమంది గ్రంథకర్తలున్నపుడు, అందరికీ సమాన బాధ్యత ఉన్నపుడు గ్రంథనామంతోనే శీర్షిక చేయాలి. (21. 6సి2)
ఉదా : 37

తెలుగు అకాడమి ప్రచురణ–(బి.ఎస్.సి.)–64

**సకశేరుకాలు**

**తృతీయ భాగము**

రచయితలు

శ్రీ కె. ఆర్. కె. మూర్తి, ఎమ్.ఎస్‌సి.

డా॥ కుమారి కె. శ్యామసుందరి, ఎమ్.ఎస్‌సి., పిహెచ్.డి.

ఆచార్య యన్. వి. కృష్ణమూర్తి, ఎమ్.ఏ., ఎమ్.ఎస్‌సి.

డా॥ కె. భక్తవత్సలరావు, ఎమ్.ఎస్‌సి., పిహెచ్.డి.

సంపాదకుడు

డా॥ బి. మాధవరెడ్డి, ఎమ్.ఎస్‌సి.

ఆచార్య కె. హనుమంతరావు, ఎమ్.ఎస్‌సి., డి.ఎస్‌పి., ఎఫ్.హెచ్.ఎస్.

డా॥ వి. ఎస్. ఆర్. మూర్తి, ఎమ్. ఎస్‌సి., పిహెచ్.డి.

డా॥ టి. వాసుదేవ్, యమ్. ఎస్‌సి., పిహెచ్.డి.

**తెలుగు అకాడమి**

హైదరాబాదు

**1984**

ఇతర వివరాలు :

1 పరిచయ సంకేతం : 592
సక.స

2 పుటలు : x, 168పు.

3 ఎత్తు : 21 సెం.మీ.

4 ప్రవేశ సంఖ్య : 1037

592
సక—స సకశేరుకాలు. తృతీయ భాగము/కె.ఆర్.కె.
మూర్తి . . . [తదితరులు]; సంపాదకులు
బి. మాధవరెడ్డి . . . [తదితరులు]. —
హైదరాబాదు : తెలుగు అకాడమి, 1984.
1037 x, 168పు. ; 21సెం.మీ.
I మూర్తి, కె. ఆర్. కె. II మాధవరెడ్డి, బి., సంపా.

గమనిక :

గ్రంథ నామాన్ని శీర్షికగా ఎంపిక చేస్తే —శీర్షిక తప్ప ఆ పేరా లోని మిగతా విషయ మంతారెండో హద్దు నుంచే ప్రారంభించాలి.

మరొక ఉదా : 38

592
వృక్ష—వృ వృక్ష శరీర ధర్మశాస్త్రము. మొదటి భాగము/
పి.వి. భైరవ మూర్తి. . . [తదితరులు] . — హైదరాబాదు: తెలుగు అకాడమీ, 1986.
1038 viii, x, 142పు.; 23సెం.మీ.
I భైరవ మూర్తి, పి.వి.

గమనిక :

1 ఇచట గ్రంథ నామం, విషయం ఒకటే కావడంచేత, విషయపు ఉపపద్దు వేరుగా చేయాల్సిన పనిలేదు.

2 మిగతా రచయితలకు – ఉపపద్దులు చేయవలసిన అవసరం లేదు—వారెంతో గొప్పవారైతే తప్ప.

జంట కవులు :

తెలుగులో జంటకవుల రచనలు ఒక ప్రత్యేకత. జంటకవుల రచనలకు ప్రచార నామంతో శీర్షిక చేసి అసలు పేర్లనుంచి మార్గ సూచికలు చేయాలి.
ఉదా : 39

# గీరతము

తిరుపతి వేంకటేశ్వరులు
చెళ్లపిళ్ల వెంకట శాస్త్రి అండ్ సన్సు
కడియం—తూ.గో.జిల్లా.
1954

ఇతర వివరాలు :

పరిచయ సంకేతం : 894.8271
తిరు—గీ

పుటలు : 16, 350పు
ఎత్తు : 21.5సెం.మీ.
ప్రవేశ సంఖ్య : 1039

894.8271
తిరు—గీ తిరుపతి వేంకటేశ్వర కవులు
గీరతము/తిరుపతి వేంకటేశ్వర కవులు. —
కడియం : చెళ్లపిళ్ల వెంకట శాస్త్రి అండ్ సన్సు, 1954.
1039 16,350పు.; 22సెం.మీ.
1 పద్య కావ్యాలు I గ్రం.నా.

వెంకటశాస్త్రి, చెళ్లపిళ్ల
చూడండి
తిరుపతి వేంకటేశ్వరకవులు

తిరుపతి శాస్త్రి, దివాకర్ల
చూడండి
తిరుపతి వేంకటేశ్వర కవులు

తిరుపతి వేంకట కవులు
చూడండి
తిరుపతి వేంకటేశ్వర కవులు

గమనిక :

తిరుపతి వేంకటేశ్వర కవులకు తిరుపతి వెంకట కవులు—అనేది ప్రచార నామం. అందు చేత మరో మార్గ సూచిక చేయవలసి ఉంటుంది.

ఇద్దరు స్వరకర్తలు

ఉదా:40

# రాగమాలికాభరణి

(స్వర సాహిత్యముతోసహా)

సంగీత కళానిధి డా. ఎమ్. బాల మురళీకృష్ణ గారి

అభిప్రాయముతో

గ్రంథ కర్తలు

వైణిక విద్యాన్ శ్రీ ఎన్. సి. పార్థసారధి

(రిటైర్డ్ లెక్చరర్, మద్రాసు యూనివర్శిటీ)

శ్రీమతి ఎన్. సి. ద్వారకా పార్థసారధి

(ప్రిన్సిపాల్, మద్రాసు సంగీత కళాశాల, మద్రాసు–600086

ప్రచురణ

మద్రాసు సంగీత కళాశాల పబ్లికేషన్సు

గోపాలపురం, మద్రాసు–86

1982

కాపీరైట్సు]

ఇతరవివరాలు

1 పరిచయసంకేతం: 784 పా.న–రా

2 పుటలు: viii, 237పు

3 సైజు – 24 సెం.మీ

4 ప్రవేశ సంఖ్య : 1040

794

పా.న–రా పార్థసారధి, నల్లాన్ చక్రవర్తుల

రాగమాలికాభరణి/నల్లాన్ చక్రవర్తుల పార్థసారధి, ద్వారకా పార్థసారధి. — మద్రాసు: మద్రాసు సంగీత కళాశాల, 1982.

1040 viii, 237పు.; 24సెం.మీ.

1 గాత్ర సంగీతం I ద్వారకా పార్థసారధి, న.చ.

II గ్రం. నా.

# 24 మిశ్రమ బాధ్యతగల రచయితల గ్రంథాలు

సాధారణంగా ఒకే రచయిత లేదా కొందరు రచయితలు కలసి రచనలు చేస్తుంటారు. ఈ రచనలకు మరికొందరు తమ రచనాపాటవాన్ని, పాండిత్యగరిమను, పరిశోధనా ప్రకర్షను చేర్చి, ఒకచో అనువదించి, అనుసరించి, సంక్షిప్తీకరించి, ఇతర ప్రక్రియల ద్వారా వెలుగులోకి తెస్తారు. వాస్తవానికి వీరందరూ గ్రంథ కర్తృత్వంలో మూల రచయిత / రచయితలతో బాధ్యత పంచుకోవలసిన వారే. వీరిలో

1 పరిష్కర్తలు, వ్యాఖ్యాతలు—
2 సంపాదకులు, సంచాలకులు, సంకలన కర్తలు—
3 అనువాదకులు, అను కర్తలు, సంక్షిప్త కర్తలు/ విస్తృతకర్తలూ—
4 నవలీకరించిన వారు, నాటకీకరించిన వారు, పద్యరూపం ఇచ్చినవారూ—
5 చిత్రీకరించిన వారూ / చాయాగ్రాహకులూ—
6 టీకా / తాత్పర్యాదులు కూర్చినవారూ—

సూచీకరణకు సంబంధించినంతవరకు మిశ్రమ బాధ్యతగల రచయితలుగానే గుర్తించ వలసినవారే.

## ఒక ప్రత్యేక గమనిక

విజ్ఞాన సర్వస్వాలు, నిఘంటువులు, పదకోశాలు మొదలైన సంపాదక / సంకలన గ్రంథాలలో శీర్షిక మినహా ఆపేరాలోని మిగతా భాగమంతా రెండో హద్దునుంచే ప్రారంభించాలి. గ్రంథ నామం తోనే ప్రధాన పద్దుచేయాలి (21.77)

పరిష్కరించిన గ్రంథాలు

ఒక గ్రంథాన్ని పరిష్కరించినా, సంస్కరించినా, పెంచినా, తగ్గించినా మూల రచయిత/సంస్థ పేర శీర్షిక చేయాలి (21.12ఏ)

ఉదా: 41

ఇందుమతీ పరిణయము

(ప్రబంధము)

తెనాలి రామ భద్రకవి ప్రణీతము

పరిష్కరణ:

ఉపోద్ఘాతము:

డాక ర్ దివాకర్ల వేంకటావధాని, MA, (Hons,) Ph. d.

తొలిపలుకు

వాఙ్మయ మహోధ్యక్ష

డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

"కళాప్రపూర్ణ"

ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు

లైబ్రరీ అండ్ రీసెర్చి ఇన్స్టిట్యూట్

(State Archives)

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

హైదరాబాదు

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 804.8271
రా.తె—ఇం

2 పుటలు : xxxvii, 126, 2

3 సైజు : 23.5 సెం.మీ.

4 ప్రచురణ సం : లేదు

5 ప్రవేశసంఖ్య : 1041

894.8271
రా. తె—ఇం     రామభద్రకవి, తెనాలి
ఇందుమతీ పరిణయము / తెనాలి రామభద్ర
కవి; పరిష్కరణ దివాకర్ల వేంకటావధాని; తొలిపలుకు
వడ్లమూడి గోపాలకృష్ణయ్య. — హైదరాబాదు:
1041     ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ అండ్
రీసెర్చి ఇన్స్టిట్యూట్, [1972].

(చూడు తదుపరి కార్డు)

2

894.8271
రా. తె— ఇం     రామ భద్రకవి, తెనాలి
xxxvii, 126,2పు.; 24 సెం.మీ.
1041     1 ప్రబంధాలు I వేంకటావధాని, దివాకర్ల పరిష్క.
II గోపాల కృష్ణయ్య, వడ్లమూడి తొ.ప. III గ్రం.నా.

గమనిక

1 కార్డులో ఉదహరించాల్సిన సమాచారం హెచ్చుగా ఉంటే, మిగిలింది అదే కార్డు వెనుక రాయకూడదు. రెండవకార్డుపై పై విధంగా రాయాలి.

2 తొలి పలుకు / పీఠిక / ఉపోద్ఘాతం గ్రంథానికి వన్నె చేకూరేద్పైతే, అది రాసిన వారిపేర ఉపపద్దులు చేయాలి.

**టీకా తాత్పర్యాలు సమకూర్చిన గ్రంథాలు**

అయితే ఒక గ్రంథానికి టీకా తాత్పర్యాలు సమకూర్చి, పాఠ్యభేదాలను సవరించి విపులార్థాలను, వివరించిన వ్యాఖ్య చేసిన సందర్భాలలో మూల రచయిత ప్రాధాన్యం తగినంత ఉంటే, మూల రచయిత పేర శీర్షిక చేయాలి.

ఉదా:42

చేమకూర వేంకటకవి

విజయ విలాసము

హృదయోల్లాస వ్యాఖ్య

రచన

తాపీ ధర్మారావు

1986

'విశిష్టరచనలు'

హైదరాబాదు–20

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 894.8271
వెం. చే– వి

2 పుటలు : 4, 672 పు

3 సైజు : 24.5 సెం.మీ.

4 ప్రవేశసంఖ్య : 1042

894.8271
వేం. చే—వి	వేంకటకవి, చేమకూర
విజయ విలాసము/చేమకూర వేంకటకవి;
హృదయోల్లాస వ్యాఖ్య తాపీ ధర్మారావు . — హైదరాబాదు:
విశిష్ట (పచురణలు, 1968.
1042	4, 672 పు.; 25 సెం.మీ.
1 (పబంధాలు I ధర్మారావు, తాపీ, వ్యా. II (గం.నా.

మరొక ఉదా: 43

894.8271
పె. అ— మ	పెద్దన, అల్లసాని
మనుచరి(తము, లేక, స్వారోచిష మనుసంభవము/అల్లసాని
పెద్దన; వ్యాఖ్య వెంపరాల సూర్య నారాయణశా(స్త్రి. —
విజయవాడ: వేంక(టామ అండ్ కో, 1968.
1043	185, Lix, 802, xii పు.; 21 సెం.మీ.
1 (పబంధాలు I సూర్యనారాయశా(స్త్రి,
వెంపరాల, వ్యా. II (గం. నా.

వ్యాఖ్య ప్రధాన గ్రంథాలు :

మూల రచన కంటే వ్యాఖ్యానానికి చాల అధిక్యత, ప్రాధాన్యం ఉంటే వ్యాఖ్యాత పేరనే శీర్షిక చేయాలి. (21.12బి)

ఉదా : 44

తిక్కన కవితా వైభవం

కవిబ్రహ్మ తిక్కన సోమయాజి
కమనీయ పద్యాలకు రమణీయ వ్యాఖ్య

వ్యాఖ్యాత

డా॥ పాటిబండ మాధవశర్మ

యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ

5 కింగ్స్‌వే, సికిందరాబాదు—3

ఇతర వివరాలు :

1 పరిచయ సంకేతం: 894.8271 2 పుటలు : 44
మా.పా—తి

3 సైజు : 21 సెంమీ 4 ప్రచురణ సం: 1 డిశంబర్, 1974

5 వెల. రూ. 2—00 6 ప్రవేశ సం : 1044

894.8271

మా.పా—తి మాధవశర్మ, పాటిబండ

తిక్కన కవితా వైభవం : కవిబ్రహ్మ తిక్కన సోమయాజి కమనీయ పద్యాలకు రమణీయ వ్యాఖ్య/తిక్కన; వ్యాఖ్యాత పాటిబండ మాధవశర్మ. — సికిందరాబాద్ : యువభారతి, 1974.

1044 44పు.; 21సెం.మీ.

1 సాహిత్య విమర్శ I తిక్కన II గ్రం.నా.

మరొక ఉదా : 45

294.5
వే.ప–భ వేణుగోపాలరావు, పప్పు
భజగోవింద శ్లోకాలు/శంకరాచార్య;
వ్యాఖ్యాత పప్పు గోపాలరావు. —
మద్రాసు : రాజాలక్ష్మి ఫౌండేషన్, 1984.
1045 vii, 63పు.; 21సెం.మీ.
1 హిందూమతం I శంకరాచార్య II గ్రం.నా.

గమనిక :

శంకరాచార్యుల వారు చెప్పిన భజగోవింద శ్లోకాలకు తేట తెలుగు వ్యాఖ్యలో— వ్యాఖ్య ప్రధానంగా ఉంది గనుక వ్యాఖ్యాత పేరుతో ప్రధాన పద్దు చేయడం జరిగింది.

మరొక ఉదా :

894.8271
దు.ప–పె దుర్గయ్య, పల్లా
పెద్దన కవితా వైభవం : అల్లసాని పెద్దన మనుచరిత్ర నుండి ఎన్నికయిన పద్యాలకు మన్నికైన వ్యాఖ్యానం/అల్లసాని పెద్దన; వ్యాఖ్యాత పల్లా దుర్గయ్య. — సికిందరాబాదు : యువభారతి, 1980.
1240 74పు.; 21సెం.మీ.
1 పద్య కావ్యాలు I పెద్దన, అల్లసాని II గ్రం.నా.

సంపాదిత గ్రంథాలు

సంపాదిత గ్రంథాలకు మూల రచయిత ఉంటే — ఆ రచయిత పేరనే శీర్షిక చేయాలి

ఉదా : 46

వేంకట రమణీయవాణి — 17

గ్రంథాలయ జ్యోతి

గ్రంథాలయ పితామహ

గ్రంథాలయోద్ధారక

గ్రంథాలయ శాస్త్ర విశారద

అయ్యంకి వేంకట రమణయ్య

వ్యాస సంపుటి 1910 –1966

సంపాదకులు

వెలగా వెంకటప్పయ్య

ప్రిన్సిపాల్, స్కూల్ ఆఫ్ లైబ్రరీ సైన్సు, విజయవాడ – 6

1967

సరస్వతీ సామ్రాజ్య ప్రచురణ ట్రస్టు

బీసెంటు రోడ్డు — విజయవాడ — 2

ఇతర వివరాలు

020.8

1 పరిచయ సంకేతం : వేం.అ—గ్రం

2 పుటలు : 40, 88, 400పు

3 ఛా. చి : 30

4 సైజు : 21.5 సెం.మీ.

5 ప్రవేశ సంఖ్య : 1046

020.8
వేం.అ—గ్రం వేంకట రమణయ్య, అయ్యంకి (1890 – 1979)
గ్రంథాలయ జ్యోతి : వ్యాస సంపుటి 1910–1966/
అయ్యంకి వేంకట రమణయ్య; సంపాదకుడు వెలగా వెంకటప్పయ్య
. — విజయవాడ: సరస్వతీ సామ్రాజ్యం, 1967.
1046 40, 88, 400పు.: 30 ఛా.చి.; 22 సెం.మీ. —
(వేంకట రమణీయ వాణి ; 1).
1 గ్రంథాలయోద్యమం I వెంకటప్పయ్య, వెలగా,
సంపా. II గ్రం. నా.

మరొక ఉదా : 47

327
సు.ఎం—అ సుబ్బారావు, ఎం. వి.
అలీన విధానము/ఎం. వి. సుబ్బారావు; సంపాదకుడు
కె. కమలనాథన్ . — హైదరాబాదు: తెలుగు
అకాడమీ, 1984.
1047 [4], 123పు.; 21 సెం. మీ.
1 అంతర్జాతీయ సంబంధాలు I గ్రం. నా.

గమనిక

ఇది మనోగ్రాఫ్ — చిన్న పుస్తకం. అయినా పుస్తకంగానే గుర్తించి సూచీకరణ చేయవలసి ఉంది.

సంకలన గ్రంథాలు

ఉదా : 40

# రేడియో కార్య క్రమాలపై వ్యాస సంకలనం

ప్రసార తరంగిణి

కూర్పు : పన్నాల సుబ్రహ్మణ్యభట్టు

డా॥ అయ్యగారి వీరభద్రరావు
ఎ. లక్ష్మణరావు
డా॥ టి. దోణప్ప
అమరేంద్ర
గుమ్మలూరు సత్యనారాయణ
డా॥ వెలగా వెంకటప్పయ్య
న్యాపతి రాఘవరావు
కొండముది హనుమంతరావు
పాలగుమ్మి పద్మరాజు
చాట్ల శ్రీరాములు
ఎ. రాజారాందాస్
సి. రాఘవాచారి
వాడ్రేవు పతంజలి
ప్రయాగ నరసింహశాస్త్రి
వి.ఎ.కె. రంగారావు
బి. రజనీ కాంతారావు
భట్టు

మన ప్రచార సాధనాల వినియోగంపై
17 మంది ప్రముఖుల అనుభవసారం
ఆలోచనకీ పరిశోధనకీ ఆది గ్రంథం

ప్రచురణ
సామాన్య ప్రచురణలు
చెరకుపల్లి వారివీధి, పిఠాపురం

ఇతర సమాచారం

089.4827

1 పరిచయ సంకేతం : ప్రసా—ప్ర
2 పుటలు : 176
3 సైజు : 21.5 సెం.మీ
4 ప్రచురణ సం :1986
5 ప్రవేశ సంఖ్య : 1048

089.4827
ప్రసా – ప్ర   ప్రసార తరంగిణి: రేడియో కార్యక్రమాలపై వ్యాస సంకలనం/అయ్యగారి వీరభద్రరావు ... [తదితరులు]; కూర్పు పన్నాల సుబ్రహ్మణ్యభట్టు
. — పిఠాపురం: సామాన్య ప్రచురణలు, 1986.
మన ప్రచార సాధనాల వినియోగంపై 17 మంది ప్రముఖుల అనుభవ సారం. ఆలోచనకీ పరిశోధనకీ ఆది గ్రంథం.
1048   176పు.; 22 సెం.మీ.
1. రేడియో కార్యక్రమాలు I వీరభద్రరావు, అయ్యగారి II సుబ్రహ్మణ్య భట్టు, పన్నాల, కూర్పు.

మరొక ఉదా : 49

089.4827
మహ–మ   మహతి: స్వాతంత్ర్యయుగోదయం(1947 – 1972) లో తెలుగు తీగ వెన్నెలు/సంపాదకుడు జి. వి. సుబ్రహ్మణ్యం, ఇరివెంటి కృష్ణమూర్తి, వంగపల్లి విశ్వనాథం. — సికింద్రాబాదు: యువభారతి, 1972.
1049   387పు.; 23 సెం.మీ.
1 వ్యాసాలు

గమనిక

సంపాదకులు హెచ్చుగా ఉన్నపుడు, ప్రత్యేక సందర్భాలలో తప్ప ఉపపద్దులు చేయాల్సిన పనిలేదు.

అనువాద గ్రంథాలు

ఒక భాష నుంచి మరో భాషలోకి ఒక గ్రంథాన్ని అనువదిస్తే, మూల రచయిత పేరే శీర్షిక చేయాలి (21.30 కె1)

ఉదా : 50

భారతదేశము – ప్రజలు

అడవులు – అటవిశాస్త్రము

రచన
కె. పి. సాగరీయ

అనువాదం
టి. రామచంద్రరావు

నేషనల్ బుక్ ట్రస్టు, ఇండియా
న్యూఢిల్లీ

ఇతర సమాచారం

634.9

1 పరిచయ సంకేతం : సా.కె—అ

2 పుటలు : xii, 286

3 సైజు : 19.5 సెం.మీ.

4 ప్రచురణ సం : 1967

5 అనుబంధంలో కొన్ని చెట్ల పేర్లు, వివరణ, పరిభాష ఉంది.

6 ప్రవేశ సంఖ్య : 1050

684.9
సా.కె–అ సాగరీయ, కె.పి.

అడవులు–అటవీశాస్త్రము/కె.పి. సాగరీయ; అనువాదం టి. రామచంద్ర రావు. — న్యూఢిల్లీ: నేషనల్ బుక్ట్రస్టు, 1967.

xii, 286పు.; 20సెం.మీ. — (భారతదేశం – ప్రజలు).

1అడవులు I రామచంద్రరావు, టి, అను.

II గ్రం. నా. (గ్రంథమాల)

గమనిక :

1 ఉన్నమూలాన్ని ఉన్నట్లు అనువాదం చేస్తే యథాతథ అనువాదం అంటారు. మూలభావాన్ని తీసుకొని పేర్లు మార్చి, పరిసరాలు మార్చి రాస్తే భావానువాదం/స్వేచ్ఛానువాదం అంటారు. ఏమైనప్పటికీ అనువాదాలకు పద్దులు చేసే విషయంలో పై నియమం పాటించాలి.

2 మూలగ్రంథంలోని భావాన్ని మాత్రం తీసుకొని స్వేచ్ఛగా రచన చేస్తే అది అనుసరణ అవుతుంది.

3 స్వేచ్ఛానువాదం / అనుసరణల మధ్యగల భేదం చాల స్వల్పమైంది. గుర్తించడంలో ఇద్దరిమధ్య తేడా రావచ్చు.

ఉదా : 51

342
జ.పి–అ జగన్మోహనరెడ్డి, పి.

అల్ప సంఖ్యాక వర్గాలు – రాజ్యాంగము/పి. జగన్మోహనరెడ్డి; అనువాదం ఎన్. ఇన్నయ్య. — హైదరాబాదు: తెలుగు అకాడమీ, 1984.

1051 [8], 202పు.; 24 సెం.మీ.

1 ఇన్నయ్య, ఎన్. అను. II గ్రం.నా.

అనుసరణలు

ఒక రచనను అనుసరించినా/తిరిగి రాసినా/సులభశైలిలో రాసినా/ప్రక్రియమార్చినా— ఈ మార్పుకు కారణ భూతమైన వ్యక్తి పేర శీర్షిక చేయాలి. (21.10). మూలగ్రంథ కర్త, గ్రంథనామం పేర ఉపపద్దులు చేయాలి.

ఉదా : 52

కవిసార్వభౌముడు

శ్రీనాథుని

శృంగార నైషధము

రచన

విద్వాన్ దేవరకొండ చిన్ని కృష్ణ శర్మ

శ్రీమహాలక్ష్మి పబ్లికేషన్సు

గవర్నరుపేట — విజయవాడ—2

ఇతర సమాచారం

1 పరిచయ సంకేతం : 894.82784
చి.దే—శ్రీ

2 పుటలు : 318

3 సైజు : 19.5సెం.మీ.

4 ప్రచురణ సంఖ్య : 1976

2 ప్రవేశసంఖ్య : 1052

894.82784
చి.దే–శ్రీ
చిన్ని కృష్ణ శర్మ, దేవరకొండ
శ్రీనాథుని శృంగార నైషధము/ [అనుసరణ] దేవరకొండ చిన్నికృష్ణశర్మ. — విజయవాడ : శ్రీ మహాలక్ష్మి పబ్లికేషన్సు, 1976.
1052
318పు.; 20 సెం.మీ.
1 వచన కావ్యాలు I శ్రీనాథుడు II శృంగార నైషధం

మరొక ఉదా : 53

894.8272
ల.ఉ–నా
లక్ష్మినారాయణ, ఉన్నవ
నాయకురాలు/ఉన్నవ లక్ష్మినారాయణ. —6వ ము. — మచిలీపట్నం : త్రివేణి పబ్లిషర్సు, 1983.
1053
xviii, 132పు.; 19సెం.మీ.
శ్రీనాథుని పల్నాటి వీర చరిత్రకు నాటకీకరణ.
1 నాటకం I శ్రీనాథుడు II గ్రం.నా.

గమనిక :

1 సూచీ పరిధిని బట్టి మూల రచయిత, మూల గ్రంథం పేర్లకు ఉపపద్దులను చేయవచ్చు. వదలివేయవచ్చు.

లేఖలు/ఉత్తరాలు/డైరీలు/చర్చలు

ఒకరు మరొకరికి రాసిన లేఖలు, స్వయంగా రాసుకున్న డైరీలు, ఆరాసిన వ్యక్తి రచయిత పేరు మీదే శీర్షిక చేయాలి.

ఉదా : 54

లేఖల్లో సంజీవదేవ్

సంజీవదేవ్

కాంతికుంజ

సంస్కృతిక సంస్థ, తెనాలి 522 201

ఇతర సమాచారం

1 పరిచయ సంకేతం : 089 4827
సంజీ—లే

2 పుటలు: 254

3 సైజు: 21.2

4 ప్రవేశసంఖ్య : 1054

5 సంజీవదేవ్ మిత్రులకు రాసిన లేఖలు

089.4827

సంజీ — లే సంజీవదేవ్

లేఖల్లో సంజీవదేవ్/సంజీవదేవ్. — తెనాలి:
కాంతికుంజ, 1986.

1054 254పు.; 22సెం.మీ.

1 లేఖలు—సంజీవదేవ్ I గ్రం.నా.

సంగ్రహాలు

సంక్షిప్తీకరించిన గ్రంథాలకు మూల రచయిత పేరనే శీర్షిక చేయాలి

ఉదా : 55

## మాలపల్లి

ఉన్నవ లక్ష్మీనారాయణ

సంగ్రహణ

మరుపూరు కోదండ రామిరెడ్డి

సాహిత్య అకాడెమీ పక్షమున

త్రివేణి పబ్లిషర్సు

మచిలీపట్టణం—1

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 894.8273
ల.ఉ—మా

2 పుటలు : xx , 416

3 సైజు : 16.5 సెం మీ.

4 ప్రచురణ సం : 1976

5 ప్రవేశ సంఖ్య : 1055

894.8273

ల.ఉ–మా లక్ష్మీనారాయణ, ఉన్నవ

మాలపల్లి/ఉన్నవ లక్ష్మీనారాయణ; సంగ్రహణ: మరుపూరు కోదండ రామిరెడ్డి. — మచిలీపట్టణం: సాహిత్య అకాడెమీ పక్షమున త్రివేణి పబ్లిషర్సు, 1976.

1055 xx, 416పు.; 17 సెం.మీ.

1 నవల I కోదండ రామిరెడ్డి, మరుపూరు, సంగ్ర. II గ్రం.నా.

విజ్ఞాన సర్వస్వాలు

ఉదా : 56

# విజ్ఞాన సర్వస్వము

మొదటి సంపుటము

(పరిష్కృతము)

**చరిత్ర-రాజనీతి**

సంపాదకులు

(మొదటి ముద్రణ)

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎమ్. ఏ.

డాక్టరు గిడుగు వెంకట సీతాపతి, బి.ఏ.ఎల్.టి, డి.లిట్

ఆచార్య ప్రతాపగిరి రామమూర్తి, ఎమ్.ఏ.

సంపాదకుడు

(రెండవ ముద్రణ)

శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్య, ఎమ్.ఏ.

సంగ్రాహకుడు

శ్రీ చీమకుర్తి శేషగిరిరావు

1967

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 039.4827
విజ్ఞా—వి

2 ప్రతి సంపుటం విడి విడి పుట సంఖ్యలు కలిగి ఉన్నది.

3 సైజు : 23.5 సెం.మీ.

4 ప్రవేశ సంఖ్య : 21056–21069

5 14 సంపుటాలు గలవు. ప్రతి సంపుటంలో విషయ భేదం గలదు.

039.4827
విజ్ఞా—వి

21056—
21069

విజ్ఞాన సర్వస్వము. — హైదరాబాదు:
తెలుగు భాషా సమితి, 1967—1979.
14 సం.; 24 సెం.మీ.
విషయ సూచిక: సం. 1. చరిత్ర — రాజనీతి — సం. 2. భౌతిక, రాసాయనిక శాస్త్రములు — ... సం. 14. లలిత కళలు.
1. విజ్ఞాన సర్వస్వాలు I హరి సర్వోత్తమరావు, గాడిచర్ల, సంపా. II గ్రం.నా.

గమనిక

1 తెలుగు భాషా సమితి వారి "విజ్ఞాన సర్వస్వము" ఇప్పటికి 14 సంపుటాలలో వెలువడింది. మరో రెండు సంపుటాలు వెలువడ వచ్చు. ప్రతి సంపుటం ఒక్కొ విషయానికి చెందినది. కనుక విషయ భేదంగల ప్రతి సంపుటానికి ఒక ప్రధాన పద్దు చేయడం సముచితం. పై పద్దులో అవసరం అనుకొంటే మొదటి ముద్రణకు సంబంధించిన సంపాదకుల వివరాలు 'నోట్'లో ఇవ్వచ్చు.

2 ఈ విజ్ఞాన సర్వస్వము — తదుపరి సంపుటాలు తెలుగు విశ్వ విద్యాలయ ఆధ్వరణలో వెలువడతాయి.

3 "సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము" 8 సంపుటాలలో పూర్తయింది. 1 — 8 సంపుటాలు అక్షర క్రమంలో ఉన్నాయి. కనుక అన్ని సంపుటాలకు ఒక ప్రధాన పద్దు సరిపోతుంది.

ఉదా : 57

శ్రీ

# శబ్దరత్నాకరము

అనునీ యకారాది యాంధ్ర నిఘంటువు

చెన్న పట్నణపు బోధనాభ్యసన పాఠశాల యందు ఆంధ్ర పండితులుగ నుండిన

## బ. సీతారామాచార్యులచే

వ్రాయబడి
దేశభాషా గ్రంథ కరణ సభవారి
ఆంధ్రభాషాధ్యక్షులచే సరిచూడఁబడి ప్రచురము చేయఁబడియె
పరిష్కర్త : అనుబంధకర్త
పరిశోధనా పరమేశ్వర
విద్యారత్న నిడుదవోలు వేంకటరావు, ఎమ్.ఏ.
చెన్నపట్నణము
చెన్నపట్నణపు దేశభాషా గ్రంథ కరణ సభ
1969

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 494.8273 సీ.బ—శ్రీ

2 పుటలు 20, 868

3 ఎత్తు : 24.4 సెం.మీ.

4 ప్రవేశ సంఖ్య : 1057

494.8273
సీ.బ—శ్రీ సీతారామాచార్యులు, బహుజన పల్లి

శ్రీశబ్ద రత్నాకరము : అనునీయకారాది యాంధ్ర నిఘంటువు/ బహుజనపల్లి సీతారామా చార్యులు; పరిష్కర్త, అనుబంధకర్త నిడుదవోలు వేంకటరావు. — 10వ ము . — చెన్నపట్నణము: దేశ భాషా గ్రంథ కరణ సభ, 1969.

1057 28, 868పు.; 25 సెం.మీ.

I వేంకటరావు, నిడుదవోలు, పరి. II గ్రం.నా.

పద ప్రయోగ కోశాలు

ఒక రచయిత ఉపయోగించిన పదాలన్నింటిని ఒక చోట చేర్చి ఏ పదాన్ని ఏ సందర్భంలో ఏ అర్థంలో ఎన్నెన్ని సార్లు వాడారో తెలియ జేసే గ్రంథాన్ని పద ప్రయోగ కోశం (కంకార్డెన్స్) అంటారు.

ఒక గ్రంథకర్త ఉపయోగించిన పదాల పట్టికను తెలిపే పద కోశాలను తయారు చేసిన వారి పేర ప్రధాన శీర్షికను నమోదు చేయాలి.

ఉదా : 58

నన్నయపద ప్రయోగ కోశము

సంకలన కర్తలు

అబ్బూరి రామ కృష్ణారావు

డా. దివాకర్ల వేంకటావధాని ఎం.ఏ. (ఆనర్స్) పి.హెచ్.డి

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

హైదరాబాదు

1969

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 494.8273
రా.అ—న

2 పుటలు : 4,795

3 ఎత్తు : 26.5 సెం.మీ

4 ప్రవేశ సంఖ్య : 1058

494.8273

రా.అ—న రామకృష్ణారావు, అబ్బూరి

నన్నయ పద ప్రయోగ కోశము/సంకలన కర్తలు అబ్బూరి రామకృష్ణారావు, దివాకర్ల వేంకటావధాని. — హైదరాబాదు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1969.

1058 4,795పు.; 27 సెం.మీ.

I వేంకటావధాని, దివాకర్ల, సంక. II గ్రం.నా.

గ్రంథకర్త లేని గ్రంథాలు

ఒక గ్రంథానికి గ్రంథకర్త పేరు తెలుసుకోడానికి అవకాశం లేకపోతే గ్రంథనామం పేరనే శీర్షిక చేయాలి (21.5ఎ). అయితే సమరూప శీర్షిక గల గ్రంథాల విషయంలో, గ్రంథకర్తపేర్లు లభించని గ్రంథాలకు గ్రంథనామంతో శీర్షిక చేయరాదు. వీటికి సమరూప శీర్షిక గ్రంథాల పద్ధతిలోనే శీర్షిక చేయాలి.

ఉదా : 59

చైనా జపాన్
ప్రసిద్ధ కథలు

అను:

సూరాబత్తుల సుబ్రహ్మణ్యం

సికింద్రాబాదు
సివాజీ ప్రెస్ 1960

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 851.3
చైనా—చై

2 పుటలు : 127

3 సైజు : 19 సెం.మీ.

4 ప్రవేశ సంఖ్య : 1059

851.3

చైనా—చై   చైనా జపాన్ ప్రసిద్ధ కథలు/అనువాదం సూరాబత్తుల సుబ్రహ్మణ్యం
. — సికింద్రాబాదు: [ప్ర.క.లే], 1960
(సికింద్రాబాదు : సివాజీ ప్రెస్).
127పు.; 19 సెం.మీ.

1059   1 చైనా కథలు 2 జపాన్ కథలు

I సుబ్రహ్మణ్యం, సూరాబత్తుల, అను.

# 25 కలంపేర్లు / మారుపేర్లతో గ్రంథాలు

కొందరు రచయితలు సరదా కోసమో, బిడియం చేతనో, లేదా ఇతర కారణాల చేతనో తమ అసలు పేరు మరుగు పరచి మారుపేర్లతో / కలం పేర్లతో రచనలు ప్రారంభిస్తారు. అయినప్పటికీ అసలు పేరు తెలుస్తుంది. చాలమంది రచయితల విషయంలో ఆ మాటకు వస్తే కొందరు రచయితల అసలు పేరు, మారు పేరు రెంటినీ ఉదహరిస్తూ రచనలు చేస్తారు. మరికొందరికి రెండు మూడు మారు పేర్లతో రచనలు చేసే అలవాటు కూడ లేక పోలేదు. అది వారి సరదాలపై అభిరుచులపై ఆధారపడి ఉంటుంది. ముఖ్యంగా పత్రికారంగంలో ఈ మారుపేర్లు అసంఖ్యాకంగా ఉంటాయి. పుస్తక రూపంలో ఒక స్థిరత్వాన్ని దాల్చేసరికి చాల మంది మరుగై పోతారు. ప్రస్తుతానికి పుస్తక రూపంలో రచనలు వచ్చిన మారుపేర్లు రచయితల విషయం పరిశీలించుదాం. తెలుగులో మారుపేర్లు ఏర్పడిన తీరు ఈ విధంగా ఉంటుంది. రచయిత వ్యక్తిగత నామం.

1 ఇంటి పేరులోని, అసలు పేరులోని, మొదటి ఒక్కొక్క అక్షరం— ఉదా :

| | |
|---|---|
| శ్రీ శ్రీ | శ్రీరంగం శ్రీనివాసరావు |
| పాప | పాలగుమ్మి పద్మరాజు |

2 రచయిత వ్యక్తిగత నామం, ఇంటి పేరులో మొదటి అక్షరాలు— పరివర్తిత రూపంలో— ఉదా :

| | |
|---|---|
| వేం చాశా | చావలి వేంకటశాస్త్రి |
| వెంపా | పాటూర్లి వెంకటేశ్వరరావు |

3 పేరులో కొంతభాగం — ఉదా :

| | |
|---|---|
| చలం | గుడిపాటి వెంకటచలం |
| రజని | బాలాంత్రపు రజనీ కాంతరావు |

4 ఇంటిపేర్లు— ఉదా :

| | |
|---|---|
| కాళోజీ | కాళోజీ నారాయణరావు |
| దాశరథి | దాశరథి కృష్ణమాచార్యులు |

5 గోత్రాల పేర్లు— ఉదా :

| | |
|---|---|
| ఆత్రేయ | కిళాంబి నరసింహాచార్యులు |
| కౌండిన్య | జమ్మలమడక మాధవరామశర్మ |

6 నక్షత్రాల పేర్లు— ఉదా :

| | |
|---|---|
| ఆరుద్ర | భాగవతుల శంకరశాస్త్రి |
| స్వాతి | పోణంకి శ్రీరామ అప్పారావు |

7 తెలుగు సంవత్సరాల పేర్లు— ఉదా :

| | |
|---|---|
| శార్వరి | వాసిలి రామకృష్ణశర్మ |
| ప్లవ | టి. వి. రమణయ్య |

8 సరదాగా ఏర్పరచు కున్నవి— ఉదా :

| | |
|---|---|
| బుచ్చిబాబు | శివరాజు వెంకట సుబ్బారావు |
| సులోచన | తాళ్ళూరి నాగేశ్వరరావు |

9 జంటకవులు— ఉదా :

| | |
|---|---|
| తిరుపతి వెంకట కవులు | దివాకర్ల తిరుపతిశాస్త్రి |
| | చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి |
| వేంకట పార్వతీశ్వర కవులు | బాలాంత్రపు వెంకటరావు |
| | ఓలేటి పార్వతీశం |

తెలుగులో మారు పేర్లతో రచనలు చేసేవారి జాబితా—సూచీకర్తల సౌలభ్యం కోసం రెండవ అనుబంధంలో చేర్చడమైనది.

కొందరు రచయితలు కొన్ని తమ రచనలను మారుపేర్లతో/మరి కొన్ని సొంతపేరుతో రాస్తారు. ఇటువంటి సందర్భాలలో సూచీకర్తకు కొన్ని చిక్కులు ఎదురౌతాయి. అమల్లోగాని నియమాలను దృష్టిలో ఉంచుకొని వాటిని పరిష్కరించుకోవాలి. రచయితగా అతని కున్న ప్రచారం / పలుకుబడి దృష్టిలో ఉంచుకుంటే— సూచీకర దృష్టిలో వీరిని అయిదు తరగతులుగా విభజింప వచ్చును.

1 కలంపేరు/మారు పేరుకూడా ప్రచారంలో ఉన్నవారు
2 అసలుపేరు ప్రచారంలో ఉన్నవారు
3 రెండూ ప్రచారంలో ఉన్నవారు
4 మారు పేరు ఇష్టంలేని రచయిత
5 ఎంత ప్రయత్నించినా అసలుపేరు లభ్యంకాని రచయితలు

అసలు పేరు లభించకపోతే

గ్రంథకర్త అసలుపేరు తెలుసుకోవానికి సాధ్యంకానపుడు లభిస్తున్న కలంపేరుతోనే శీర్షిక చేయాలి. అసలు పేరు లభించినపుడు మార్గసూచిక చేయవలసి ఉంటుంది.

ఉదా : 60

వి వా హం
దానిపుట్టు పూర్వోత్తరాలు
క్రాంతినాథ్
అభిసారికా కార్యాలయం
మద్రాసు

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 301.42
క్రాంతి—వి

2 పుటలు : 48

3 ఎత్తు : 21 సెంమీ

4 ప్రచురణ సం : 1956

5 అసలు పేరు ?

6 ప్రవేశసంఖ్య : 1060

301.42
క్రాంతి—వి క్రాంతినాథ్
వివాహం: దాని పుట్టు పూర్వోత్తరాలు/క్రాంతినాథ్
. — మద్రాసు: అభిసారికా కార్యాలయం, 1956.
1060 48పు.; 21సెం. మీ.
1 వివాహాలు I గ్రం. నా.

గమనిక

1 అసలు పేరు, కలంపేరు రెండూ ప్రచారంలో వుండి, ఏ ఒక్క పేరుమీదగాను అతడు ప్రముఖంగా తెలియబడ నప్పుడు, ముఖ పత్రంపై లభ్యమయ్యే పేరుకుశీర్షిక ఇవ్వాలి. రెండవపేరునుంచి శీర్షిక ఇచ్చిన పేరుకు మార్గసూచిక ఇవ్వడం సముచితం.

2 అలాగే కలం పేర్లతో రాస్తూ అసలు పేర్లు ప్రకటించడానికి ఇష్టంలేని రచయితల విషయంలో కలంపేర్లతోనే శీర్షిక చేయాలి. అసలు పేరునుండి కలం పేరుకు మార్గ సూచిక ఇవ్వాలి.

3 జంటకవుల ప్రచార నామంతో శీర్షిక చేయాలి. ప్రచార నామమే వారికీ ఇష్టం కనుక. ఎలాగూ అసలుపేర్ల నుంచి ప్రచారనామానికి మార్గసూచికలు ఇవ్వాలి.

4 ప్రతి సూచీకర్త కలంపేర్ల జాబితా సిద్ధంగా ఉంచుకోవాలి.

5 మార్గ సూచిక ఒకసారి చేస్తే, అదేపేరు మరలవస్తే మరల మార్గసూచిక చేయాల్సిన పనిలేదు.

మరొక ఉదా: 61

894.827
పద్మ—వ పద్మశ్రీ
వసుచరిత్ర/పద్మశ్రీ. -- గుంటూరు:
ప్రభు అండ్ కో, 1960
1061 38పు.; 19సెం.మీ.
1 కథలు I గ్రం.నా.

## రచయిత అసలుపేరు ప్రచారంలో ఉంటే

ఒక రచయిత అసలుపేరు ప్రచారంలో ఉంటే అసలు పేరుమీదే శీర్షిక చేయాలి. కలంపేరునుంచి అసలు పేరుకు మార్గసూచిక ఇవ్వాలి.

ఉదా: 62

ఎదగని పువ్వు

''సులోచన''

జయంతి పబ్లికేషన్సు
ఏలూరు రోడ్, విజయవాడ—2

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం: 894.8273
నా.తా—ఎ

2 పుటలు : 276

3 ఎత్తు : 19సెం.మీ.

4 ప్రచురణ సం : 1977

5 అసలుపేరు : తాళ్ళూరి నాగేశ్వరరావు

6 ప్రవేశసంఖ్య : 1062

894.8273
నా. తా—ఎ నాగేశ్వరరావు, తాళ్ళూరి (1934–1986)
ఎదగని పువ్వు/సులోచన. — విజయవాడ:
జయంతి పబ్లికేషన్సు, 1977.
276పు.; 19సెం.మీ.
1062 1 నవలలు I గ్రం.నా.

మార్గసూచిక:

సులోచన
చూడండి
నాగేశ్వరరావు, తాళ్ళూరి

గమనిక:

1 తాళ్ళూరి నాగేశ్వరరావుగారు అదేపేరు మీద ప్రసిద్ధులు. ''సులోచన'' కలం పేరుతో కొద్ది రచనలు చేశారు.

రచయిత కలంపేరు ప్రచారంలో ఉంటే

అసలు పేరుకంటే ఒక రచయిత కలంపేరు/మారుపేరు/గుప్తనామంతో సాహిత్య పరంగా ప్రచారం పొందితే మారుపేరుతోనే శీర్షిక చేయాలి (22-2సి1). అసలు పేరు నుంచి కలం పేరుకు మార్గసూచిక ఇవ్వాలి.

ఉదా: 63

లల్లాదేవి

మల్లమదేవి ఉసురు

జయంతి పబ్లికేషన్సు

ఏలూరు రోడ్, విజయవాడ—2

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 894.8273
లల్లా—మ

2 పుటలు : 268పు

3 ఎత్తు : 19సెం.మీ.

4 ప్రచురణ సం : 1980

5 ప్రవేశ సంఖ్య 1063

6 లల్లాదేవి అసలుపేరు పి. యన్. ఆచారి

894.8273
లల్లా—మ లల్లాదేవి
మల్లమదేవి ఉసురు/లల్లాదేవి . —విజయవాడ:
జయంతి పబ్లికేషన్సు, 1980.
1063 268పు.; 19సెం.మీ.
1 నవల I గ్రం.నా.

మార్గసూచిక

ఆచారి, పి. యన్
చూడండి
లల్లాదేవి

## వివాహిత రచయిత్రుల గ్రంథాలు

మహిళలు రచనలు చేసే సంప్రదాయం తెలుగునాట చిరకాలంగా ఉంది. వారు వివాహానికి పూర్వం రచనలు ప్రారంభించి వివాహం అయ్యాక గూడ వాటిని కొనసాగింప వచ్చును. వివాహానికి పూర్వం చేసిన రచనలు, వివాహం అయ్యాక రచయిత్రి పేరు మార్పుతో పునర్ముద్రితం కావచ్చు. తెలుగు వారి ఆచార ప్రకారం పెండ్లి అయ్యాక స్త్రీ పేర్లలో మార్పు వస్తుంది.

| వసం | అ వివాహిత నామం | వివాహిత నామం |
|---|---|---|
| 1 | అచ్యుతవల్లి,ఐ.వి.ఎస్. | అచ్యుతవల్లి, కె.వి.ఎస్. |
| 2 | ఉషారాణి, కొమ్మూరి | ఉషారాణి, భాటియా |
| 3 | కౌసల్యాదేవి, కోడూరి | కౌసల్యాదేవి, ఆరెకపూడి |
| 4 | జయ శ్యామల, తురగా | జయ శ్యామల, మోచర్ల |
| 5 | నాగమణి, ఆలేటి | నాగమణి, దేవరకొండ |
| 6 | రంగనాయకమ్మ, తద్దనాల | రంగనాయకమ్మ, ముప్పాళ్ళ |
| 7 | రామలక్ష్మి, కె | రామలక్ష్మి, ఆరుద్ర |
| 8 | శాంతా దేవి, పోల్కంపల్లి | శాంతా దేవి, నాగూరి |

రచయిత్రుల గ్రంథాలకు వివాహానికి పూర్వం, తర్వాతగల రెండు పేర్లు శీర్షకలుగా ఉపయోగిస్తే ఒకే రచయిత రచనలు సూచీలో రెండు చోట్ల కనిపించి, చదువరిని ఇబ్బంది పెట్టే అవకాశముంది. కనుక నియమాలలో ఈ లోటును సరిదిద్దు కోవాలి. వివాహిత రచయిత్రులకు వివాహిత నామంతో శీర్షిక చేయాలి. వివాహ పూర్వ నామం నుంచి వివాహిత నామానికి మార్గ సూచిక చేయాలి. (22.5సి5)

ఉదా: 64

శంకు తీర్థం

ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి

నవజ్యోతి పబ్లికేషన్సు

విజయవాడ

ఇతర వివరాలు:

1 పరిచయ సంకేతం : 894.8273
కౌ.ఆ—శం

2 పుటలు: 360

3 ఎత్తు: 19 సెంమీ.

4 ప్రచురణ సం: 1976

5 ప్రవేశ సంఖ్య: 1064

894. 8273
కౌ.ఆ—శం కౌసల్యా దేవి, ఆరెకపూడి
శంకు తీర్థం/ఆరెకపూడి (కోడూరి) కౌసల్యా దేవి. — విజయవాడ : నవజ్యోతి పబ్లికేషన్సు, 1976.
1064 360పు.; 19సెం. మీ.
1 నవల I గ్రం. నా.

మార్గ సూచిక

కౌసల్యా దేవి, కోడూరి
చూడండి
కౌసల్యాదేవి, ఆరెకపూడి

# 26 సమరూప శీర్షిక గల గ్రంథాలు

సూచీకరణ ప్రయోజనంకోసం అనేక రూపాలలో గల గ్రంథనామాలను ప్రచార నామంతో సమరూపంలో (యూనిఫారం టైటిలు) శీర్షిక చేస్తే ప్రయోజనకరంగా ఉంటుంది (25.3,25.4). ఇచట గ్రంథకర్తలు, గ్రంథనామంకంటే ప్రచార నామానికి విలువ ఉంది.

మతానికి విశ్వాసం ఆయువుపట్టు. మతప్రచారానికి పవిత్ర గ్రంథాలు ప్రధాన ఆధారం ఇవి భగవంతుని నోటనుంచి గ్రంథకర్తల పరంగా వెలువడినవని భక్తుల నమ్మకం. కనుక వారికివి ఆరాధ్యాలు, పారాయణీయాలు, ఆచరణీయాలు. హిందువులకు వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, రామాయణ భారత, భాగవతాలు; బౌద్ధులకు త్రిపిటకాలు, దమ్మపదం; క్రైస్తవులకు బైబిల్; మహమ్మదీయులకు కురాన్ మొదలైనవి పవిత్ర గ్రంథాలుగా ఎంచబడుతున్నాయి. ఈ విధమైన గ్రంథాలలో ప్రతిదానికి ప్రత్యేకమైన పేరు ఉన్నప్పటికీ వాటి ప్రచారనామంతో శీర్షికచేయడం చదువరి అవసరాల దృష్ట్యా సముచితం. (25.17). సమాచారనిమిత్తం కొన్ని ప్రచారనామాల వివరాలు ఈ దిగువ వివరించడమైనది.ఇవిగాక కొన్ని పుస్తకాలు ఒకే పేరుతో ప్రచారమౌతుంటాయి. అలాగే సంపూర్ణ గ్రంథాలుకూడా.

| వ సం. | పవిత్ర గ్రంథాల పేరు | ప్రచార నామం(శీర్షిక) |
|---|---|---|
| 1 | ఆంధ్ర వేదములు | వేదాలు |
| | చతుర్వేద పరమ రహస్యము | ,, |
| | వేదామృతము | ,, |
| | యజుర్వేద భాష్యము | ,, |
| 2 | ఉపనిషద్వ్యాహారము | ఉపనిషత్తులు |
| | కేనోపనిషత్తు | ,, |
| | ప్రశ్నోపనిషత్తు | ,, |

| | | |
|---|---|---|
| 3 | గీతా ప్రవచనములు | భగవద్గీత |
| | గీతామృతము | ,, |
| | జ్ఞానేశ్వరీ భగవద్గీత | ,, |
| | భగవద్గీత | ,, |
| 4 | మొల్ల రామాయణము | రామాయణం |
| | శ్రీ రామాయణము | ,, |
| | రంగనాథ రామాయణము | ,, |
| | వాల్మీకి రామాయణము | ,, |
| 5 | ఆంధ్ర మహాభారతము | భారతం |
| | ద్విపద భారతము | ,, |
| | జైమినీ భారతము | ,, |
| 6 | ఆంధ్ర మహాభాగవతము | భాగవతం |
| | పోతన భాగవతము | ,, |
| | భాగవత కథ | ,, |
| 7 | సుత్త పిటక | త్రిపిటకాలు |
| | వినయ పిటక | ,, |
| | అభిదమ్మ పిటక | ,, |
| 8 | దమ్మపదము | దమ్మపదం |
| 9 | బైబులు కొత్తనిబంధన | బైబిలు |
| | ,, పాత నిబంధన | ,, |
| | పరిశుద్ధ గ్రంథము | ,, |
| 10 | కురాన్ షరీప్ | కురాన్ |
| | ఖురాన్ షరీఫ్ | ,, |
| | మిష్కాత్—ఇ—షరీఫ్ | ,, |
| | ఆల్కొరాన్ | ,, |

| | | |
|---|---|---|
| 11 | కాశీమజిలీ కథలు | కాశీమజిలీ కథలు |
| | నిజమైన కాశీమజిలీ కథలు | ,, |
| | బాల కాశీమజిలీ కథలు | ,, |
| 12 | అరేబియన్ నైట్స్ కథలు | అరేబియన్ నైట్స్ కథలు |
| | అరేబియన్ నైట్స్ వినోద కథలు | ,, |
| | అరేయన్ నైట్స్ | ,, |
| 13 | శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం | శ్రీశ్రీ సాహిత్యం |
| | శ్రీశ్రీ | ,, |
| 14 | మిత్రలాభం | పంచతంత్రం |
| | మిత్రభేదం | ,, |
| | సంధి | ,, |
| | విగ్రహం | ,, |
| | అసంప్రేష్యకారిత్వం | ,, |
| | అవిమృశ్య కారిత్వం | ,, |
| | పంచతంత్రం | ,, |
| | పంచతంత్ర కథలు | ,, |
| | బాలల పంచతంత్రం | ,, |
| 15 | సుందరాకాండ | సుందరాకాండ |

పై విధంగానే చూపిన ప్రచార నామంతో శీర్షిక చేయాలి.

ఉదా: 65

# ఆంధ్ర వేదములు

[ఋగ్వేదము]

అనువాదకులు:—

బంకుపల్లె మల్లయ్య శాస్త్రి

వినయాశ్రమమువారిచే అక్షరవిలాసమునందు ముద్రింపబడి

ప్రకటింపబడియె.

౧౯౪౦

మొదటి కూర్పు 3000 ప్రతులు

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 294.1
వేదా—ఆం

2 పుటలు : 2, ౪౮౦

3 సైజు : 24.5 సెం.మీ.

4 ప్రవేశ సంఖ్య : 1065

294.1

వేదా— ఆం వేదాలు. ఋగ్వేదం

ఆంధ్రవేదములు/అనువాదకులు బంకుపల్లె మల్లయ్య శాస్త్రి . — [కావూరు]: వినయాశ్రమం, ౧౯౪౦ [1940].

1065 2, ౪౮౦పు.; 25 సెం.మీ.

మల్లయ్యశాస్త్రి, బంకుపల్లె, అను. II గ్రం.నా.

గమనిక :

ఇచట ముఖ పత్రంలో ప్రచురణ స్థలంపేరు లేదు. ఈ పేరును ఇతర ఆధారాలతో సేకరించాలి.

ఉదా: 66

# ఉపనిషద్వాణి

(పద్యము)

కృతిభర్త :

పవని శ్రీధరరావు, బి.ఏ.

కృతికర్త

మొవ్వ వృషాద్రిపతి, ఎం. ఏ.

ప్రభుత్వకళాశాల — కందుకూరు

మత సంబంధ గ్రంథాల ప్రచురణకు తోడ్పడే పథకం క్రింద తిరుపతి తిరుమల దేవస్థానంవారు— అందజేసిన సహాయంతో ఈ గ్రంథము ప్రచురింపబడినది.

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 294.5921
ఉప— ఉ

2 పుటలు : xxvi, 174పు

3 సైజు : 21.5 సెం.మీ.

4 ప్రచురణ సం : 1979

5 ప్రవేశసంఖ్య : 1066

294.5921
ఉప— ఉ ఉపనిషత్తులు. (పద్యము)
ఉపనిషద్వాణి: (పద్యము)/మొవ్వ వృషాద్రిపతి ; కృతిభర్త పవని శ్రీధరరావు. — కందుకూరు: రచయిత, 1979.
1066 xxvi, 174పు.; 22 సెం.మీ.
I వృషాద్రిపతి, మొవ్వ II గ్రం.నా.

ఉదా: 67

# వాల్మీకి
# రామాయణము

బాలకాండ

అనువాదకుడు:

శ్రీనివాస శిరోమణి

త్రివేణి పబ్లిషర్సు

మచిలీపట్నము–1 & మదరాసు–1

ఇతర వివరాలు

పరిచయ సంకేతం : 294.5922
రామా—వా

పుటలు : xxxvi, 160

సైజు : 21.5సెం.మీ.

ప్రచురణ సం : 1975 ఐదవ ముద్రణ

ప్రవేశసంఖ్య : 1067

294.5922

రామా—వా రామాయణం. బాలకాండ (వచనం)

వాల్మీకి రామాయణము: బాలకాండ/అనువాదకుడు శ్రీనివాసశిరోమణి . — 5వ ము . — మచిలీపట్నం: త్రివేణి పబ్లిషర్సు, 1975.

1067 xxxvi , 160పు.; 22 సెం.మీ.

I శ్రీనివాస శిరోమణి, అను. II గ్రం.నా.

ఉదా: 68

# శ్రీమదాంధ్ర మహాభారతము

సంశోధిత ముద్రణము

శాంతి పర్వము

సంపాదకులు

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం
శిరోమణి శ్రీ చెలమచర్ల రంగాచార్యులు
డాక్టరు కె.వి. గోపాల కృష్ణారావు
డాక్టరు మడుపు కులశేఖరరావు

తెలుగుశాఖ

ఉస్మానియా విశ్వవిద్యాలయం

హైదరాబాదు

1972

ఇతర వివరాలు

1 వరిచయ సంకేతం : 294.5923
మహా—శ్రీ

2 పుటలు : 11,74,666పు

3 సైజు : 25 సెం.మీ.

4 ప్రవేశసంఖ్య : 1068

294.5923
మహా—శ్రీ మహా భారతం. శాంతిపర్వం (పద్యం)
శ్రీమదాంధ్ర మహాభారతము. శాంతిపర్వము/ [కవిత్రయం];
సంపాదకులు ఖండవల్లి లక్ష్మీ రంజనం ... [తదితరులు]
. — సం.శో.ము. — హైదరాబాదు: ఉస్మానియా విశ్వవిద్యాలయం,
1972.
1068 11, 74, 666పు.; 25 సెం.మీ.
I లక్ష్మీరంజనం, ఖండవల్లి, సంపా. II గ్రం.నా.

ఉదా: 69

శ్రీమహా భాగవతము

అనువాదకులు :

యామిజాల పద్మనాభస్వామి

త్రివేణి పబ్లిషర్సు ప్రైవేట్ లిమిటెడ్

మచిలీపట్నము

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 294.5925
భాగ—శ్రీ

2 పుటలు : xiv, 526పు

3 సైజు : 21.5 సెం.మీ.

4 ప్రచురణ సం : లేదు

5 ప్రవేశసంఖ్య : 1069

294.5925
భాగ—శ్రీ భాగవతం. (వచనం)
శ్రీ మహాభాగవతం/[వ్యాసుడు]; అనువాదకులు యామిజాల పద్మనాభ స్వామి. — మచిలీపట్నం: త్రివేణి పబ్లిషర్సు [19—].
1069 xiv, 526పు.; 22సెం.మీ.
I పద్మనాభస్వామి, యామిజాల, అను.
II గ్రం.నా.

ఉదా: 70

# పరిశుద్ధ గ్రంథము

ఇందు

పాత నిబంధన గ్రంథమును

క్రొత్త నిబంధన గ్రంథమును ఇమిడి యున్నవి

ఇది

ఆదిమ హెబ్రీగ్రీకు భాషలలోనుండి

తెలుగులో భాషాంతరము చేయబడినది

ఇండియా బైబిలు సొసైటీ

ఆంధ్రప్రదేశ్ సహాయ సంఘము

సికింద్రాబాదు

1975

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 220.594827

బైబి—ప

2 పుటలు : 787, 242

3 ఎత్తు : 21 సెం.మీ.

4 ప్రవేశ సంఖ్య : 1070

220.594827

బైబి—ప బైబిలు. పాత, క్రొత్త నిబంధనలు

పరిశుద్ధ గ్రంథము: ఇందు పాత నిబంధన గ్రంథమును క్రొత్త నిబంధన గ్రంథమును ఇమిడి ... తెలుగులో భాషాంతరము చేయబడినది. — సికింద్రాబాదు: ఇండియా బైబిలు సొసైటీ, 1975.

1070 787, 242పు.; 21 సెం.మీ.

I గ్రం.నా.

ఉదా : 71

రా మా య ణ ం

రచన ముళ్ళపూడి వెంకటరమణ

బొమ్మలు బాపు

— ౦ —

ప్రచురణ

సంస్కృతి ఇంటర్నేషనల్

మద్రాసు

1984

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం . 294.5922
రామా—రా

2 వర్ణ చిత్రాలు : 64

3 పుటలు : 71

4 సైజు : 19.5 సెం.మీ.

5 ప్రవేశ సంఖ్య : 1071

294.5922

రామా—రా రామాయణం

రామాయణం/ముళ్ళపూడి వెంకటరమణ; బొమ్మలు బాపు . — మద్రాసు: సంస్కృతి ఇంటర్నేషనల్, 1984.

1071 71పు.: 64 వర్ణచిత్రాలు; 20 సెం.మీ.

I వెంకట రమణ, ముళ్ళపూడి

II గ్రం.నా.

ఉదా : 72

శ్రీ
# నీతి చంద్రిక
BY
Paravasthu Chinnaya Suri
టిప్పణము:
విద్వాన్ శ్రీ దండిపల్లి వెంకట సుబ్బశాస్త్రి
పబ్లిషర్సు
బాల సరస్వతీ బుక్ డిపో
(రిజిష్టర్డు) ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్, కర్నూల్
శ్రీ టి. వెంకటేశ్వర్లు శెట్టి ఛాంబర్సు
నెం 4, సుంకురామశెట్టి వీధి, మద్రాసు 600001

కాపీరైట్ రిజిషర్డ్] 1985 వెల : రు. 9-00

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 894.8278
పంచ—శ్రీ

2 పుటలు : 160

3 ఎత్తు : 18.5 సెం.మీ.

4 ప్రవేశ సంఖ్య : 1074

894.8278
పంచ—శ్రీ పంచతంత్రం.

శ్రీ నీతి చంద్రిక/by Paravasthu Chinnaya Suri; టిప్పణము దండిపల్లి వెంకట సుబ్బశాస్త్రి. — కర్నూలు : బాల సరస్వతీ బుక్ డిపో, 1985.

1074 160పు.; 19సెం.మీ.

ఇందు మిత్రలాభము, మిత్రభేదములు కలవు.

1 మిత్రలాభము 2 మిత్రభేదము I చిన్నయసూరి, పరవస్తు II గ్రం.నా.

ఉదా : 73

TAFHEEM-UL-QURAN(ABRIDGED)
TELUGU

తఫ్హీముల్

ఖుర్ఆన్

ఆల్ ఫాతిహా అల్ బఖర

మూలానువాదం

మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది

సంక్షిప్తీకరణ :

మౌలానా సద్రుద్దీన్ ఇస్లాహి

ఆంధ్రీకరణ :

షేఖ్ హమీదుల్లా షరీఫ్

తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్

పురానీహవేలీ

హైదరాబాద్ 500 002

ఇతర వివరాలు

297.122

1 పరిచయ సంకేతం : కురా—త

2 పుటలు : 216

3 ఎత్తు : 24.5సెం.మీ.

4 ప్రచురణ సం : 1981 ప్రచురణ సంవత్సరం ఇతర ఆధారాలతో సేకరించ బడినది.

5 ప్రవేశ సంఖ్య : 1075

297.122
కురా—త కురాన్

తఫీహీముల్ ఖుర్ ఆన్ : అల్ ఫాతిహా అల్ బఖర.../ మూలానువాదం మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది; సంక్షిప్తీకరణ మౌలానా సద్రుద్దీన్ ఇస్లాహి; ఆంధ్రీకరణ షేఖ్ హమీదుల్లా షరీఫ్. —హైదరాబాదు : తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, [1981].

1075

(చూడు తరువరి కార్డు)

2

297.122
కురా—త కురాన్

216పు.; 25 సెం.మీ.
I హమీదుల్లా షరీఫ్, షేఖ్, అను. II గ్రం.నా.

గమనిక

1 ఈ గ్రంథం అరబ్ మూలాన్ని ఉర్దూలో సంక్షిప్తీకరించాక తెలుగులోకి అనువాదం జరిగింది. మూలాను వాదకునికి, సంక్షిప్తకారునికి పెద్దగా ప్రాధాన్యం ఇవ్వాల్సిన పనిలేదు. అనువాదకునికి ఉపపద్దు చేసిన సరిపోతుంది.

2 ఖుర్ ఆన్—చూడండి—కురాన్ అని మార్గసూచిక, పేరులో తేడా సూచించడానికి చేయవలసి ఉంటుంది.

ఉదా : 74

శ్రీ మ ద్భ గ వ ద్గీ త

ఆంధ్ర పద్యానువాద, తాత్పర్య సహితము
''తర్క రత్న'', ''న్యాయవేదాన్త విద్యాపారీణ'', 'దర్శనాలంకార'
శ్రీ బులుసు అప్పన్నశాస్త్రిగారి పీఠికతో
ఆంధ్ర పద్యానువాదము:
కీ.శే. ఆదిపూడి సోమనాథరావుగారు

తాత్పర్య విశేషార్థములు:
(తిలక్ మహాశయుని గీత రహస్యము, శంకర భాష్యముల ననుసరించి)
శ్రీ నోరి రామశర్మ, ఏలూరు.

ప్రకాశకులు
వేంకట్రామ అండ్ కో.,

విజయవాడ — హైదరాబాదు

హక్కులు మా యధీనము వెల రు 10

ఇతర వివరాలు

294.5291

1 పరిచయ సంకేతం : భగ—శ్రీ
2 పుటలు : vi, viii, 5, 370
3 ఎత్తు : 21.5 సెం.మీ.
4 ప్రచురణ సం : 1977 రెం.ము.
5 ప్రవేశ సంఖ్య : 1076

294.5291
భగ—శ్రీ భగవద్గీత
శ్రీమద్భగవద్గీత : ఆంధ్ర పద్యానువాద, తాత్పర్య సహితము / బులుసు అప్పన్నశాస్త్రిగారి పీఠికతో; ఆంధ్ర పద్యానువాదము ఆదిపూడి సోమనాథరావు; తాత్పర్య విశేషార్థములు ... నోరి రామ శర్మ . — 2వ ము . — విజయవాడ: వేంకట్రామ అండ్ కో., 1977.
1076 vi, viii, 5, 370పు.; 22 సెం.మీ.
I సోమనాథరావు, ఆదిపూడి, అను. II గ్రం.నా.

# 27 సంఘటిత సంస్థ ప్రచురిత గ్రంథాలు

ఒక దేశానికి, ఒక రాష్ట్రానికి లేదా ఒక పరిమిత ప్రాంతానికి పరిపాలనా బాధ్యతను నిర్వహించే వ్యవస్థను ప్రభుత్వం అంటారు. ప్రభుత్యం కొన్ని విషయాలపై పాలనా వ్యవహారాలను స్థానిక సంస్థలకు అప్పగించి — తన బాధ్యతలను కొంత వరకు తగ్గించు కుంటుంది. మన దేశంలో ప్రభుత్వ యంత్రాంగం ఈ తీరుగా ఉంటుంది.

1 కేంద్ర ప్రభుత్వం, వాటి శాఖలు,
2 రాష్ట్ర ప్రభుత్వాలు, వాటి శాఖలు,
3 స్థానిక సంస్థలు—
  1 నగర పాలక సంఘాలు
  2 పురపాలక సంఘాలు
  3 జిల్లా ప్రజా పరిషత్తులు
  4 మండలాలు, పంచాయతీలు
  5 జిల్లా గ్రంథాలయ సంస్థలు

వీటిలో కొన్నిటి తరఫు న అప్పుడప్పుడు ప్రచురణలు వెలువడు తుంటాయి.

ఇవిగాక___

1 కార్పొరేట్ బాడీలు (విశ్వ విద్యాలయాలు మొ.)
2 స్వచ్ఛంద సంస్థలు, సంఘాలు, గ్రంథాలయాలు
3 సహకార సంఘాలు
4 దేవాలయాలు, మఠాలు, మసీదులు, చర్చిలు
5 సభలు, సదస్సులు, సమావేశాలు, గోష్ఠులు

మొదలైన వాటి తరఫు న గూడా ప్రచురణలు వెలువడుతుంటాయి. ప్రభుత్వం, స్థానిక సంస్థలు, ఇతర సంస్థలు, సంఘాలు ఒకరిని/కొందరు వ్యక్తులను సంఘంగా/ కమీషన్‌గా నియమించి ప్రజావసరాల కోసం రచనలు సిద్ధం చేయిస్తూ ఉంటాయి.

చాలా సందర్భాలలో ఈ విధమైన ఆదేశక (కమీషన్డ్) గ్రంథాలకు రచయిత ప్రాధాన్యం ఉండదు.

ముఖ్యంగా లోకసభ, రాజ్యసభ, విధానసభ, శాసనమండలి చర్చలు; పరిపాలన నివేదికలు, ఉత్తర్వులు, బడ్జెట్లు, గణాంకాలు, రాయబారుల నివేదికలు, సంధి పత్రాలు, కోర్టు నిర్ణయాలు మొదలైనవి ఈ కోవకు చెందుతాయి. ప్రిష్యన్ ఉత్తర్వులు (కోడ్ 1909) ప్రభుత్వ రచనలను వేరుగా చూడడానికి అంగీకరించలేదు. గ్రంథకర్త ఉంటే ఆ గ్రంథకర్త పేర లేక పోతే గ్రంథ నామం పేర శీర్షిక తయారు చేయాలని సూచించింది. అయితే ఈ సూచనను గమనికలోకి తీసుకోకుండా, ప్రభుత్వాలు, సంస్థలు మొదలైన వాటి రచనలకు ప్రత్యేకంగా సూచీ నియమావళి అవసరమని ఆంగ్లో– అమెరికన్ నియమావళి నిర్మాతలు భావించారు. అనుభవ రీత్యా ఇవి వేరుగా ఉండడంలో ఏమీ ఇబ్బంది కన్పించడంలేదు.

### సంస్థలు: సంఘాలు

ఒక సత్కార్యాన్ని సాధించే నిమిత్తం మనసులు కలసిన కొందరు వ్యక్తుల కలయికను సంఘం అంటారు. సంఘం అభివృద్ధి చెంది ఒక సంస్థగా, అనేక సంస్థలుగా రూపొందుతుంది. వీటి పరంగా విద్యాలయాలు, గ్రంథాలయాలు, దేవాలయాలు, చిత్రవస్తు ప్రదర్శనశాలలు, ఆస్పత్రులు, ధర్మనిధులు మొదలైన వనేకం స్థాపించి నిర్వహిస్తారు. వీటి పరంగా పుస్తకాలు, పత్రికలు, నివేదికలు, కరపత్రాలు ప్రచురింపబడటం సహజం. అలాగే మహాసభలు, సమావేశాలు, సదస్సులు, గోష్టులు, చర్చలు నిర్వహించినప్పుడు సంచికలు చర్చా పత్రాలు ప్రచురించడం కొన్ని సందర్భాలలో జరుగుతుంది. ఇవన్నీ విషయ ప్రగతికి ఎంతగానో తోడ్పడతాయి. అందుచేత వీటిని భద్రపరచి చదువరుల ఉపయోగం కోసం సూచీకరణ చేయవలసి ఉంది. ఎ. ఎ. సి. ఆర్– 2 లో ప్రభుత్వ ప్రచురిత గ్రంథాలకు సూచీకరణలో అధిక ప్రధాన్యం ఇవ్వలేదు. మిగిలా పద్ధుల లాగానే వీటిని చూడడం జరిగింది.

ప్రభుత్వ ప్రచురణలు : ప్రభుత్వాధినేత

ఒక వ్యక్తి ఒక ప్రభుత్వ అధినేతగా రచనలు ప్రసంగాలు చేసినపుడు ఆ ప్రభుత్వం పేరనే శీర్షిక చేయాలి. హోదాకు ఉప శీర్షిక చేయాలి (24.20బి)

ఉదా : 75

ముఖపత్రం; ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

శ్రీ ఎన్. టి. రామారావు

ప్రసంగాలు

(జనవరి 1983 నుంచి మే 1984 వరకు)

ప్రచురణ

సమాచార, పౌర సంబంధ శాఖ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

హైదరాబాదు

ఇతర వివరాలు

954.84

1 పరిచయ సంకేతం : ఆంధ—ఆం

2 పుటలు : iv, 164

3 సైజు : 21 సెంమీ.

4 ప్రచురణ సం : 1984

5 ప్రవేశ సంఖ్య : 1077

954.84

ఆంధ—ఆం ఆంధ్రప్రదేశ్. ముఖ్యమంత్రి

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావు ప్రసంగాలు: (జనవరి 1983 నుంచి మే 1984 వరకు) . — హైదరాబాదు : సమాచార పౌర సంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, 1984.

1077 iv, 164పు.; 21 సెం.మీ.

1 తెలుగు సంస్కృతి I రామారావు, ఎన్.టి.

ప్రభుత్వశాఖల ప్రచురణలు

ఉదా : 76

**రెవిన్యూ శాఖ**

జిల్లా కార్యాలయ నియమ సంపుటి
ప్రభుత్వ ఉత్తర్వుల మేరకు సంకలనము చేయబడి
జారీ చేయబడినది.
వెల. రు. 6–50
(1965 ఆఖరు వరకు సరిచేయ బడినది)
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముద్రణాలయ డైరెక్టరుగారిచే
ప్రభుత్వ కేంద్ర ముద్రణాలయమునందు
ముద్రించబడినది
హైదరాబాదు
1976

ఇతర వివరాలు :

1 పరిచయ సంకేతం : 351.02
ఆంధ్ర–జి

2 పుటలు : iv, 190

3 ఎత్తు : 24.5 సెం.మీ.

4 ప్రవేశ సంఖ్య : 1078

351.02
ఆంధ్ర–జి ఆంధ్రప్రదేశ్. రెవిన్యూశాఖ

జిల్లా కార్యాలయ నియమ సంపుటి ... (1965 ఆఖరు వరకు సరిచేయ బడినది) . — హైదరాబాదు: ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, 1976.

1078 iv, 190పు.; 25 సెం.మీ.

1 జిల్లా కార్యాలయ నిర్వహణ I గ్రం.నా.

శాఖల ప్రచురణలు

ప్రభుత్వం తయారు చేసిన ప్రచురణలకు అధికార ప్రాంతాన్ని తొలి పదంగా ఉదహరించి ఆ తరువాత శాఖను చేర్చాలి.

ఈ ప్రధాన పదాల క్రింద గీత గీయాలి.

ఉదా : 77

ఆంధ్రప్రదేశ్
రాష్ట్ర పరిపాలనా నివేదిక
1967–68

ప్రచురణ
సాధారణ పరిపాలనాశాఖ

ప్రతులకు
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ విభాగం, హైదరాబాదు

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 351.06
ఆంధ్ర-67-68
2 పుటలు : iv, 611పు. చిత్రా 18
3 ఎత్తు : 23.5 సెంమీ
4 ప్రచురణ సం : ఇతర ఆధారాలతో సేకరించాలి.
5 ప్రవేశ సంఖ్య : 1079

351.06
ఆంధ్ర–67–68 ఆంధ్రప్రదేశ్. సాధారణ పరిపాలనాశాఖ
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పరిపాలనా నివేదిక, 1967–68
. — హైదరాబాదు: సాధారణ పరిపాలనా శాఖ,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, [196? ].
1079 iv, 611పు.: 18 చిత్ర; 24 సెం.మీ.
1 ఆంధ్రప్రదేశ్—సాధారణ పరిపాలన I గ్రం.నా.

శాఖల ప్రచురణలు

ఉదా : 78

# తెలుగు సంస్కృతి తరంగాలు

ప్రచురణ

డైరెక్టరు, సమాచార పౌర సంబంధశాఖ

హైదరాబాదు.

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 306
ఆంధ్ర—తె

2 పుటలు : 211

3 ఎత్తు : 21 సెం.మీ.

4 ప్రచురణ సం : 1983

5 తెలుగు సంస్కృతిపై 18 రచయితల 18 వ్యాసాల సంకనం

6 ప్రవేశ సంఖ్య : 1080

306
ఆంధ్ర—తె    ఆంధ్రప్రదేశ్. సమాచార పౌర సంబంధశాఖ
తెలుగు సంస్కృతి తరంగాలు . — హైదరాబాదు:
డైరెక్టరు, సమాచార పౌర సంబంధ శాఖ, 1983.
1080    211పు.; 21 సెం.మీ.
18 రచయితల వ్యాస సంకలనం
1 తెలుగు సంస్కృతి I గ్రం. నా.

ప్రచురణ విభాగాలు

ప్రభుత్వ ప్రచురణలకు బాధ్యత ప్రభుత్వానిదే. కాని అది ఒక్కోసారి అంచెల వారీగా ఉంటుంది. ఉదా:

స్థాయి I భారతదేశం — ప్రభుత్వం



స్థాయి II సమాచార మంత్రిత్వశాఖ



స్థాయి III ప్రచురణల విభాగం

భారతదేశ ప్రభుత్వంలో ఒక భాగం సమాచార మంత్రిత్వశాఖ దానిలో అంతర్భాగం ప్రచురణల విభాగం మరొక విధంగా చూస్తే ఇలా ఉంటుంది. దీన్ని ఇలాకూడ చెప్పవచ్చు. ప్రభుత్వశాఖలకు అనుబంధంగా గల కార్యాలయాల తరఫున గ్రంథాలు ప్రచురించి నప్పుడు శాఖపేరు పిదప కార్యాలయం పేరును చేర్చాలి (24.19)

ఉదా: 79

మహా ప్రణాళికలు సంఖ్య—6

గ్రామ పరిశ్రమలు-
చిన్నతరహా పరిశ్రమలు

ప్రచురణ విభాగం

ఢిల్లీ

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం: 338.63
భార—గ్రా

2 పుటలు: 19

3 ఎత్తు: 21.5సెంమీ

4 ప్రవేశ సంఖ్య: 1081

338.63

భార—గ్రా భారతదేశం. సమాచార ప్రసార మంత్రిత్వశాఖ.
ప్రచురణ విభాగం.
గ్రామ పరిశ్రమలు — చిన్న తరహా పరిశ్రమలు. —
ఢిల్లీ: ప్రచురణ విభాగం, 1962.

1081 19పు.; 22సెం.మీ. —(మహా ప్రణాళికలు; సం.6)
1 ఆంధ్రప్రదేశ్ కుటీర పరిశ్రమలు I గ్రం.నా.

స్థానిక సంస్థలు, స్వచ్ఛంద సంఘాలు

స్థానిక సంస్థలు, విశ్వ విద్యాలయాలు, సంఘాలు, సభలు—ప్రచురించిన గ్రంథాలకు వాటి పేరుతో / అత్యంత ప్రాధన్యం గల పేరుతో శీర్షిక చేయాలి.

ఉదా: 80

హైదరాబాదు నగర గ్రంథాలయ సంస్థ రజతోత్సవము(1961—1986)
నవంబరు 1986, హైదరాబాదు

విశేష సంచిక
**SOUVENIR**
EDITORS
Pros. A.A.N.Raju
Sri Iqbal muzaffer Ahmed

ఇతర వివరాలు

027.05

1 పరిచయ సంకేతం: హైద—ర

2 పుటలు: పుట సంఖ్యలు లేవు. లెక్క వేయగా 178 పుటలు గలవు.

3 ఎత్తు: 28 సెం.మీ.

4 ప్రచురణ సం: 1986

5 ప్రవేశ సంఖ్య: 1082

027.05
హైద—ర హైదరరాబాదు నగర గ్రంథాలయ సంస్థ
రజతోత్సవము (1961—1986) నవంబరు,
1986, హైదరాబాదు: విశేష సంచిక
Souvenir/editors A.A.N.Raju
[and] Iqbal Muzaffer Ahmed. —
హైదరాబాదు: నగర గ్రంథాలయ సంస్థ, 1986.

(చూడు తదుపరి కార్డు)

027.05
హైద—ర హైదరాబాదు నగర గ్రంథాలయ సంస్థ ...
1082 [178]పు.; 28సెం.మీ.
ఈ సంచికలో ఇంగ్లీషు, ఉర్దూ విభాగములు గలవు.
1 పౌర గ్రంథాలయాలు—సంచికలు
I రాజు, ఎ.ఎ.ఎన్., సంపా. II గ్రం.నా.

కమీషన్లు : సంఘాలు

కేంద్ర లేదా రాష్ట్ర ప్రభుత్వం నియమించిన సంఘాల నివేదికల విషయంలో వాటి అధికార ప్రాంతం లేక పరిధిపేరు పిదప సంఘం పేరును ఉదహరించాలి.

ఉదా : 81

మధ్యకాలిక నివేదిక

1975

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాధారణ
పరిపాలన (అధికారభాష) శాఖ
1975

ఇతర వివరాలు

1 పరిచయ సం : 494.8277
ఆంధ్ర—మ

2 పుటలు : 45

3 ఎత్తు : 18. 5 సెం. మీ.

4 ప్రవేశ సంఖ్య : 1083

494.8277
ఆంప్ర—మ ఆంధ్రప్రదేశ్. అదికార భాష కమీషన్
మధ్యకాలిక నివేదిక 1975 . — హైదరాబాదు:
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాధారణ పరిపాలన (అధికారభాష) శాఖ, 1975.
1083 45పు. ; 19 సెం. మీ.
1ఆంధ్రప్రదేశ్— అధికారభాష I గ్రం. నా.

బిల్లులు: చట్టాలు

ఒక దేశానికి లేదా ఒక రాష్ట్రానికి సంబంధించిన బిల్లులు, చట్టాలు, వుత్తర్వులు గల గ్రంథాలకు అవి అన్వయించే అధికార ప్రాంతానికి శీర్షికను నిర్ణయించి, ఆ తర్వాత బిల్లులు, చట్టాలు, ఉత్తర్వులు మొదలైన పదాలను అవసరాన్ని బట్టి చేర్చుకోవాలి.

ఉదా : 82

ఆంధ్రప్రదేశ్
మునిసిపాలిటీల చట్టము
1965 వ సంవత్సరం 6 వ ఆక్టు
(IN THREE PARTS)

ఎన్నికల నియమములు, బిల్డింగ్‌రూల్సు, కౌన్సిలు ప్రొసీడింగుల నియమావళి, పన్నులవిధింపు, వసూలు, కార్యనిర్వాహకవర్గము జరుపు కార్యవిధానము, ఆల్డరుమనుల ఎన్నికవిధులు, సెక్షనుల పోలికపట్టి, హైకోర్టు తీర్పులు వగైరా వివరములతో

*By*

పాటిబండ వెంకట రమణయ్య, B.A., LL.B; L.S.G.D. (Bom.)
మునిసిపల్ సెక్రటరి (రిటైర్డు)
అడ్వకేటు

ఆంధ్రప్రదేశ్ మున్సిపల్ శాఖామాత్యులు
గౌ॥ నలమోతు చెంచురామానాయుడుగారి
ఆశీస్సులతో.

ప్రకాశకులు
ప్రభు అండ్ కో.,
ఫోన్ నెం. 1503

రవీంద్ర నగర్ : : గుంటూరు—4

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 352 2 పుటలు : 7, 143, 338, 72 పు.
ఆం ధ–ము

3 ఎత్తు : 20.5 సెం.మీ. 4 ప్రవేశ సంఖ్య : 1085

352

ఆంధ్ర–ము ఆంధ్రప్రదేశ్

[మునిసిపాలిటీల చట్టము (1956)]

ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీల చట్టం :

1965వ సంవత్సరము 6వ ఆక్టు... [వ్యాఖ్య]

పాటిబండ వెంకట రమణయ్య. —గుంటూరు:

ప్రభు అండ్ కో, 1969.

1085 7, 143, 338, 72పు. ; 21 సెం.మీ.

ఎన్నికల నియమాలు, బిల్డింగు రూల్సు,

(చూడు తదుపరి కార్డు)

352 –2–

ఆంధ్ర–ము ఆంధ్రప్రదేశ్

పన్నుల విధింపు, వసూలు, హైకోర్టు

తీర్పు వగైరా వివరాలతో.

1 మునిసిపాలిటీలు–చట్టాలు I వెంకట

రమణయ్య, పాటిబండ, వ్యా. II గ్రం నా.

మరో ఉదా : 83

361.0026

ఆంధ్ర–సాం ఆంధ్రప్రదేశ్

[సాంఘిక సంక్షేమ చట్టాలు]

సాంఘిక సంక్షేమ చట్టాలు/అనువాదం

జి. లాజరస్. —మద్రాసు : చర్చ్ ఆగ్జిలరి

ఫర్ సోషల్ యాక్షన్, 1983.

1086 8, 114పు.; 22 సెం మీ.

1 సంక్షేమ చట్టాలు I లాజరస్ జి, అను.

II గ్రం.నా.

గమనిక : చట్టాలు అనువాదాలైనప్పటికి వాటి అధికార పరిధిని దృష్టిలో
ఉంచుకొనే శీర్షిక నిర్ణయించాలి (25.15ఎ)

రాజ్యాంగాలు

ఒక దేశానికి సంబంధించిన రాజ్యాంగ గ్రంథాలకు ఆదేశం పేరుతోనే శీర్షిక చేయాలి.
ఉదా : 84

భారత రాజ్యాంగము

అను :
కాశీనాధుని పూర్ణమల్లిఖార్జునుడు
ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ
తెనాలి

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 342. 54
భార–రా
2 పుటలు : xxii, 326,v
3 ఎత్తు : 25 సెం. మీ.
4 ప్రచురణ సం : 1961
5 ప్రవేశ సంఖ్య : 1084

342.54
భార–రా భారతదేశం
[రాజ్యాంగం]
భారత రాజ్యాంగము/అనువాదం
కాశీనాధుని పూర్ణమల్లిఖార్జునుడు. —
తెనాలి : ఓరియంట్, 1961.
1084 xxii, 326, v పు.; 25 సెం. మీ.
1 భారతదేశం I పూర్ణమల్లిఖార్జునుడు
కాశీనాధుని, అను.

రాజ్యాంగ గ్రంథాన్ని సంక్షిప్తీకరించినట్లయితే తగ్గించిన వారి పేరనే శీర్షికచేయవలసి ఉంటుంది.

మరొక ఉదా: 85

# ఆంధ్రప్రదేశ్ అమ్మకపు పన్ను చట్టము

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ

ఇతర వివరాలు

1 పరిచయసంకేతం: 336.2026
ఆంధ్ర-అ

2 పుటలు: 130

3 ఎత్తు: 18.5 సెం. మీ.

4 ప్రచురణ సం: 1957

5 ప్రవేశ సంఖ్య: 1087

6 సంకలనము : పుత్సల సత్యనారాయణ. ఇతర ఆధారాలతో పేకరించ బడినది.

336.2026
ఆంధ్ర—అ ఆంధ్రప్రదేశ్
[అమ్మకపు పన్ను చట్టము] ఆంధ్రప్రదేశ్ అమ్మకపు పన్ను చట్టం/ [సంకలనము పుత్సల సత్యన్నారాయణ]
— విజయవాడ: విశాలాంధ్ర, 1957.
1087 130పు.; 19సెం. మీ.
1 ఆంధ్రప్రదేశ్—పన్నులు I గ్రం. నా.

# 28 పత్రికలు : ధారావాహికలు

నిర్దిష్ట కాలపరిమితిలో ప్రచురించే సంచికను పత్రిక (పీరియాడికల్) అంటారు. దినపత్రికలు ఇందు కలసి ఉంటాయి. కాల పరిమితితోనూ, పరిమితి లేక ప్రచురించే వాటిని ధారావాహికలు "సీరియల్స్" అంటారు. ఈ పత్రికలతోబాటు ఎ.ఎ.సి.ఆర్–2 ప్రకారం ఈ దిగువ ఉదహరించినవి ధారావాహికలు—అనే విభాగం క్రిందికి వస్తాయి.

1 పత్రికలు, దినపత్రికలు

2 వార్షిక గ్రంథాలు (ఇయర్ బుక్స్)

3 వార్షిక నివేదికలు (యాన్యుయల్ రిపోర్ట్సు)

4 మహా సభల వృత్తాంతాలు (కాన్ఫరెన్స్ ప్రొసీడింగ్స్ ట్రాన్సాక్షన్స్)

5 క్రమ సంఖ్యతో ప్రచురితమయ్యే చిన్న పుస్తకాలు (మానోగ్రాఫ్స్)

విజ్ఞానలోకంలో పత్రికా ప్రచురణకు ప్రముఖమైన స్థానం ఉంది. పుస్తకాలకంటే అత్యంత తాజా సమాచారం పత్రికలలో ఉంటుంది. పైగా పత్రికలలో వచ్చే చాల భాగం రచనలు పుస్తకరూపంలో రావు. అందుచేత ముందు ముందు పనికి వచ్చే ముఖ్యమైన పత్రికలను సంపుటాలుగా బైండు చేయవలసి ఉంటుంది. కొన్ని పత్రికల వారు సంవత్సరాంతంలో అన్ని సంచికలకు కలిపి విషయ సూచికను, అనుక్రమణికను పంపే అలవాటున్నపుడు ఈ రెంటినీ సంపుటం ముందు, వెనుక చేర్చితే ఎంతో ప్రయోజనకరంగా ఉంటుంది.

పత్రికలను వ్యక్తి, సంస్థ, సంఘం, ప్రభుత్వం – ఎవరు ప్రచురించినా పత్రికను ఇటీవలి పేరుతోనే శీర్షిక చేయాలి. పూర్వ నామం ఉంటే దానికి ఉపపద్దు చేయాలి. గ్రంథాలయంలో సంపుటాలు గల పత్రికకు ఏదైనా సంపుటం తగ్గినా, సంచిక తగ్గినా

వాటి వివరాలు ప్రధాన పద్దులో పెన్సిల్‌తో గుర్తించ వలసి ఉంటుంది. తగ్గినవి సంపాదించినపుడు పెన్సిలు గుర్తులు తుడిచి వేసి మామూలుగా రాయవచ్చు/టైపు చేయవచ్చు.

ఆంగ్లో అమెరికన్ గ్రంథాలయ సంఘ నియమావళిలో నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వాలు, దర్శినులు, వార్షిక గ్రంథాలు, పత్రికల సంపుటాలు మొదలైనవి సూచీ పేటికలో ప్రత్యేకంగా, స్పష్టంగా కనిపించే నిమిత్తం ప్రత్యేక హద్దు (హాంగింగ్ ఇండెన్షన్) ఈ తరగతికి చెందిన వివరాలు నమోదు చేస్తారు. ఇందు శీర్షిక ప్రధాన పద్దునుంచే ప్రారంభమౌతుంది. మిగతా విషయం యావత్తు రెండవ హద్దునుంచి ప్రారంభమై అచటి నుంచే కొనసాగుతుంది. మొదటి హద్దులోకి విషయం ప్రవేశించ రాదు.

నూతన నియమాల ప్రకారం పత్రికా సంపుటాలకు సిద్ధం చేసే ప్రధాన పద్దు స్వరూపం ఇలా ఉంటుంది.

పత్రిక పేరు/ప్రచురణ బాధ్యతలు . — కూర్పు వివరాలు. —
  సంపుటి, సంచికాది వివరాలు . — ప్రచురణ స్థలం:
  ప్రచురణ కర్త, తేదీ—
  భౌతిక వివరాలు— (మాల—)
  ఆవృత్తి వివరణ
  ప్రమాణసంఖ్య

గమనిక :

1 పత్రిక పేరు యథాతథంగా చేర్చడం మేలు. పత్రిక పేరు పెద్దదైనప్పుడు తగ్గిస్తే భావం తగ్గకుండా చూడాలి.

2 ప్రచురణకు బాధ్యుడైన వ్యక్తి లేదా సంస్థ పేరు చేర్చాలి. పత్రిక పేరులోనే సంస్థ పేరుంటే మరల చేర్చాల్సిన పనిలేదు.

3 స్థానిక ఎడిషన్, బ్రైలీ ఎడిషన్, మైక్రోఫిల్మ్ ఎడిషన్ మొ. వివరాలు అవసరం ఉంటే చేర్చాలి.

4 సంపుట, సంచికాది వివరం అన్నిచోట్ల— ఈ పత్రిక తొలి ప్రతి సంచిక తేదీ ఉదహరించాలి. తాజా సంచిక సంఖ్య పెన్సిల్‌తో మాత్రం రాయాలి. ఈ పత్రి కను తెప్పించడం ఆపేస్తే చివరి సంచిక సంఖ్య సిరాతో రాయాలి. లేదా టైపు చేయాలి. మధ్యలో కొన్ని సంచికలు తగ్గితే ఆ వివరం ఉండాలి.

5 ఆంగ్ల పత్రికలకు ఐ.ఎస్.ఎస్. నంబరు చేర్చవలసి ఉంటుంది.

6 పత్రికపేరు మధ్యలో మారితే కొత్తపేరు క్రిందే శీర్షిక చేస్తూ పద్దు చివర ఇలా చేర్చాలి. ఉదా : తొలినామం...

7 ఒక పత్రికలో మరో పత్రిక కలిపేస్తే ఆ విషయము చివర ఇలా చేర్చాలి. ఉదా: ఈ పత్రిక 19— లో—

8 ఒక పత్రికను రెండుగా విభజించినా ఆ వివరణ ఉండాలి.

పత్రికలు

ఉదా : 86

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 44 ఫిబ్రవరి 1987 సంచిక 2

సంవత్సర చందా
18 రూపాయలు

దీర్ఘ కాలిక చందా
200 రూపాయలు

శ్రీ రామకృష్ణ మఠము
మద్రాసు– 600 004

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 294.505
శ్రీరా–శ్రీ

2 ఎత్తు : 25 సెం.మీ.

3 ప్రవేశ సంఖ్య : 1267

4 ప్రతి ఇంగ్లీషు నెల మొదటి వారములో వెలువడును.

294.505
శ్రీరా–శ్రీ శ్రీ రామకృష్ణ ప్రభ/శ్రీరామకృష్ణ మఠము . —
సం.1. సంచి.1 (1943) — — మద్రాసు:
శ్రీరామకృష్ణ మఠము, 1943 –
సం.; 25 సెం.మీ.
మాస పత్రిక
గ్రంథాలయంలో 2, 9, 12 సంపుటాలు లేవు.
1 హిందూమతం– పత్రికలు I శ్రీరామకృష్ణ
మఠము

గమనిక

గ్రంథాలయంలో లేని సంపుటాలను ఇతర వివరాలలో తెలుపవలెను. పత్రిక ప్రచురించు సంస్థకు ఉపపద్దు చేయవలెను.

పత్రికలు

పత్రికలకు వాటిపేరు మీదుగానే శీర్షిక చేయాలి. అందుకు తోడు పత్రిక యాజమాన్యం వారి సంస్థ/సంఘం పేరు చేర్చవలెను.

ఉదా : 87

గ్రంథాలయ సర్వస్వము

సంపుటి 1 సంచిక 1 1915

ఆంధ్ర దేశ గ్రంథ భాండాగార సంఘ పక్షమున
సంవత్సరమునకు నాలుగు సంచికల చొప్పున
ప్రకటింపబడు గ్రంథము
వార్షిక మూల్యము కూలీతో రు 2.60 మాత్రము
కార్యస్థానము : బెజవాడ

ఇతర వివరాలు

1 పరిచయ సంకేతం : 020.5
గ్రం స—ఆం
2 ఎత్తు : 24.5 సెం.మీ
3 ప్రచురణ సం : 1915 నుంచి ప్రారంభం
4 ప్రవేశ సంఖ్య : 1088

020.5
గ్రం స—ఆం గ్రంథాలయ సర్వస్వము/ఆంధ్రదేశ గ్రంథ భాండాగార సంఘం.— సం. 1. — సంచి. 1 (1915) — — బెజవాడ : ఆం. దే. గ్రం. భాండాగార సంఘం, 1915 — సం.; 25సెం.మీ.

త్రైమాసపత్రిక . — ప్రస్తుతం మాస పత్రికగా కొనసాగుతోంది. — 47వ సం. ప్రచురణ సాగుతోంది. — సంపాదకుడు : (1949—) పాతూరి నాగభూషణం. — గ్రంథాలయంలో 20 నుంచి 26 సంపుటాలు లేవు.

1 గ్రంథాలయ విజ్ఞానం — పత్రికలు I ఆంధ్రదేశ గ్రంథ భాండాగార సంఘం.

